# చండనృపాల చరిత్రము.

(చరిత్రాత్మక పద్యకావ్యము.)

గ్రంథకర్త:

వీరమతీ, పద్మావతీవిజయ, రాణాప్రతాపసింహ రామాయణనాటక రచయితలు

"కవిసింహ, అవధానిపంచానన, కావ్యకళానిధి" బిరుదాంచితులు

దుర్భాక రాజశేఖర శతావధానిగారు,

ప్రొద్దుటూరు.






ప్రథమముద్రణము. 500 ప్రతులు.

శ్రీ కన్యకాపరమేశ్వరీ ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడినది.

1934.



[వెల. 0-12-0



కవిసింహ & అవధాని పంచానన, దుర్భాక రాజశేఖర శతావధాని,
ప్రొద్దుటూరు.

# విజ్ఞప్తి



సమగ్రముగఁ గాకున్నను భారతదేశమునకుఁ గొంతవఱకైనను జరిత్రములేని లోపముఁ దొలఁగించిన వారిలోఁ లెప్టనెంటు కర్నల్ జేమ్సు టాడ్డుదొరగారు పూర్వాభిగణ్యులు. రాజకీయోద్యోగి (Political Agent) గానున్న యిరువదిమూఁడేండ్లును దొరగారు తమ యమూల్య వ్యవధినంతయు వినియోగించి, దేశ మెల్లెడ సంచరించి, వివిధాంశముల సేకరించి, రాజస్థాన దివ్యచరిత్రము నేర్చి కూర్చిరి. దొరగారు తమ జీవరక్తమును నింపి గ్రంథము రూపొందఁజేసిరనుట సహజోక్తియగును. భానువంశమహారాజులయెడ నంతటి భక్తుఁడును భారతదేశమునెడ నంతటి యభిమానియు నుండఁడని నావిశ్వాసము.

ఆయన రచించిన గ్రంథభాగములలో "మహారాణాప్రతాపసింహచరిత్ర" ముత్తమోత్తమమై విశ్వాదర్శమై వెలుంగొందుచున్నది. అందందు వీరరస మహాతరంగములవంటి చిన్న చిన్న చరిత్రములు పెక్కులు గలవు. వానిలో నీ చండనృపాలుని చరిత్ర మొకఁడు. మేవాడదేశ మహీమండలాఖండలులలోఁ జండుఁడు నిబిడతేజమున వెలసిన మార్తాండమూర్తి. బాల్యమునుండి పరమ వీరవర్తనమున వెలసిన ధీరుఁడు, నిరుపమాన సౌజన్యసదనము. ధర్మనిష్ఠుఁడు. దయార్ద్రహృదయుఁడు.

తండ్రియగు లఘుమహారాజు నెమర మాటపట్టింపు వచ్చి స్వర్గతుల్యమగు మేవాడ రాజ్యపావనాధిపత్యముఁ దృణముగ భావించి, పరిత్యజించి, ధర్మపథమునుండి యావంతయైనఁ దొలఁగక నిలిచిన నిశ్చల ధర్మమూర్తి. ధర్మమునందేగాక దర్పమునందును దయాదాక్షిణ్యముల యందును దప్పక భీష్మానుయాయి. తనకు రావలసిన మహాసామ్రాజ్యమును విడిచి సవతితల్లి కొడుకును రాజుఁజేసి సేవించి యతనికై జీవితము ధారపోసిన యుదారవీరశిఖామణి.

ఇతివృత్తమంతయుఁ జరిత్రాత్మకము. వీరరసపుంజమైన యిట్టి ధీరుని చరిత్ర మాంధ్రసారస్వతమున నూతనామూల్యభూషణముగ నలరారునని విశ్వసించి పద్యగ్రంథముగ వెలయించితిని.

ఈగ్రంథ ముద్రణాదులపట్టున నాకన్నివిధములఁ దోడ్పడిన నాయభేదమిత్రుఁడు కవిసింహావధానిపంచానన జి. వెంకటశేషశాస్త్రి శతావధానిగారియెడఁ గృతజ్ఞత వహించుచున్నాను. ముద్రణమున కగు ద్రవ్యము నొసంగి యుపకరించిన బుడ్డాయపల్లె వాస్తవ్యులును మా ప్రియశిష్యులునగు శ్రీయుత కాచన నారాయణరెడ్డిగారి నెంతయు నభినందించుచున్నాను.

ఇందేమేని గుణలేశము కనఁబడిన సహృదయులు గ్రహించి మన్నించిన నేను గృతకృత్యుఁడనని విన్నవించుచు నింతటితో నుపరమించుచున్నాఁడను.

ఇట్లు

ప్రొద్దుటూరు.
1—1—1934.



"కవిసింహ, అవధానిపంచానన, కావ్యకళానిధి"
రాజశేఖరశతావధాని.

శ్రీ

కామేశ్వర్యైనమః



# చండనృపాలచరిత్ర.

## పూర్వపీఠిక.

శా॥ శ్రీనాథాబ్జభవాది దైవతవిభుల్ ♦ చిన్నారి కన్నన్న నె
వ్వానిన్ సంతతభక్తిఁ గొల్చెదరు వి ♦ శ్వంబెల్ల నాత్మానుకం
పానైశ్చల్యము మీఱఁ బ్రోచు నెవఁడా ♦ ప్రాలేయశైలేంద్రజా
తానాథుండిడు భోగయోగము లమం ♦ దశ్రీసముల్లాసముల్. 1.

సీ॥ కలశాంబునిధిమొద ♦ ల్గా సప్తజలనిధులను జలంబు మషీజ ♦ లంబుగాఁగ
నాదిమధ్యాంతంబు ♦ లరయంగరాని యా తారాపథంబు ప ♦ త్రంబుగాఁగ
వేయితలలతోడ ♦ వెలుఁగొందుచుండెడు ఫణిలోకపతి మహా ♦ వక్తగాఁగఁ
గరసహస్రంబుతో ♦ మెఱసి వర్తించు నా కమలమిత్రుఁడు వ్రాఁత ♦ కాఁడుగాఁగ

గీ॥ విమలనక్షత్రతతు లక్ష ♦ రములుగాఁగ। వ్రాసినను నేమొ దివ్యప్ర ♦ భావలవము
పలుక లేరట్టి మాయమ్మ ♦ భవునికొమ్మ। త్రిపురసుందరి నన్నుఁబ్రోచుఁ ♦ దేజమొసఁగి. 2.

మ॥ లలితా! నీకృప సుంత తక్కువగువే ♦ ళన్ దుస్సహుండౌ మహా
బలుఁడే సన్నని గడ్డిపోఁచను గద ♦ ల్పన్ లేఁడు; నీసత్కృపా
బలమున్నన్ గడుదుర్బలాత్ముఁ డయినన్ ♦ బ్రహ్మాండభాండంబు ముం
దల మోయున్ జుమి; నీవె సర్వమున కా ♦ ధారంబు కామేశ్వరీ! 3.

సీ॥ ఏమహామహుఁడు సం ♦ స్కృతపాండితిని గొప్ప పర్వతంబని నుతుల్ ♦ పడయఁగలిగె
నేఘనుం డాంధ్రమం ♦ దెల్లపండితులచే దిగ్దంతి యనుచుఁ గీ ♦ ర్తింపఁబడియె
నేసద్గుణార్ణవుం ♦ డెల్లెడఁ దర్కసింహుఁడటంచుఁ బెనుకీర్తి ♦ నొందఁగలిగె
నేకళావిదుఁడు వై ♦ యాకరణుల నిట్టి ఘనుఁడు లేఁడనుచు వి ♦ ఖ్యాతిఁగాంచె

గీ॥ నట్టి కందాళ్లవంశసు ♦ ధాంబురాశి। చంద్రుఁడైన దాసాచార్య ♦ సత్తముండు
గురుఁడు దైవంబు; తత్పాద ♦ సరసిజములు। స్వాంతమున నెంచువాఁడ న ♦ పారభక్తి. 4.

చ॥ పనివిని నిల్చునేటి పరమ ♦ పావనమం చధికారులెల్లఁ బా
దనలినముల్ శిరంబునను ♦ దాల్చి చరించుట దేహళీపురం

బునఁగల పాఠశాల బుధ ♦ పుంగవుఁ డాంధ్రపుఁబండితుండుగాఁ
బనియొనరించి శిష్యులను ♦ బండితులన్ బొనరించెఁ బెక్కురన్. 5.

మ॥ అనయంబాంగ్లపుఁ బాఠశాల నొగి వి ♦ ద్యన్ జెప్పినన్ సౌరభా
షను దర్కంబును శబ్దశాస్త్రమును శి ♦ ష్యశ్రేణి కన్నంబు గు
డ్డను దానిచ్చుచు నేర్పె; నయ్యనఘు నీ ♦ డన్ విజ్ఞులై కీర్తిమో
సినవా రెందఱో పండితోత్తములు వా ♦ సిన్ గాంత్రు దత్తావనిన్. 6.

ఉ॥ నేరువలేమి శిష్యులది ♦ నిక్కము లోపముగాని సర్వవి
ద్యారమణుం డతం డెఱుఁగ ♦ నట్టిది విద్యయొకండులేదు; బం
గారపుఁగొండదాపునకుఁ ♦ గల్పకభూజ సమీపభూమికిన్
జేరినవారు భాగ్యములు ♦ చెందకయుండిన లోప మేరిదో! 7.

మ॥ తననాథుం డొనరించు సత్కృతుల కు ♦ త్సాహంబునన్ దోడు సే
యను గాంక్షించి సహస్రహస్తముల శి ♦ ష్యశ్రేణిఁ బోషింపనే
ర్చిన మత్సద్గురుమానినీతిలక మా ♦ శ్రీరంగమాంబామహా
జననీరత్నముఁ గొల్తు నెల్లపుడు సా ♦ ధ్వీ దిందిరాదేవిగన్. 8.

మ॥ తనసౌజన్యము సజ్జనుల్ పొగడ ని ♦ త్యంబున్ సదాచారవ
ర్తన మొప్పార గురుండు దైవమగుచున్ ♦ బ్రహ్మోపదేశాది పా
వనకృత్యంబులు నాకుఁ దీర్చిన ఘనున్ ♦ బ్రఖ్యాతచారిత్రు మ
జ్జనకున్ వెంకటరామయార్యు మదిలో ♦ సద్భక్తిఁ గీర్తించెదన్. 9.

క॥ నన్నయ్య మొదలుగా నేఁడున్న కవీశ్వరులవఱకు ♦ నురుకవులను సం
పన్నప్రతిభాఢ్యులఁ దలఁతు నన్నాహృదయంబునందుఁ ♦ దొరఁపుభక్తిన్. 10.

మ॥ కవు లత్యుత్తమకావ్యరాజముల లో ♦ కంబాతటన్ నింపి జ్ఞా
నవికాసంబును గూర్పకుండినను బై ♦ నన్ దేవుఁడే లేఁడటం
చవివేకంబున మున్గి మర్త్యులును దు ♦ ర్వ్యాపారతన్ జేసి లో
కవినాశంబొనరించియుండుదురు మౌ ♦ ర్ఖ్యంబూని పాపండులై. 11.

చ॥ సరసత భావనాబలము ♦ చక్కనిపాండితి యొప్పు సూప న
క్షరపరమాణువుల్ గొనుచుఁ ♦ గావ్యజగంబులఁ బెంచుచున్ నిరం
తరమును దేశమున్ బ్రకర ♦ ణస్థిరలీలలఁ గొల్చు సత్కవీ
శ్వరచతురాననాళిఁ గొలు ♦ వన్ దగదే మఱి రాజరాజులున్. 12.

త్కవివరుఁడైన కొడ్డుదొర; ♦ తప్పక యందలి నాయకోత్తముల్
భువిని జరించిరీమనలఁ ♦ బోలె యథార్థ శరీర ధారులై. 20.

సీ॥ బాల్యంబు నందుగ్గు ♦ పాలతో మానంబు ప్రాణంబునకు నెక్కు ♦ డనుట నేర్చి
నాలుగడ్డులు పెట్టి ♦ నడయాడు వేళనే చదువును సామును ♦ స్వారి నేర్చి
ప్రాయమొందకముందె ♦ పరమపావనయశశ్చంద్రిక లెల్లెడఁ ♦ జల్ల నేర్చి
చేపట్టినాతని ♦ శ్రీమహావిష్ణుఁగాఁ గొలిచి సతీత్వంబు ♦ నిలుప నేర్చి
గీ॥ యుద్ధవేళల మగలను ♦ ప్రోత్సహించి। వలయుచోఁ బ్రాణములు తారు ♦ వదలనేర్చి
చూపఱకు భద్రకాళీస్వ ♦ రూపలైన। ధీరమతులు రాజస్థాన ♦ దేశసతులు. 21.

ఉ॥ ఈయెడఁ బక్షపాత మొక ♦ యింత వహింపక చర్చసేయ రా
మాయణ భారతాదుల స ♦ మగ్రగుణాఢ్యులు కొంద ఱుందు రిం
దో యరయంగ నూటికిని ♦ దొంబది తొమ్మిది మంది యుందు రా
హా! యరులైన మెచ్చెడు మ ♦ హాగుణరాసులు రాజపుత్రకుల్. 22.

సీ॥ భారతమును భాగ ♦ వతమంత పెఱుగు శౌర్యకథనములు లేని ♦ రాజు లేఁడు
విశ్వప్రళయభంగిఁ ♦ బెక్కుయుద్ధంబులఁ గానని దొక్క దు ♦ ర్గంబు లేదు
పూర్వరాజుల రక్త ♦ ములఁ బునీతమయి ప్రఖ్యాతినొందని దొక్క ♦ కనుమ లేదు
తౌరుష్కసుభట మ ♦ స్త్రములు లక్షలు చెంత రాలని దొక్క ద్వా ♦ రంబు లేదు
గీ॥ యవన నృప గర్వ నిర్వాప ♦ ణాతికీర్తి। కలననో దాని మించు లో ♦ కత్రయైక
పూజ్య యశమిచ్చు నపజయం ♦ బునను వెలుఁగ। నట్టి చోటంగుళంబైన ♦ నచట లేదు. 23

సీ॥ సత్యంబుకొఱకు యో ♦ షాపుత్రకుల నమ్మి మాలనిఁ గొలిచిన ♦ మానధనులు
శరణాగతులఁ బ్రోవ ♦ స్వశరీరమునను గండలు చెండి యిచ్చు వి ♦ జ్ఞాన నిధులు
నాకాశగంగ ని ♦ య్యవనికిఁ దెప్పించి పితరులఁ గాపాడు ♦ విశ్వనుతులు
జనకాజ్ఞఁ బాలింప ♦ వనముల కేగి కష్టపరంపరల నొందు ♦ సరళమతులు
గీ॥ తొడరి బ్రహ్మాండభాండంబు ♦ తుల నిడినను। నొక్కరొక్కరె తూఁగఁగా ♦ యోగ్యులగుచు
సురుచిరచరిత్రులైన రా ♦ జులు వసించు। వజ్రమయ హర్మ్యరాజంబు ♦ భానుకులము. 24.

క॥ క్షీరాంబురాశిఁ బోలిన। శ్రీరాముని లవునికులము ♦ సిరి వెలయఁగ ధా
త్రీరమణు లవతరించి ర। పారప్రభ వెలుఁగు వజ్రపూవుపటలము మాడ్కిన్. 25.

సీ॥ పారసీకము మొదల్ ♦ వారణాశివఱకు వసుధాతలము నేలె ♦ బప్పరావు
యవనాబ్ధి కుంభసం ♦ భవుఁడౌచు క్షితిమహోత్సాహియై యేలె రా ♦ ణాహమీరుఁ

డాసియాఖండ ది ♦ వ్యాకాశమార్తాండుఁ డన నెప్పె సమరసిం ♦ హప్రభుండు
మేవాడ సంపత్స ♦ మృద్ధంబుచేసి పాలన మొనరించె నా ♦ లఘునృపుండు

గీ॥ వారిలో నెక్కఁడొకఁడు వి ♦ శ్వమున కెత్తు। నతులదివ్య విద్యుజ్జ్యోతు ♦ లైరహింత్రు;
సూర్యకులముదూరంబుంచి ♦ చూతు మేని। యఖిలభువనంబు లంధకా ♦ రావృతములు. 26.

మ॥ కమలాప్తాన్వయరత్న మార్తజన దీ ♦ నోదత్తుఁ డుద్యత్పరా
క్రమధౌరేయుఁ డహార్యధైర్యుఁడు విప ♦ క్షవ్రాతవిధ్వంసి వీ
రమహాధర్మపరాయణుండగు మహా ♦ రాణాప్రతాపుండు; త
త్సము లీసప్తసముద్రవేష్టిత మహీ ♦ చక్రంబునం దుందురే? 27.

చ॥ శిర మొకమాఱు వాల్చినను ♦ జేపడు ధారిణిరాజ్య మంచు న
క్బరునృపమౌళి పల్కఁ గుల ♦ గౌరవమెంచుచు రాజ్యదూరుఁడై
యిరువదియైదు వత్సరము ♦ లెన్నియొ బాధలకోర్చి శత్రులన్
దురమున నోర్చె నెక్కుఁడతి ♦ దుస్సహ వీర మహావ్రతంబునన్. 28.

చ॥ అనుపమరాజపుత్ర ధర ♦ యంతటికిన్ బరిపూర్ణచంద్రముం
డనఁదగు రాజసింహ వసు ♦ ధాధిపసింహుఁడు సూర్యవంశ వ
ర్ధనుఁడు ప్రతాపుమన్నఁ డరి ♦ రాజకృతాంతుఁడు రాజపుత్రకా
వనిపయిఁ దప్ప నిట్టిగుణ ♦ పావనులుండరు వేఱుచోటులన్. 29.

మ॥ మును పింగ్లాండునయందు "సింహహృదయం ♦ బున్ గాంచు 'రిచ్చర్డు,' ఫ్రా
న్సున రారాజు 'నెపోలియా,' నిటలియం ♦ దున్ 'సీజరున్' ధీరులై
చని రవ్వారల వీరవృత్తికిని రా ♦ జస్థాన రాజేంద్రనం
దన శౌర్యోజ్జ్వలవర్తనంబునకు భే ♦ దంబుండు నెంతేనియున్. 30.

చ॥ పరమవిశుద్ధవర్తను ల ♦ పారమహామహిమాభి శోభితుల్
పరసమవర్తిమూర్తు లన ♦ లప్రతిబింబము లట్టి మేదినీ
శ్వరుల లసచ్చరిత్రములు ♦ వ్రాసి మహోపకృతిన్ బొనర్చె టా
డ్డోర మఱువంగఁజెల్లని హి ♦ తుండవుగా మన కెల్లవారికిన్. 31.

ఉ॥ ఏరి యెడన్ గుణంబు గల ♦ దెవ్వరి పావనవర్తనంబు లా
చారము లెందు లక్ష్యముగ ♦ సర్వజనుల్ గ్రహియింపఁబోలు న
వ్వారల సచ్చరిత్రములు ♦ వ్రాసి ప్రపంచములోని వారికిన్
వారక తెల్పుచే సుకవి ♦ వర్యుల పాలిఁటి ముఖ్యధర్మముల్. 32.

ఉ॥ ఆదిమభాషయందున మ ♦ హాకవి వ్యాసుఁడు వ్రాసినట్టి య
ష్టాదశసత్పురాణముల ♦ సర్వము తెన్గున నన్నయాదు ల
య్యాదిని వ్రాసిపెట్టి రవి ♦ యాంధ్ర మహామహి నెల్లవారికిన్
వేదములట్టు లెంతయుఁ బ ♦ విత్రములై తనరారు చుండెడున్. 33.

క॥ పిదపఁ బురాణాంతర్గత। విదిత వివిధ కథలఁ గొనుచుఁ ♦ బెద్దన్నాదుల్
పెదునెనిమిది వర్ణనములు। గదియించి రచించి రఖిల ♦ కావ్యశ్రేణిన్. 34.

మ॥ సురభాషాఖనిలో పలన్ బొడమి మె ♦ చ్చుల్ గుల్కు నానాకథా
వరరత్నమ్ములఁ బూర్వసత్కవులు దీ ♦ వ్యచ్ఛేముషీశాణలన్
మెఱుఁగుల్ దీర్చి ప్రబంధభూషణము లె ♦ న్నే నాంధ్రభాషాసతీ
చరణమ్ముల్ వెలుఁగొందఁ గూర్చిరి మహా ♦ సద్భక్తి సంపూర్ణులై. 35.

చ॥ సకలపురాణసంతతి నె ♦ సంగిన గాథల నెల్లఁగూర్చి పూ
ర్వకవులు బుద్ధివైభవము ♦ రాజిలఁ గావ్యము లల్లిరింక నే
టికవులు "కావ్యముల్ తగ ఘ ♦ టింపఁగ గాథలు మంచివేవి" యం
చొకటఁ గదున్ గదున్ వెదకి ♦ యోపిక కోల్పడనయ్యె నెంతయున్. 36.

క॥ వాడిన గాథను గ్రమ్మఱ। వాడిన రుచితగ్గి విసుగు ♦ పడఁజేయు; మొదల్
పాడిన పాటనె మఱిమఱి। పాడిన శ్రోతలును సుకముఁ ♦ బడయఁగఁ గలరే? 37.

మ॥ అమలంబైతగు శైలి టాడ్డుదొర ము ♦ న్నాంగ్లంబునన్ వ్రాయఁ బ్రా
జ్ఞమణుల్ మెచ్చిన రాజపుత్రధరణీ ♦ చారిత్రమం దెన్ని భా
గములో వీరరసాబ్ధివీచికలుగాఁ ♦ గన్పట్టు; నందున్ బవి
త్రమగున్ జండుచరిత్ర; దీనిఁగొని ప ♦ ద్యగ్రంథమున్ వ్రాయుదున్. 38.

క॥ స్థల మార్యావర్తము; కథ। సలలితమగు దేశచరిత; ♦ చండుఁడు భూభృ
త్తిలకుండు; కైత కోమల। మలరుదురని నమ్మెదన్ బు ♦ ధాగ్రణు లెల్లన్. 39.

క॥ వీరమతీకథ కావ్యము। గా, రామాయణము నాట ♦ కమ్ములుగాఁగన్
గూరిచి రచియించితి రస। సారతఁ బద్మావతీ వి ♦ జయ నాటకమున్. 40.

—o—

# చండనృపాల చరిత్రము.

## ప్రథమాశ్వాసము.



శా॥ శ్రీరాణించు మనోజ్ఞరౌప్యకలశ ♦ శ్రేణీగతిన్ నూత్నశృం
గారంబొల్కెడు శృంగముల్ గల హిమ ♦ గ్రావం బుదీచీదిశన్
బారావారము తక్కుదిక్కులను బ ♦ ర్వన్ మేదినీకాంత కొ
ప్పారున్ భారతదేశ మచ్ఛమణి ది ♦ వ్యాలంక్రియాప్రాయమై. 1.

క॥ ఆవింధ్యాచల హిమవ ద్గ్రావంబుల నడుమఁ బరమ ♦ గంగాతటినీ
పావనమై వెలుఁగుచు నా ర్యావర్తం బనఁగ దేశ ♦ మది యలరారున్. 2.

శా॥ ఏవారేఁ దలఁదాల్ప నొప్పు విభవం ♦ బింపార సొంపారు నా
ర్యావర్తాంగన మోమునందిడిన ర ♦ మ్యంబైన కప్రంపుబొ
ట్టై విశ్వస్తుతకీర్తిసంపదలఁ బూ ♦ జ్యంబై విరాజిల్లుచున్
మేవాడ్ దేశము రాజపుత్రకులకున్ ♦ మించున్ సుఖావాసమై. 3.

సీ॥ ఎత్తై నభంబంటు ♦ నేడుకోటలతోడ సప్తమహాద్వార ♦ సమితితోడ
నపరంజిదాపు దే ♦ వాలయంబులతోడ బహుళ జయస్తంభ ♦ పటలితోడ
జలము సమృద్ధమై ♦ వెలయు బావులతోడఁ గడలియంతటి తటా ♦ కములతోడఁ
దఱుఁగని బహువిధ ♦ ధాన్యశాలలతోడ ముక్కారు పండెడు ♦ పొలముతోడఁ

గీ॥ గొలత యిడరాని చతురంగ ♦ బలముతోడ వృద్ధిగను ముప్పదియువేల ♦ యిండ్లతోడ
వఱలి విశ్వోన్నతంబైన ♦ వైభవమున నొప్పు సిరిపుట్టినిల్లు చి ♦ త్తూర్పురంబు. 4.

గీ॥ భరతఖండైకలక్ష్మిని ♦ వాసభూమి యైన మేవాడ రాజ్యంబు ♦ నఖిలధర్మ
నిరతుఁడై లోకవందిత ♦ చరితుఁడగుచు నేలుకొనుచుండె నపుడు రా ♦ ణాలఘుండు. 5.

మ॥ వనజాతాప్తకులాబ్ధి శీతకరుఁడై ♦ భాసిల్లు రాణాహమీ
రుని సత్సంతతిలోనివాఁడగుటఁ బూ ♦ ర్వుల్ చన్న సన్మార్గమం
దునఁ దానున్ జని కాలుఁడంచని యరా ♦ తుల్ భీతిలన్ దిగ్జయం
బును గావించి ప్రజాళి నేలె ననయం ♦ బున్ రామచంద్రుండటుల్. 6.

గీ॥ అఖిలజనసమ్మతముగ రా ♦ జ్యముసలుపుచు మహితగుణధుర్య తనయగ్ర ♦ మహిషియందు
సూర్యచంద్రులఁబోలు తే ♦ జోనిధులను గొడుకులను నిర్వురను గాంచెఁ ♦ బుడమిఱేఁడు. 7.

ఉ॥ నిండిన రూపరేఖ మరు ♦ నిన్ నిరసించు కుమారులందు జ్యే
ష్ఠుండగువాఁడు ధీరగుణ ♦ శూరుఁడు చండుఁడు; వాఁడు చండమా
ర్తాండుఁడె సంగరక్షితి న ♦ రాతులఁ దాకి సహస్రకాండముల్
నిండుగ గుప్పుచున్ విజయ ♦ నిశ్చల గౌరవ మందు పట్టునన్. 8.

ఉ॥ రెండవవాఁడు సద్గుణగ ♦ రిష్ఠుఁడగున్ రఘుదేవుఁ డెంతొ శ్రే
ష్ఠుండు నభంబు పైఁబడిన ♦ సుంత కలంగని యట్టి ధీరశాం
తుండు సమస్తసత్కళల ♦ తో విలసిల్లుటఁజేసి పూర్ణచం
ద్రుండెయగున్ బ్రజాళికిఁ గ ♦ నుంగవ పండువు వీనిఁ జూచుటల్. 9.

గీ॥ అబ్జబాంధవు సంచార ♦ మైన మార్పు! గనినఁగనవచ్చుఁ జందుని ♦ వినుతధర్మ
వర్తనము మార్పుగన దట్టి ♦ భవ్యమూర్తి! యౌవరాజ్యాభిషిక్తుఁడై ♦ యలరుటరుదె! 10.

సీ॥ రాజ్యతంత్రముల మ ♦ ర్మమెఱింగి సేవించు నుద్యోగులొక్కచోట ♦ నుపచరింప
గళరావమలరారఁ ♦ గైవారములు సేయు భట్టసంఘము లొక్క ♦ ప్రక్కఁదనర
దేశచరిత్ర భ ♦ క్తినిదెల్పి వర్ణించు చారణతతి యొక్క ♦ సరసవెలయఁ
బరదేశమర్మంబు ♦ లెఱిఁగి యెఱింగించు నాంతరంగికు లొక్క ♦ యండనుండ

గీ॥ నఖిలసామంతనృపమకు ♦ టాగ్రరత్న! రాజి నీరాజితాంఘ్రియై ♦ రాజపుత్ర
రాజ్యమేలుచు లఘుమహా ♦ రాజరత్న! మోలగంబునఁ గొలువుండ ♦ నొక్కనాఁడు. 11.

శా॥ "దేవా! దేవరమిత్రుఁ డుజ్జ్వల య ♦ శస్తేజః ప్రభావుండు స
ద్భావుండౌ రణమల్లుఁ డంపుకొనఁ ద్వ ♦ త్పాదాంబుజ ద్వంద్వమున్
సేవింపంగను రాయబారి యిటవ ♦ చ్చెన్; సమ్మతంబైనచో
రావింతున్ జఁడి" యంచు సేవకుఁడనన్ ♦ రాణా మదిన్ బొంగుచున్. 12.

చ॥ "మనమలరారు నాకు రణ ♦ మల్లునిఁ జూచినయట్ల యాతఁడం
పిన యలరాయబారిఁ గనఁ ♦ బ్రీతిని దోడ్కొనిరమ్ము" నావుడున్
జని నృపభృత్యుఁ డాతనినిఁ ♦ జక్కఁగఁ దోడ్కొనివచ్చి నిల్పినన్
మనుజవరేణ్యుముందఱ, న ♦ మస్కృతిచేసి వినీతబుద్ధియై. 13.

మ॥ "రవివంశోత్తమ! మారువారువిభుఁడా ♦ రాఠోడ్కులాలంకృతుం
డవువాఁడా రణమల్లభూవిభుఁడు సౌ ♦ ఖ్యశ్రీసముల్లాస వై
భవముల్ మీఱఁగ నుండె నీకుశలసం ♦ పత్ప్రశ్నముల్ గూర్చి తా
వివరంబార నెఱుఁగ నన్నిటకుఁ బం ♦ పెన్ బ్రీతిపూర్వంబుగన్. 14.

క॥ నీదగు నెయ్యమునకుఁదో। డౌదట వియ్యంబుఁగోరి ♦ యాత్మజయగు హం
సాదేవిని నీయింటికి। నాదరమున నీయ మదిని ♦ నాస వహించెన్. 15.

చ॥ అతఁడు హితుండు సద్గుణగ ♦ ణాంకుఁడు; నీవు స్వయమ్ముగా నుదా
త్తతరమహామనస్కుఁడవు! ♦ తావకసన్నిధి నిట్లుసేయుమం
చితరులు పల్కనక్కఱ యి ♦ కింతయుఁ గల్గదు; ధర్మమర్మముల్
బతిహితముల్ దలంచి యొక ♦ భంగిని నీవొనరింపు కార్యముల్." 16.

మ॥ అని ప్రార్థించుచు రాయబారి తనదే ♦ శాచార ధర్మంబుఁదీ
ర్పను నానానవరత్నసంతతులు నీ ♦ రంధ్రింబుగాఁగప్పి యొ
ప్పినదా సామృతనారికేళఫల ము ♦ ర్వీభర్త పాదంబులుం
చిన సింహాసనసీమఁజేర దొరలిం ♦ చెన్ భక్తి దీపింపఁగన్. 17.

గీ॥ తనపదంబులచెంతఁ జే ♦ రిన సరత్న। నారికేళఫలము గైకొ ♦ నకయె మీస
ములను దువ్వుచు వింతన ♦ వ్వొలయనృపతి। యందఱువినంగ నిటులుతా ♦ ననియెనపుడు.

మ॥ "అవురా! లోక మెఱుంగనట్టి యొక చో ♦ ద్యంబేను గంటిన్ విశే
షవిలాసంబుల కాలయంబయిన హం ♦ సాదేవి లేఁబ్రాయపు
జ్జవరాల్మిన్నను మూఁడుకాళ్లముదుకన్ ♦ నాకిచ్చి వైవాహికం
పువిధిన్ దీర్పఁగఁగోరు నీతఁడు; జగం ♦ బుల్ చూచినన్ నవ్వవే! 19.

సీ॥ పలుకుపల్కనకుఁ దే ♦ నెలు చిందఁగా జాణతనపుమాటలు పల్కి ♦ తనుపనగునె
యేవేళకావేళ ♦ కింపైన పలువన్నెచిన్నెల మదిని రం ♦ జింపనగునె
జిలుఁగుహొంబట్టు దు ♦ వ్వలువలహరువు రెట్టింపఁగా బాళి పు ♦ ట్టింపనగునె
వదనాబ్జమునకు ష ♦ ట్పదమట్టి నూనూఁగు సొబగుమీసము లెక్క ♦ చూపనగునె
గీ॥ మానసం బిగురింపఁగా ♦ మేను పులక। రింపఁగా గాటముగఁ గౌఁగి ♦ లింపనగునె
యఱువదేడుల వృద్ధున ♦ కకట! యేల। తళుకుఁదలిరాకుఁబోఁడియౌ ♦ కులుకులాఁడి. 20

సీ॥ కండ మెండుగలేని ♦ కతనను వాడి వత్తయయి లోతుగనుండు ♦ దౌడతోడ
మతి కొంత వ్యత్యస్త ♦ గతినుండి యించుక వడకు గూరిన లోటు ♦ పలుకుతోడ
నలుపు మందునకైనఁ ♦ గలుగక కడుఁ బలుచనయౌచు నరయు మీ ♦ సములతోడ
బ్రమోడాకోయన సార ♦ ము రవంతలేక హేయమయి యెండిన దేహ ♦ యష్టితోడఁ
గీ॥ జికురసంపత్తిలేని మ ♦ స్తకముతోడ। నెవనియంతకు వాఁడె పె ♦ ల్లేవపడెడు
నఱువదేడుల వృద్ధున ♦ కకట! యేల। కులుకు వలి గుబ్బలాఁడియౌ ♦ వలపులాఁడి. 21.

చ॥ కులుకఁగవచ్చునో కలికి ♦ గోరులఁ జెక్కులు గ్రుచ్చవచ్చునో
కిలకిల నవ్వవచ్చునె స ♦ కిన్ దములంబిడి పంపవచ్చునో
వలపుల నింపవచ్చునె య ♦ వారణఁ గౌఁగిటఁ జేర్పవచ్చునో
నలినదళాయతేక్షణకు ♦ నాథుఁడు వృద్ధుఁడయై తనర్చినన్. 22.

చ॥ బలముగలట్టివానిఁ గల ♦ వాని మరున్నిరసించు రూపరే
ఖల నలరారువాని ధృతి ♦ గల్గినవానిఁ జెలుల్ వరించినన్
గలుగు సుఖంబు; కాని యిటు ♦ కాలము చెల్లిన నన్నువంటి తా
తల వరియించి యేసుఖముఁ ♦ దారుగడింత్రు వధూవతంసముల్! 23.

సీ॥ ఒకరు సయ్యాటల ♦ సుకమొందఁగోర వేఱొకరు లేవంగఁజా ♦ లక పరుండ
నొకరు విలాసంబు ♦ లొయ్యారములు సూప నొకరియంగములు వ ♦ డకు వెలార్ప
నొకరు సర్వసుఖంబు ♦ లొందఁగోరఁగ వేఱొకరు సర్వమున విము ♦ ఖతనుజూప
నొకరు ప్రపంచంబు ♦ నుప్పొంగిచూడ నొక్కరు సన్న్యసింపఁ గాం ♦ క్షలను బెంప
గీ॥ నొకరు ప్రాయంపుదశను వే ♦ ఱొకరు చరమ। దశ నొకరు మన్మథు నొకరు ♦ తజ్జనకుని
దలఁచుచును జిన్నిభార్య వృ ♦ ద్ధపతిగలిసి। చేయు కాపురమది కొంప ♦ చేటుగాదె." 24.

మ॥ అని రాణాలఘుఁడుర్ వచించు నపహా ♦ స్యాలాపసందోహముల్
విని సామంతనృపాలు ర"ష్డవునవుర్ ♦ వేదంపువాక్యంబు లిం
దు నసత్యంబు లవంబులే దతివ వృ ♦ ద్ధుర్ గూడి యేసౌఖ్యము
ల్గనఁగానేర్చు" నటంచు నవ్వఁగ నృపా ♦ లశ్రేష్ఠుఁ డప్డిట్లనుర్. 25.

సీ॥ "అలరించు మొలకని ♦ గ్గులకుఁ బైపాలిమేర కలికిమాటలకు వా ♦ కట్టుమందు
లలి నొయారపుఁ జెయ్వు ♦ లకును నైధనతార చెలిమిచక్కటులకుఁ ♦ జెల్లుచీటి
తమిమీఱు నందచం ♦ దముల కాశ్వాసాంత మఖిలమోహంబుల ♦ కాసవిఱుపు
కళలీను లేఁతన ♦ వ్వులకెల్ల సొంటికొ మ్మెల్లభోగంబుల ♦ కెదురుచుక్క
గీ॥ సకలసంసార సౌఖ్యంబు ♦ లకును బెద్ద। పిడుగు వృద్ధత్వ మదియెట్టి ♦ వీరమునుల
కైన భరమనితోఁపఁ బ్రా ♦ యంపుఁజెలులు। కోరికోరి వృద్ధుని గూడు ♦ కొనఁగనగునె! 26.

గీ॥ కూడఁదిరుగాడి గుజ్జెన ♦ గూళ్లువండి। బొమ్మలకుఁ దన కారగిం ♦ పులను దీర్చు
పనులకే కాక నే నికే ♦ పనికి నీడు। రాసుత కుపకరింతు నో ♦ రాయబారి!" 27.

మ॥ అన "మేల్ మేల్! సరిగా వచించితిరి ప్రా ♦ యంపుం బువుంబోడి వృ
ద్ధున కర్ధాంగియెయైన నాతని విప ♦ త్తుర్ జెప్పశక్యంబె మీ

రను నీవాక్యము లీశ్వరోక్తముల య ♦ ట్లౌ నిట్టి యుద్వాహబం
ధనముల్ దేవర త్రోసిపుచ్చుట జగ ♦ న్మాన్యంబుగా నొప్పెడిన్. 28.

గీ॥ చవిటికడ గాన మట్టులు ♦ చీఁకునకును। వనజరిపుబింబమట్లు వృ ♦ ద్ధునకుఁ దరుణి
యేల” యని చప్పటలుగొట్టి ♦ గేలిచేసి। రవనిపులు రాయబారి యా ♦ స్యంబు వంప. 29.

ఉ॥ “వారణయానలెందఱో వి ♦ వాహమునన్ ననుఁగూడినార లు
న్నారు; కుమారచంద్రుల మ ♦ నఃప్రభవ ప్రతిమాన రూపరే
ఖారమణీయు లిర్వురను ♦ గాంచితిఁ గాలము చెల్లెఁ గ్రాగి చ
ల్లారిన పాల నేల యక ♦ టా! మఱలన్ బ్రొయిమీఁదఁ బెట్టుటల్. 30.

మ॥ సతులన్ గూడి యనేకవర్షములు నే ♦ సంసారపున్ సౌఖ్యసం
గతులన్ జెందితి; శత్రులన్ గెలిచి యే ♦ కచ్ఛత్రమైయుండఁ బూ
జ్యత మేవాడ్విషయంబు నేలితిఁ బ్రపం ♦ చంబందు నేఁగోరఁద
గ్గ తలంపుల్ ఫలియించెఁ గాటికిపుడున్ ♦ గాల్సాచియుందున్ జుమీ! 31.

ఉ॥ కాకికి దొండపండువలెఁ ♦ గష్టజరాసమయంబునందు రా
కాకమనీయచంద్రముఖి ♦ కామిని హంస యదేలనాకు నే
నేకరణిన్ గ్రహింపఁగల ♦ నెట్లు నినున్ రణమల్లుఁడంపె నీ
వీకృతి కెట్లుపాల్పడితి ♦ వింద వివేకము లేకపోయెనే! 32.

ఉ॥ మీసము గడ్డమున్ నరయు ♦ మిక్కిలివృద్ధుఁడ; నాకు రూపరే
ఖాసమ హంసఁగూర్ప నెవఁ ♦ డైనను గోరునె! నీమహీవిభుం
డీసరణిన్ రచింపుమని ♦ యేటికనున్ బొరపాటు గల్గె హం
సాసతి మత్తనూజున కొ ♦ సంగఁగఁ బంపియయుండు నిన్నిటన్. 33.

క॥ బలమును బ్రాయము గల కాం। తల దృఢసత్త్వులకు నీయఁ ♦ దగుఁగాకే వృ
ద్ధులకిచ్చి పెండ్లిచేయుట। కలభము బిసకాండమునకుఁ ♦ గట్టుటకాదే! 34.

ఉ॥ కావున నేవచించెదు ప్ర ♦ కార మొనర్పు మదగ్రసూనుఁడా
భావజసుందరాకృతి య ♦ పారపరాక్రమరాశి ప్రాయమున్
లావు గలాఁడు చండుఁడు మ ♦ నఃప్రియుఁడై యల హంసనేలుఁబో
మ్మా వెస నారికేళఫల ♦ మాతనిచెంతకుఁ జేర్పు మియ్యెడన్.” 35.

క॥ అని లఘుఁడన సామంతులు। వినుచున్ జప్పటలు చరచి ♦ వెడనవ్వును న
వ్విన రాయబారి డిల్లప। డిన మోమున దైన్యమును గ ♦ డింది భయంబున్. 36.

మ॥ కనుపింపన్ గడుసంభ్రమంబుమెయి మో ♦ కాల్ పైననే నిల్చి "యో
జననాథాగ్రణి! నీకుమారునకు హం ♦ సాదేవి నీఁగోరుచున్
నను నేఁడా రణమల్లనేత యిటకున్ ♦ బంపించె నీ శ్రీపదో
ద్వని దర్శించుచు విన్నపంబు నిట వి ♦ న్నింపంగ నే వచ్చితిన్. 37.

గీ॥ చండుఁడిట లేఁడు బయటికిఁ ♦ జనెనటంచు। జనులనఁగఁ జింతిలితిఁగాని ♦ సమయమపుడు
కరముశుభమైనదగుట కొం ♦ కాయనీయఁ। దడవుసేయరాదనుచుఁ జి ♦ త్తమునఁదలఁచి. 38

గీ॥ చండునకు నాకు సామంత ♦ మండలాధి। పతుల కందఱకును బెద్ద ♦ వాఁడవగుట
నీయడుగుఁదమ్ములొద్ద కొం ♦ కాయనిడుట। తప్పుగాదని యుంచితి ♦ ధరణినాథ! 39.

క॥ ఆరణమల్లనృపాలుని। కోరిక చండునకు హంసఁ ♦ గూర్చుటయే; నా
నేరమిఁ గలిగెఁ బ్రమాదము;। నేరముగాఁ గొనకుమిది య ♦ నింద్యచరిత్రా! 40.

గీ॥ స్వామి! నీపరిపూర్ణ కృ ♦ పామృతంబు। ప్రాణరక్షయొనర్చె నా ♦ వంటివారి
కెందఱకొ"యంచు నతిచేసి ♦ యేగి రాయ। బారి చండునికడనిల్చి ♦ పలికె నిట్లు. 41.

క॥ "దేవా! వచింతు హంసా। దేవిని రణమల్లుపుత్రి ♦ దేవరదేవిన్
గావింపుమనుచుఁ బంచిన। నేవచ్చితి నపుడు మీర ♦ లిట లేరుసుఁడీ! 42.

మ॥ వరసామంతనృపాలశేఖరులు గొ ♦ ల్వన్ భూవిభుండున్న నం
దఱకున్ బెద్దయు నీకుఁ దండ్రియని చెం ♦ తన్ జేరి యాచారమున్
జరపన్ గోరుచు నారికేళఫలమున్ ♦ బాదంబులందుంచి యా
దరమొప్పారఁగ సంగ్రహింపుమని శ్ర ♦ ద్ధాభక్తులన్ వేడితిన్. 43.

గీ॥ ఏమితోఁచెనొకాని ధా ♦ త్రీశుఁడు గ్రహి। యింపఁడయ్యె గొల్లురనుచు ♦ నృపతులెల్ల
నవ్వి రిటమీరు చూచితి ♦ రవ్విధంబు। నధిప! నామందభాగ్యంబ ♦ యని తలంతు. 44.

క॥ పనివెంట వెలికిఁజని యొ। య్యన నింతకుముందె వచ్చి ♦ యఖిలమ్ముఁ గనుం
గొనినట్టి నీకు విన్నప। మొనరింపఁగనేల యంత ♦ యున్ విదితంబే. 45.

ఉ॥ ఇంతకు నీసమక్షమున ♦ కేగుమటంచని యానతిచ్చె క్ష్మా
కాంతుఁడు సర్వధర్మముల ♦ గౌరవమున్ గనినాఁడవీవు నీ
చెంత విశేషరీతిని వ ♦ చించుట యేటికి ధిక్కృతేందిరా
కాంతకు హంసకున్ దగిన ♦ కాంతుఁడవీవు నృపాలనందనా! 46.

క॥ ఆరణమల్లనృపాలుని। కోరిక నాప్రార్థనంబు ♦ గురునాజ్ఞయు హం
సారమణి మేలు దలఁచి మ। హీరమణకుమార! పెండ్లి ♦ కియ్యకొనఁగదే." 47.

మ॥ అని ప్రార్థించి యనర్ఘరత్నరుచిరం ♦ బై యొప్పు టెంకాయ నీ
యను యత్నించినఁ జందుఁ డుజ్జ్వలగుణుం ♦ డద్దానిఁ గైకోక మ
జ్జనకుండక్కట! చూపె మోటుదనముల్ ♦ జంద్రాననాకోటిఁ గూ
ర్చిన మర్యాదను వీటఁబుచ్చెను వచ ♦ శ్శ్రీచాతురిన్ జూపుచున్. 48.

చ॥ పొరపడి నారికేళఫల ♦ ముల్ దనచెంగట నుంచెఁగాక ని
త్తఱి నొకరీతినుండుచుఁ బ ♦ దంపడి తీర్పఁగరాదె యిష్టమౌ
కరణిని గార్యముల్ బరులు ♦ గన్న కుమారికఁ గూర్చి మాసముల్
వెఱుకుచు వార్త లంగడులు ♦ పెట్టుచు నమ్మఁగనేల తండ్రికిన్! 49.

చ॥ తనయుఁడ నేను జేకొనఁగఁ ♦ దగ్గ సతీమణి హంస; గౌరవం
బునెఱిఁగి వర్తిలన్ దగిన ♦ పూజ్యుఁడు దాను వివిక్తసీమగా
డినకులరాజకోటి వసి ♦ యించు సభాస్థలి; యందుఁగూడ నా
కనులకుముందు; గౌరవము ♦ గగ్గులకాడుగ నయ్యె నక్కటా! 50.

క॥ అసిధారాచర్యల నేఁ। బసితనముననుండి తిరుగు ♦ వాఁడను నాకీ
పసిలేనిపని గొడంబడఁ। బొసఁగు నటులఁ దోఁప దెట్లు ♦ బుద్ధి నరసినన్. 51.

గీ॥ తండ్రిపై నింద మోపుట ♦ తగవుగాదు। చూచి చూచి హంసను గ్రహిం ♦ చుటకు జిత్త
మనుమతింపదు లోకమే ♦ మైనఁదలఁపు। నిమ్ము; నేనెట్లొ యుత్తర ♦ మియ్యవలయు." 52

మ॥ అని చిత్తంబున నిర్ణయించుకొని తా ♦ నారాయబారిన్ గనుం
గొని "నేఁజూచితి వింటి సర్వమును నా ♦ కున్ గ్రొత్తఁగాఁ జెప్పఁగాఁ
బనిలేదింతయుఁ దండ్రికిన్ సతిగఁ గూ ♦ ర్పన్ బోలు హంసావధూ
టని బాణిగ్రహణంబొనర్చుటకు నా ♦ డెందంబు మోదించునే! 53.

మ॥ జనకుండున్ మఱిఁ బెద్దవాఁడు విభవ ♦ స్ఫారుండు సంపూజ్యుఁ డా
జననాథాగ్రణి భాగమం చిడిన హం ♦ సాదేవిఁ దత్పుత్రకుం
డను నేనెట్లు గ్రహించి ధర్మమును వీ ♦ డన్ నేర్తు! సూర్యాన్వయం
బునకున్ దుష్టకళంకమై యెటు ముఖం ♦ బున్ జూతు లోకంబునన్. 54.

గీ॥ దైవనిర్ణయ మటులుంటఁ ♦ దండ్రి చరణ। సీమ నారికేళఫలంబుఁ ♦ జేర్చియుంటి
వితరవిధమున నున్న నే ♦ నిందె యుండి। యుందు దాని నాయొద్ద నీ ♦ వుంచియుందు. 55

ఉ॥ నేరము మీరిదానని గ ♦ ణించుట కార్యముగాదు; ధర్మముల్
మీఱుట సర్వదేవతల ♦ మీఱుటయేయగు నిట్లధర్మ మె

ష్టే రచియించి నే నెఱుఁగ; ♦ నీవిదె కొబ్బరకాయఁ గొంచు మా
ర్వారును జేరఁబొమ్మ"నుచు ♦ రాసుతుఁడున్ వచియించి నంతటన్; 56.

చ॥ పిడుగు శిరంబునన్ బడిన ♦ ఏక, నభంబది పైనఁబ్రాలు నా
వడువున, రాయబారి తన ♦ భావము తద్దకలంగఁ, గొంతసే
పడలుచు నూఱకుండి, వసు ♦ ధాధిపనందను మోము చూచి "హా!
చెడియె మదీయజీవితము; ♦ చెప్పెడిదేమిఁక నాదు దుస్థితిన్. 57.

చ॥ ఇతఁ డవివేకియంచు జను ♦ లెల్లను నాడుకొనంగనయ్యె నా
స్థితి; రణమల్లభూవరుని ♦ జేరి ముఖం బెటు చూపువాఁడ! ధీ
రతముఁ డతండు సైచునె ప ♦ రాభవదుఃఖము! నాగళంబు ను
ద్ధతి నఱకించు నిశ్చయ మ ♦ తండు పురంబున కేను బోయినన్. 58.

క॥ తెలిసియుఁ దెలియక యిట నా। వలన నయిన యీప్రమాద ♦ భరము మనమునన్
నిలుపక, సేవకునెడ దయ। దలఁపుము; నే మఱువ నీప ♦ దద్వంద్వంబున్. 59.

చ॥ తెలుఁపఁగఁజాల నెక్కుడుగ ♦ దేవరముందఱ నాదు విన్నపం
బుల విని నారికేళఫల ♦ మున్ గ్రహియించి యనుగ్రహింపు; త
ప్పులు క్షమియింపుమ"న్న నృప ♦ పుత్రకుఁ "డక్కట! యొక్కనాల్కకున్
బలు కొకఁడుండుఁ గాని పలు ♦ పల్కులు పల్కెడు నాల్క నాల్కయే! 60.

క॥ తొలుతనె దీర్ఘాలోచన। సలుపఁగవలె సలిపి సలుపు ♦ సంభాషణమున్
నిలుపఁగవలెఁ దొలిగా నొక। పలుకు పిదప వేఱుపలుకు ♦ పలికిన నరుఁడే! 61.

గీ॥ నిన్ను వెనుకకుఁ బొమ్మన ♦ నీనృపాలు। నాజ్ఞ జరుపలేననఁగఁ గొం ♦ డంత నొప్పి
యగుచునున్నది నాహృద ♦ యమునఁ గాని। యెంతయోజించినను దెర ♦ వింతలేదు. 62.

క॥ మును పింతయుఁ బర్యాలో। చన చేసితి నింక నెన్ని ♦ చందంబులఁ జూ
చిన నియ్యదియే నిర్ణయ। మ"ని పలికిన రాయబారి ♦ యంతయు వినుచున్. 63.

గీ॥ కనులు శూన్యభావమునొందఁ ♦ గాళ్లువడఁక। మోము వెలవెలపోవఁగా ♦ నేమిసేయు
టకును దోఁపక యటెనిల్చె ♦ సకలముఁగని। పృథ్వివిభుఁడు చందుని జేరఁ ♦ బిలిచియపుడు.

ఉ॥ "భారతదేశమందున వి ♦ వాహమటన్నఁ బవిత్రకార్య మం
దా రణమల్లభూపతి మ ♦ హాబలవిక్రమ సంయుతుండగున్
గౌరవమెంచి నీకుఁ దన ♦ నందన నియ్యఁగఁ గోరె ని ట్లుపే
క్షారతి నూని యాఘనుని ♦ స్వాంతము నొవ్వఁగఁజేయఁ బాడియే! 65.

ఆ॥ పిలిచి పీటవేసి ♦ పిల్ల నిచ్చెదనన్నఁ। జెల్లదనుట కెంత ♦ సేపు పట్టుఁ
జేరవచ్చు కన్నె ♦ శ్రీమహాలక్ష్మిగా। నెంచవలదె? యాద ♦ రించవలదె? 66.

చ॥ ఇరువదియేండ్లు వచ్చె; నొక ♦ యిందునిభాననఁ బెండ్లియాడఁగా
సరియగు వేళయయ్యె; నృప ♦ సత్తముఁడున్ మనమిత్రుఁడున్ మనో
హరకులశీలయోగ్యతల ♦ నారణమల్లుఁడు పూజ్యుఁ డిందిరా
తరుణునిఁబోలు హంస కొనఁ ♦ దగ్గది; మానఁగఁగూడ దెట్టులున్. 67.

మ॥ వలదీ కన్యక నారికేళఫలమున్ ♦ వైళంబ నీరాజుముం
గలకున్ జేర్పుమటన్న, నీతఁ డిపు డే ♦ గన్ నేర్చుఁగానీ వ్యథా
కలితుండై యవమానభారమున శేల్ ♦ కన్నోడ్పఁగాలేక బా
ధలనొందున్ రణమల్లుఁ డట్టిహితుఁ జిం ♦ తన్ ద్రోయ నేనోర్తునే. 68.

చ॥ అనుపమరాజపుత్ర ధర ♦ యందున నంత్యజుఁడైన వానిక
న్నను మఱి యెంత హీనుఁడయి ♦ నన్ వృథగా నవమానలేశమున్
గని సహియింపఁబోవఁడనఁ ♦ గా నిఁక మానధనుండునా నుతిన్
గను రణమల్లుఁ డేకరణి ♦ గా సహియించు మహావమానమున్. 69.

చ॥ పరసమవర్తి యీపరిభ ♦ వజ్వలనంబు సహింపఁ డాతఁ డే
నెఱుఁగుదుఁ దోఁకద్రొక్కిన ఫ ♦ ణీంద్రుని కైవడి రేఁగి కోపవి
స్ఫురణముఁ బెంచు; మైత్రి యెటు ♦ పోవునె యుద్ధము తథ్యమౌను; సం
బరమున నుండఁగావలయు ♦ వారల కేటికి నీవిరోధముల్! 70.

మ॥ మనమున్ గౌరవమెంచి తక్కొరులదా ♦ మర్యాదఁ గాపాడిన
న్మనలన్ వారలు గారవింత్రు; మనమున్ ♦ రాల్ ఱువ్వినన్ దక్కొఱుల్
మనపైఁ బువ్వులు ఱువ్వఁబోవుదురె! య ♦ స్మచ్చిత్త మవ్వారిపై
న నదెట్లో మనపైన వారి కఱు డెం ♦ దంబుడుటల్ వింతయే? 71.

ఉ॥ చండపరాక్రమార్జిత వి ♦ శాల యశశ్శరదిందుమండలీ
పాండర చంద్రికారుచి వి ♦ భాసి దిగంతరు లాత్మజుల్ బలో
ద్దండులు పొల్తురాతనికిఁ ♦ దండ్రివిచారము వారెఱొంగినన్
భండనసీమఁజొచ్చి కర ♦ వాలము వాఁడిమి చూపకుందురే! 72.

ఆ॥ భయమువలన నిట్లు ♦ పలికితి ననుకోకు। పోరు రాజనీతి ♦ కోరనీదు
కన్ను చెడకయుండఁ ♦ గాటుక పోకుండ। రాజ్యమేలఁవలయు ♦ రాజగణము. 73.

క॥ కావున మౌర్ఖ్యము పెంపకు। నావచనము నాలకింపు ♦ నాయన! హంసా
దేవి గ్రహింపఁ దలంపుము। నీవితరము మనసులో గ ♦ ణింపక త్వరగన్." 74.

మ॥ అని తానెంతయు నీతి యుప్పతిలఁగా ♦ నారాజసింహుండు చె
ప్పిన వాక్యంబుల నాలకించి యతనిన్ ♦ వీక్షించి గంభీరవ
ర్తనుఁడాచండుఁడు ధర్మయుక్తిఁ బలికెన్ ♦ "దండ్రీ! భవత్ప్రీతి నే
వినియున్నానఖిలంబు వెండియును వి ♦ న్పింపన్ శ్రమంబేటికిన్! 75.

క॥ జనకుఁడవీ వానతి యి। చ్చిన పని శిరమునఁ దాల్చి ♦ చేయుట తగు! నై
నను హంసావిషయమ్మున। వినిచెద నావిన్నపంబు ♦ వినుమో దేవా! 76.

ఉ॥ నీకడఁ గాయ చేరె; సతి ♦ నీయదియయ్యె; లతాంగి మాతఁగాఁ
జేకొననేర్తు; భార్యగను ♦ జేకొనుటెట్టు లధర్మవర్తినై
లోకమునందునన్ జనుల ♦ లోఁ దలయెత్తుచు నేను జండుఁడం
చేకరణిన్ జరింపఁగల? ♦ నియ్యది ధీరుఁడొనర్చు కార్యమే? 77

మ॥ రవివంశోద్భవ రాజపుంగవ శిరో ♦ రత్నంబవై సత్యధ
ర్మవరిష్ఠుండవునై జగంబున యశో ♦ మాన్యుండవౌ పుణ్యమూ
ర్తివి నీగర్భమునన్ జనించియు విస ♦ ర్జింపంగ నెట్లోర్తు ధ
ర్మువు! సూర్యాన్వయ దుష్కళంకమనఁగా ♦ మోమెత్తఁగా నేర్తునే! 78.

క॥ చెలికంటె గురునికంటెను। దలిదండ్రులకంటె ననుఁగుఁ ♦ దమ్మునికంటెన్
దలఁపఁగ ధర్మువు ఘనమని। తెలుపుకొనన్ వలెనె దేవ! ♦ తెలియదె నీకున్. 79.

ఉ॥ కావున ధర్మమున్ విడఁగఁ ♦ గాదు నన్ క్షమియింపు మిష్టమే
నీవలహంసఁ జేకొనుము ♦ నీకు నసమ్మతమేని కాయఁ గొం
పోవఁగనిమ్ము సంగరము ♦ పుట్టినఁ బుట్టెడుఁగాక; మర్త్యులన్
బోవిడి దేవదానవులు ♦ పూనిన నోర్తు నిమేషమాత్రలో. 80.

చ॥ అనుభవశూన్యబుద్ధి నిటు ♦ లాడితినం చనఁబోకు; పాప మే
నొనరుపఁజాలకుంట నిటు ♦ లొగ్గివచించితి; ధర్మయుక్తమై
నను బనివిందు; నీవు చర ♦ ణమ్మునఁ జూపిన మౌళిఁదాల్చి యా
జ్ఞను నెఱవేర్తుఁ; దండ్రికి మ ♦ నఃప్రియ మియ్యనివాఁడు పుత్రుఁడే. 81.

క॥ కావున జనకుని యానతి। గావింపని పుత్రుఁడని జ ♦ గము నను దూరన్
బోవని విధమునఁ బనిగొని। కావుమ"న లఘుండు పుత్రుఁ ♦ గనుఁగొని కినుకన్. 82.

క॥ "మనుసంతాన క్షీరాం । బునిధిని హాలహాలమట్లు ♦ పొడమితి యకటా!
జనకుని పంపు నొనర్పని । తనుజాతునకన్న నీచ ♦ తముఁ డుండునొకో! 83.

మ॥ పరమోదార పతివ్రతాతిలకమై ♦ భవ్యానురాగంబు పొం
పిరివోఁద న్గని పెంచినట్టి వరసా ♦ ధ్విన్ దల్లి యా రేణుకన్
గురునాజ్ఞన్ శిరమందుఁ దాల్చుచుఁ ద్రుటిన్ ♦ ద్రుంచెన్ గుఠారమ్మునన్
బురుషోత్తంసుఁడు దేవుఁ డాపరశురా ♦ ముం డల్పుఁడే చూచినన్. 84.

మ॥ అనుజుండున్ జెలి తోడరా వెడలి దై ♦ త్యస్ఫార దర్పోగ్రమౌ
వనిలోఁ జేరి చతుర్దశాబ్దములెటో ♦ వాతాంబు పర్ణాశియై
జనకుం డాడిన మాట నిల్పుటకుఁ గ ♦ ష్టవ్రాతమున్ జెందె రా
మున కీజ్ఞానమె యున్న ఘోరవిపనం ♦ బున్ జేరకుండున్ గదా! 85.

చ॥ మనకుఁ గదున్ హితుండు రణ ♦ మల్లవిభుండు, సురూప శీల యౌ
వనముల హంస యోగ్య, యటు ♦ వంటి సతిన్ గొనుమన్న వాఁడ నే
జనకుఁడఁ, జోటు సర్వనృప ♦ సత్తము లుండెడి కొల్వు, మౌర్ఖ్యమున్
బెనఁచి మదీయకోపమును ♦ వృద్ధియొనర్చితి దుర్మదాంధుఁడా! 86.

గీ॥ ఇంటికే తెంచి యిదె కన్నె ♦ నిత్తుమన్న । నింతగర్వంబు మౌర్ఖ్యమా! ♦ యిట్టి నీకు
ధర్మమఁట గౌరవంబఁట ♦ దగదగలఁట । మీఱరాదఁట యిది నమ్మ ♦ వారుగలరె! 87.

చ॥ ఇది కొఱమాలినట్టి పని; ♦ యీవెడమాటలతోఁ బనేమియున్
గుదురదు; రాయబారి చనఁ ♦ గూడదు రిత్తగ, బాల్యగర్వసం
పద గదురంగ నీకరణిఁ ♦ బల్కితి, వైన క్షమింతు నిప్డుఁడేఁ
గుదురగుమాట పల్కి యల ♦ కొమ్మను జేకొన సమ్మతించినన్." 88.

మ॥ అని తీక్ష్ణంబుగఁ బల్కి యాజ్ఞ యిడఁగా ♦ నాచండుఁడున్ బల్కు "నో
జననాథాగ్రణి! నేవినీతమతినై ♦ సర్వంబునున్ విన్నవిం
చిన వేఱొందుగతిన్ జరింపుమని శా ♦ సింపంగ న్యాయంబె! నా
మనమం దున్నది యున్నయట్లు వినిపిం ♦ పన్ లేదె యాద్యంతమున్! 89.

ఉ॥ ఆలలనాశిరోమణియు ♦ హంసయు నీకగుఁగాక పత్ని నా
పాలికి మాతృతుల్యయగుఁ ♦ బావనపావకమూర్తి; యామె ని
ల్లాలుగఁ గొమ్మటంచనెడు ♦ నాపలుకే విరసమ్ము; నేవినన్
జాలఁ; బరిగ్రహింపఁగనుఁ ♦ జాలఁ; దలంపఁగఁజాల నామదిన్. 90.

చ॥ తనకు నధర్మకార్యమని ♦ తప్పక తోఁచినదాని బంధుఁడై
నను హితుఁడైనఁ దండ్రియయి ♦ నన్ గురుఁడైనను దల్లియైనఁ ద
జ్జనపతియైనఁ జేయుమన ♦ సజ్జనుఁ డయ్యది చేయఁగూడ దం
దున నొకలేశమేనియును ♦ దోసము రాదని యండ్రు కోవిదుల్. 91.

గీ॥ పాడి తలఁపక కాశీనృ ♦ పాల తనయ! ననుజు సతిగాఁగ గ్రహియింపు ♦ మనిన గురుఁడు
పరశురామునియెడ భక్తి ♦ నెఱపెఁ గాని! ధర్మపథమును భీష్ముండు ♦ తప్పినాఁడె! 92.

గీ॥ ధర్మమార్గంబు వదలఁగాఁ ♦ దలఁపు లేక! పరమ విష్ణ్వంశభవుఁడైన ♦ పరశురామ
దేవు కోపంబునైన మ ♦ దిన్ గణింప! నట్టి భీష్మ వర్తనము నే ♦ ననుసరింతు. 93.

ఉ॥ ఆరమణీయగాత్రి ధర ♦ యందలి రాజతనూజలందు సిం
గారపుటిక్కయైనను జ ♦ గన్నుత పూజ్య గుణాఢ్యయైన నో
ధారిణినాథ! యాపెయెడఁ ♦ దథ్యము కోరిక లేదు నాకు నీ
వ్రారక నాపయిన్ గినుక ♦ నూనఁగ నేటికి మాటిమాటికిన్. 94.

మ॥ ఇది ధర్మంబొ యధర్మమో తెలియ దే ♦ నీ మార్గమున్ వీడ; ని
య్యది నాచిత్తము; మంచి వచ్చినను మే ♦ లౌ; లేక కొండంత కీ
డొదవున్ బో భరియింతు నిక్కముగ ధై ♦ ర్యోత్సాహముల్ మీఱ; నీ
మది నింకేటికిఁ గష్టపెట్టెదవు; నన్ ♦ మన్నించి పాలింపుమీ! 95.

సీ॥ తండ్రివి నాకును ♦ దైవంబు చందానఁ బూజ్యుఁడ వదిగాక ♦ రాజ్యమేలు
చక్రవర్తివి కీర్తి ♦ సాంద్రుఁడ వేను నీప్రియపుత్రకుఁడఁ గడుఁ ♦ బిన్నవాఁడ
నీయాజ్ఞఁ దలనిడి ♦ చేయఁగాఁ దగువాఁడ; నను గోపమునఁ బల్క ♦ తనుచు నాకుఁ
గినుక లేదెపుడు భ ♦ క్తివహింతు నీయందు; నీపేర్మి నెపుడు గ ♦ ణింతు మదిని
గీ॥ ధర్మమని తోఁపకుండుటఁ ♦ దావకాజ్ఞఁ జేయలేనయ్య! కృపను వీ ♦ క్షింపవయ్య!
యెడఁదఁ గోపింపకయ్య! న ♦ న్విడువవయ్య! రెండుపదములు పట్టి ప్రా ♦ ర్థింతునయ్య!”96

మ॥ అని చండుండు నమస్కరింప లఘుఁ“డా ♦ హా! యేమి నీగర్వమున్
వినయంబున్ వివరింప వీలొదవ దీ ♦ విన్నాణముల్ నీవ నే
ర్చినవో యింకెవరే నెఱుంగుదురొ ఛీ ♦ ఛీ! తండ్రి యాజ్ఞప్తి మ
న్ననమైఁ దీర్పఁగలేని పుత్రుమొగమున్ ♦ గన్గొన్నఁ బాపంబగున్. 97.

క॥ చనువున దగ్గరఁ జేరిచి! “కొనుమా కుందనపుబొమ్మఁ ♦ గొమ్మను హంసాం
గన”నన నామాటను గీ! టునఁ బుచ్చఁగఁ జూచితే! క ♦ డున్ గర్వమునన్. 98.

క॥ చెనఁటివి ధర్మంబను ముసుఁ। గున మౌర్ఖ్యము పెంకెతనము ♦ కోపము గర్వం
బును గుచ్ఛితమును మూసితి। నిను నమ్మఁగ నౌనె! నమ్మ, ♦ నిందకుఁ గాదవే! 99.

చ॥ అల రణమల్లు చిత్తమల ♦ రారఁగ, హంసయుఁ గుందకుండ, ని
న్నలువురు బుద్ధివచ్చునటు ♦ నవ్వఁగఁ, గాయను రాయబారియున్
దనపురిఁజేర్పఁగావలసె ♦ నన్ వ్యథ నొందకయుండ, నేన యొ
య్యన నలహంస యానజిత ♦ హంసను జేకొని పెండ్లియాడెదన్. 100.

క॥ అలివేణి నేగ్రహించినఁ। దలఁగెఁగదా పీడయనుచుఁ ♦ దలఁపకు; హంసా
లలనకుఁ గలిగెడు కొమరుం। డలఘుగతిన్ రాజ్యమునకు ♦ నభిషిక్తుఁడగున్. 101.

క॥ ఇది నీకు శిక్ష, హంసా। మదిరాక్షికిఁ గొంతమేలు, ♦ మనసునకు సుఖా
స్పద మింత నాకు, నీమది। నిది యొప్పిన నొప్పుకున్న ♦ నిటు లొనరింతున్. 102.

క॥ కనికరమునఁ గనఁగాఁ దగు। తనయుండవు గావు నీవు; ♦ తలఁగి యెచటికై
నను జనుమ"నవుడు చందుఁడు। విని నునుఁజిఱునగవు తాండ ♦ వించుచునుండన్. 103.

చ॥ "అనుపమభోగభాగ్యముల ♦ నన్నిఁటి వీడ భయంబునొంద; నా
జనని నిన్ను నాదు నను ♦ జాతుని వీడ భయంబునొంద; ని
మ్మని మఱి నీవుకోరినను ♦ బ్రాణము వీడ భయంబునొంద; నె
మ్మనమలరించు ధర్మమును ♦ మాత్రము వీడ భయంబునొందెదన్. 104.

క॥ జననియంబు భేదమలరా। రని హంసకుఁ గలుగు సుతుని ♦ రఘుదేవునిక
న్నను నాకన్నను నీక। న్నను గూరిమిఁ జూచువాఁడ ♦ నరపాలమణీ! 105.

క॥ విను హంసకొడుకుకేటికి। మనసున నీకిష్టమైన ♦ మహితావనిపా
లనమును నీకడపటి భృ। త్యున కిచ్చిన నతుల మోద ♦ మొందెదు వాఁడన్. 106.

క॥ జనకా! నీదగు రాజ్యం। బును నిచ్చకువచ్చినట్టి ♦ పురుషున కీవ
చ్చును; నేవలదన; భారము। చనుటయె పదివేలు నాకు ♦ సౌజన్యనిధీ! 107.

మ॥ జనకా! నీదగు నిచ్చకంబునకు నీ ♦ చందంబునన్ బల్కినా
నని లోనెంచకు; పూర్ణచిత్తమున భూ ♦ మ్యాకాశదైవంబులున్
విన, నేఁజేసితి నీప్రతిజ్ఞ; సకలో ♦ ర్వీనాయకుల్ సాక్షు, లిం
దున కేఁ దప్పిన నీపదాబ్జములకెం ♦ దున్ దప్పినట్లే సుమీ! 108.

క॥ నరపాల! యేకలింగే। శ్వరు పాదములాన నేను ♦ సలుపు ప్రతిజ్ఞన్
జరపుచు నాకును నీకును। నిరతయశస్తేజములును ♦ నెగడఁ జరింతున్. 109.

గీ॥ ధర్మమును రాజ్యభోగ మీ♦ద్వయి నొకండు। కోరుమంటి; హంసాదేవిఁ ♦గొనుచు ధర్మ
మును ద్యజించుకంటె హృదయ♦పూర్వకముగ। రాజ్యలాభంబువదలి ధ♦ర్మముననిలుతు.

క॥ జనకుల హృదయము లెప్పుడు। తనయులకును మేలెకోరుఁ ♦ దండ్రీ! దయఁబ్రో
చినవాఁడవ"నుచుఁ బదయుగ। మునకు నమస్కృతులొనర్చి ♦ ముదమునఁ జనియెన్. 111

ఉ॥ అంతట రాయబారిని బ్రి♦యమ్మునఁ జేరఁగఁబిల్చి ధారిణీ
కాంతుఁడు "నీవు పోయి త్వర♦గా రణమల్లున కిందుఁగల్గు వృ
త్తాంతముఁ దెల్పి చందునివి♦ధం బఖిలంబు నెఱుంగఁజేసి త
త్స్వాంత మొకింతయున్ నెగులు♦దాల్పనియట్టి తెఱంగు సేయుమీ! 112.

క॥ అదను నెఱిఁగి రణమల్లుని। మదిపొంకము తప్పకుండ ♦ మానిని హంసా
మదిరాక్షి నాకొసంగఁగఁ। గుదురుపఱచి నాకుఁ దెల్పు ♦ కొను మఖిలమ్మున్. 113.

గీ॥ 'ఇట్టియెడ నిట్లుమాటాడు ♦ మిట్లుసేయు'! మనుచు నేఁజెప్పవలెనె! నీ ♦ వంతయెఱుఁగఁ
గలవు; రణమల్లుఁ డిటు ముఖ్య♦కార్యములకుఁ। బొమ్మనినయట్లై తెలిసె నీ♦బుద్ధిమహిమ.

క॥ నీవును, నేనును, హంసా। దేవియు, రణమల్లుఁ డెగ్గు ♦ దేరి యలరఁగా
నేవెఱవుననేఁ గార్యం। బీవనుకూలింపఁజేయు ♦ మిది యానసుమీ. 115.

క॥ ఇదిగా కింకొకపలు కటు। కుదిరినచో హంస నిటకె ♦ కొనివచ్చెదున
ట్టిది సేయు మిచటనే కం। జదళాక్షిని బెండ్లియాడి ♦ సౌఖ్యముఁగాంతున్." 116.

చ॥ అనవిని రాయబారి "వసు ♦ ధాధిప! విస్తరమేల నాకుఁ దోఁ
చినగతి నిందుఁగల్గిన వి♦శేషములన్ నరపాలు బుద్ధికె
క్కునటుల విప్పి చెప్పి యను♦కూలవిధంబున నాతఁడున్ మెలం
గునటు లొనర్చి మీసరస♦కున్ జనుదెంచి యెఱుంగఁజేసెదన్. 117.

గీ॥ ఇప్పటికిఁ జాలు నింత మీ ♦ కృపను నాకు। సెలవొసంగుఁడు మార్వారు ♦ సీమకేగ"
నన నృపతి మంచిదనఁగ వం♦దన మొనర్చి। వినయమున రాయబారియు ♦ వెడలిచనియె.

గీ॥ సర్వసామంతధారిణీ♦శ్వరులఁ బంపి। కొలువు చాలించి లఘురాజ♦తిలక మంతి
పురి కరిగెఁ గొన్నిదినములు ♦ జరుగ నొక్క। దినము శుభవార్త యంతంతఁ♦దెలియనయ్యె.

గీ॥ లఘుఁడు మదిగోరినట్లె వె♦లందిమిన్న। హంసఁ జిత్తూరిపురమున♦కంపెను రణ
మల్లనృపవల్లభుఁడు యోగ్య♦లెల్లఁజేరి। పరమ శుభముహూర్తమ్ము నే♦ర్పఱచిరపుడు.

గీ॥ లఘుఁడు చిత్తూర్పురంబు న♦లంకరింప। జేసి హిత బంధు వర్గముల్ ♦ చేరికొలువ
యానజితహంస హంసాన♦వాబ్జవదన। విధిహితంబుగ నంతటఁ ♦ బెండ్లియాడె. 121.

ఉ॥ పరిణయమైనవెన్క వర ◆ వర్ణిని హంసకుఁ గొన్నిమాసముల్
జరిగినమీఁద నిల్చె నెల; ◆ సన్నని లే నునుమేనుఁదీవెయున్
మెఱుఁగుల నూనెఁ గ్రొందళుకు ◆ నిద్దపుఁ జెక్కులఁ దెల్వి రంజిలెన్
విరివి వహించె నెన్నడుము; ◆ నిండెను గోరిక లొక్కఁడొక్కఁడై. 122.

గీ॥ ఒక్కఁడొక్కఁడుగా నెల ◆ లెక్కుచుండఁ। బసపుబొమ్మను బోలు న ◆ వ్వద్మనయన
హంస నన్నిచందమ్ముల ◆ నరసె లఘుఁడు। పతికిఁ బ్రియము గర్భిణియైన ◆ సతిహితంబు.

గీ॥ పదవమాసంబు వచ్చి గ ◆ ర్భంబునిండి। సకల కల్యాణ సుముహూర్త ◆ సమయమందుఁ
జిగురుఁబోఁడి హంసాదేవి ◆ చిన్నవానిఁ। గనె నొకని ముద్దులను మూట◆గట్టువాని! 124

గీ॥ భూసురులను బిల్చి ◆ పుణ్యాహమొనరింపఁ। జేసి లఘునృపాల ◆ శేఖరుండు
వరసుతునకు నామ ◆ కరణంబు చేయించె। ముకుళుఁడనుచు జగము ◆ మోదమంద. 125

గీ॥ ఒడలుపెట్టి యొక్కొకతప్పు ◆ టడుగు పెట్టి। తొక్కుపలుకులు పలికి చెం ◆ దొవలఁజేని
యట్టు లభివృద్ధినొందుచు ◆ నందఱకును। ముకుళుఁడల్లారుముద్దయి ◆ పొలుపుగనియె.

సీ॥ తన ప్రతిబింబమై ◆ దర్శనీయంబైన తనయు మోహనమూర్తిఁ ◆ గనెడు నపుడు
నమృతంబు లొలుకు తీ ◆ యని తొక్కునుడిఁ బల్కు లంచితగతి నాల ◆ కించునపుడు
కర్పూరపుం బరా ◆ గము చల్లు నటు హాయి నించు మే నొగిఁ గౌఁగి ◆ లించు నపుడు
నాటలనాడి డా ◆ యఁగరాఁగ దరిఁజేర్చి శీర్షమాఘ్రాణంబు ◆ చేయునపుడు
గీ॥ వలపు టమృతంబు చవిచూచి◆యలరునపుడు। తండ్రియగువాని సౌఖ్యంబు◆తరమెపొగడ
నతితరానందముల కాల ◆ యంబతండు। తనయుఁగల తండ్రి ధన్యాళి ◆ ధన్యతముఁడు. 127.

గీ॥ చిన్నభార్య కుమారుని ◆ జేరఁదీయు। టందు లాలించుటందు ము ◆ ద్దాడుటందు
వ్యవధి యించుకయు నెఱుంగఁ ◆ డాలఘుండు। కాల మీరీతి నైదేండ్లు ◆కడచిచనియె.128

చ॥ అమిత సుఖాస్పదంబయిన ◆ యయ్యయిదేండ్ల కుమారుతోడి నె
య్యమున నమోఘసౌఖ్యముల ◆ నందుచు భూపతి ప్రాజ్యరాజ్యతం
త్రములను దీర్చుచుండ నొక ◆ నాఁడుదయం బొకరాయబారి వ
చ్చి మిగులభక్తితో నతులు ◆ చేసి సమీపమునందు నిల్చుచున్, 129.

మ॥ "చతురంగధ్వజనీపతుల్ గొలువఁగా ◆ సంగ్రామమున్ జేసి యం
చితమౌరీతి మహమ్మదీయులు గయా ◆ క్షేత్రంబుఁ బట్టంగ ను
ద్ధతిమై వచ్చినవారు భారతధరా ◆ ధ్యక్షుల్ గయాక్షేత్ర మే
గతినైనన్ జెడకుండ నిల్పుకొనఁగాఁ ◆ గాంక్షించి రుత్సాహులై. 130.

గీ॥ నీలజలరాశినుండి కా ♦ బూలుదాఁక। రాణ మెఱసెడి యవనరా ♦ ష్ట్రములు గెలిచి
ఫల్గునసమానుఁడగుచు మీ ♦ బప్పరావు। ధరణి నెలకొల్పె బహుజయ ♦ స్తంభసమితి. 131

సీ॥ సకలదిగ్వలయ వి ♦ శ్రాంతకీర్తియుతంబు భానువంశంబునఁ ♦ బ్రభవమంది
శ్రీరామచంద్రు కూ ♦ రిమిపెద్దకొమరుండు లవుని కులంబు ని ♦ ల్వంగఁబెట్టి
ముప్పదియాఱు రా ♦ ణ్ముఖ్యాన్వయంబుల కగ్రగురుస్థాన ♦ మాక్రమించి
మేవాణ్మహీ చండ ♦ మిహిరుండనియు విశ్వపతియనియును గీర్తి ♦ వఱల మెలఁగి
గీ॥ వసుధ నవతరించినదాది ♦ భారతీయ। ధర్మసంస్థాపనాచార్య ♦ తను బడసితి
స్వామి! నీచల్వ భరత వ ♦ ర్షమునకెల్ల। నావరించిన యాణిము ♦ త్యాలగొడుగు. 132.

సీ॥ దిగ్దేశవర్తి ధా ♦ త్రీనాయకులు గయాపట్టణంబును జేర ♦ వచ్చినారు
నూఱాఱగునుగాక ♦ యాఱు నూఱగుఁగాక వదలమంచని పట్టు ♦ పట్టినారు
తమతమ సైన్యముం ♦ తయు వ్యూహములుపన్ని యుద్ధసన్నద్ధులై ♦ యున్నవారు
హైందవ సకలసే ♦ నాధిపత్యమును నీతలమోప నందఱు ♦ తలఁచినారు
గీ॥ తత్పదంబుల వ్రాలి వా ♦ ర్తలను దెలిపి। దేవ! యర్థింప నన్నుఁబు ♦ త్తెంచినారు
కనులు మూయక మీపైన ♦ మనసుచేర్చి। యున్నవారెల్లఁ గనుపెట్టి ♦ యున్నవారు. 133.

క॥ ఎమ్మెయి బహుసైన్యాటో। పమ్మెయి మహమ్మదీయ ♦ బలముఁ దఱిమి పు
ణ్యమ్ములగని గయఁ బ్రోవఁగ। రమ్మా తడవింతలేక ♦ రాజబిడౌజా!" 134.

క॥ అని రాయబారి పలికిన। విని లఘుఁడును "భాగ్యమయ్యె ♦ వివిధచమువులన్
గొనివత్తు" నని వచించుచుఁ। దనతనయుని జండుఁ బిలిచి ♦ తగ నిట్లనియెన్. 135.

గీ॥ "ఆర్యమతవైరులైన మ ♦ హమ్మదీయు। లతితరాటోపమునఁ జమూ ♦ యుతులగుచును
నఖిలపుణ్యంబులకును గా ♦ ణాచియైన। గయను బట్టఁగోరిరఁట యే ♦ కరణినైన. 136.

ఉ॥ భారతదేశమందలి నృ ♦ పాలసమూహములెల్ల నొక్కఁడై
చేరి మహమ్మదీయుల య ♦ శేష చమూనిచయంబుఁ దాఁకి దు
ర్వారపరాక్రమంబునను ♦ వారల గండడగింప నెంచియు
న్నారని రాయబారి యిదె ♦ నాకడకున్ గొనివచ్చె వార్తలన్. 137.

మ॥ అవనీనాథులకున్ మతోద్ధరణ కా ♦ ర్యంబుల్ విడన్ రానివె
ప్డు విశేషించి రణంబుగల్గి యసువుల్ ♦ పోనుండినన్ సుంతయై
న విచారింపఁగరాదు శత్రువుల మ్రం ♦ దన్ జేయుటో లేక యా
హవసీమన్ దెగి స్వర్గమున్ గొనుటో ధ ♦ ర్మ్యంబైన కార్యంబగున్. 138.

ఉ॥ కావున సర్వసైన్యములు ♦ గైకొని మిత్రనృపాలకోటి రా
గా వడి శత్రులన్ గదిసి ♦ గండడగించి గయాపురంబు నె
ల్లె విమతక్షితీశ్వరుల ♦ కించుక లోఁగకయుండ నిల్పఁగా
భావమునందుఁ గోర్కెయగు ♦ బాలక! నేనిపు డేగనెంచితిన్. 139.

గీ॥ ఇది కడుఁబవిత్రతరకార్య ♦ మింతకన్న। ధన్యకృతిని జన్మంబు సా ♦ ర్థకమొనర్చు
భాగ్యము లభింపఁబోవ దే ♦ భంగిదీనిఁ। దీర్చుటయె మంచిదంచు మ ♦ దిన్గణింతు. 140

సీ॥ ఎట్టికార్యము చేయ ♦ నెంచిన హృదయపూర్వకభంగిఁ జేయుట ♦ పరమధర్మ
మందున నిది సక ♦ లావనీజనులకుఁ గావలసిన మత ♦ కార్యమగుట
ద్విగుణితోత్సాహంబు ♦ వెలయఁ బోవలయు వెన్కకువత్తునో లేక ♦ కదనసీమఁ
దెగుచు వీరస్వర్గ ♦ దివ్యసౌఖ్యమె చూరఁగొనెదు భాగ్యంబె క ♦ ల్గునొ తెలియదు

గీ॥ కావునఁ బురంబు విడిచి నేఁ ♦ గదలిచనిన। నిచటికార్యంబు లేవి యొ ♦ కింత మదిని
గలఁపఁగాఁగూడ దటుతౌట ♦ వలయుపనుల। నన్ని సవరించి చనుట సౌ ♦ ఖ్యప్రదంబు. 141

గీ॥ అల్లనాఁడు హంసను బెండ్లి ♦ యాడుమన న। నాదరము నీవు నెఱప నే ♦ నతివఁగొందు
హంస కుదయించు సుతుఁడు రా ♦ జ్యంబునొందు। ననుచు నేఁబల్కియుంటిఁ గో ♦ పాధికతను.

ఉ॥ నీవును శీర్షమూచి తల ♦ నీరజనేత్ర గ్రహించియుంటి నే
నావరవర్ణినీతిలక ♦ మన్నటులే ముకుళున్ దనూజునిన్
గా వడిఁగాంచె నైన నొక ♦ నాఁడును బుత్రుని హంస రాజ్యల
క్ష్మీవరుఁ జేయుమం చభిల ♦ షించి వచింపఁగలేదు పుత్రకా! 143.

చ॥ అడుగదెయందమైన మన ♦ మాడిన మాటను దీర్చు భారమే
వడువుననైన నిల్చు మన ♦ పైననె; కాంతలభావ మెప్పు డె
య్యెడ నెటు మాఱునో తెలియ ♦ దిప్డు గయాపురి కేనుబోయినన్
గొడుకును రాజుచేయుమని ♦ కోరుచు గోల యొనర్చు నేమొకో! 144.

ఉ॥ ఇంతటిదూర మిట్లనుట ♦ నీవు మదుజ్జ్వలరాజ్యమందుఁ గా
సంత కొనంగఁబోక నిఖి ♦ లావని రాజ్యము హంసబిడ్డఁ డా
క్రాంతియొనర్పనిమ్మనుట ♦ గాదు; మదీయ పరోక్షమందు నే
కొంతయు గుంజులాటయును ♦ గూడదటంచని తెల్పఁగోరితిన్. 145.

మ॥ కులముౝ బ్రోచెదు నగ్రపుత్రుఁడవు నా ♦ కుౝ స్వర్గవాసాది స
త్ఫలముల్ గూర్పఁగఁజాలు వాఁడవు నినుౝ ♦ దప్పించి రాజ్యంబు న

న్యులకీర్తుల్ గమకింతునే యకట! క ♦ న్నుల్ కానరానట్టి బి
ట్టలుకల్ బల్కితిఁగాక నీయెడల న ♦ న్యాలోచనం బుండునే? 146.

మ॥ వసుధారాజ్యము నీభుజంబునన మో ♦ పన్ నాకభీష్టంబునను
మ్మ సుతుండౌటను రాజ్యమిత్తుననుచున్ ♦ బూర్వంబు నేఁజెప్పియుం
ట సతిన్ బిల్చి సమస్తముల్ దెలిపి రా ♦ ష్ట్రంబంత నీకిచ్చి యా
మెసుతుం డందొకపాలు చెందునటు నె ♦ మ్మిన్ గోరి యొప్పించెదన్. 147.

గీ॥ వయసునను బిన్నదైన న ♦ వ్వనిత హంస! తెలివి తేటలు గలది; నేఁ ♦ దెలిపినంత
నత్యుదారబుద్ధిని దీని ♦ కనుమతించు! నీవు మనసార రాజ్యంబు ♦ నేలుకొనుము. 148.

క॥ మనమాటను సత్యముసే! యను రాజస్థానదేశ ♦ మం దేభాగం
బును ముకుళున కొసఁగఁగఁదగుఁ! దనయా! వచియింపు మీవు ♦ తడయక నాతో" 149

మ॥ అనఁ గష్టంబున సౌఖ్యమందున లవం ♦ బైనన్ వికారంబుచెం
దని సుస్మేరముఖాబ్జ మందములు చిం ♦ దన్ ధీరగంభీర రే
ఖను దెల్పంగ లఘుక్షితీశు మొగముల్ ♦ గన్గొంచు "నోతండ్రి! మె
త్తనినీమంచిమనస్సు నేమనుచుఁ జి ♦ త్తంబందు భావింతునో. 150.

మ॥ అలనాఁ డించుక కోపవేగమున నీ ♦ వట్లాడితేగాక య
వ్వల నన్గాంచి యెప్పుడేనియును గో ♦ పంబూన కవ్యాజపే
శలకారుణ్యరసప్రపూరమలరన్ ♦ జాలంగ వీక్షించి పు
త్రులయందున్ బ్రజలందు మన్ననకుఁ బా ♦ త్రున్ జేసి తెంతేనియున్. 151.

మ॥ భవదాశీర్వచనంబు ప్రాపగుచుఁ గా ♦ పాడున్ ననున్ నీవు ప
ల్కు వచోరీతుల నాలకించితి రణ ♦ క్షోణిన్ రిపుశ్రేణిఁ దాఁ
కి వధింపన్ జను లోకపూజ్యము గయా ♦ క్షేత్రంబు నెట్లైన శా
త్రవహస్తంబులనుండి కావఁదగు చం ♦ దం బూహచేయన్ జనున్. 152

చ॥ అనఘ! మహాత్మ్మదీయులు గ ♦ యాపురిఁ బట్టఁగనుండిరంచుఁ జె
ప్పినపుడె వారలన్ దవిలి ♦ పిప్పియొనర్పుట యెప్పు డెప్పుడం
చని మది చిందుద్రొక్కెడిని ♦ నయ్యరిసంతతి సంహరించు నా
పనకిని నన్నుఁబంపుము భ ♦ వత్పదముల్ గొనియాడుచుండెదన్. 153.

చ॥ అనఘ! జగద్భయంకర ర ♦ ణాంగణసీమల శత్రురాట్చయం
బును వడిఁదాఁకి వారిబల ♦ మున్ జలముల్ దుదముట్టఁజేసి పా

వసతరకీర్తిచంద్రిక లఁ ♦ పారముగా మహిఁ బర్వఁజేయుచున్
మనెడు త్వదీయ తేజమును ♦ మాదృశులున్ నుతియింప నేర్తురే! 154.

ఉ॥ వీరులలోన మేటియగు ♦ వీరుఁడవంచని యెల్లవేళ నీ
భారతదేశవాసు లతి ♦ భాసురలీల నుతింపనొప్పు నీ
కీ రణమన్న నెంత! కను ♦ లించుక యెఱ్ఱనచేసి నిల్చినన్
బాఱవె శత్రుసైన్యములు! ♦ భంగమునొందవె! దేశజాలముల్. 155.

మ॥ నడకొండల్వలెనుండు చండతరశుం ♦ డాలమ్ములన్ జెండి నం
జుడు భక్షించుచుఁ దృప్తిగన్న మృగరా ♦ జున్బోలె వైరివ్రజం
బడఁగన్ ద్రొక్కియు శాంతినొందిన యుద ♦ గ్రాటోపవిభ్రాజి వి
ప్పుడు నా కీయవకాశమిచ్చుచు యశం ♦ బున్ జెందఁగాఁ జేయుమీ! 156.

గీ॥ ఇరువదాఱేండ్ల వయసున ♦ నెసఁగు నేను। జల్లఁగా నింటఁగూర్చుండి ♦ సమరమునకుఁ
జనకయుండిన నవ్వరే! ♦ సకలజనులు। నాడికొనరే జగంబున్న ♦ యంతవఱకు! 157.

మ॥ ప్రమదంబొప్పఁ బురంబునన్ నిలిచి యీ ♦ రాజ్యంబుఁ బాలించుచుం
డుము; నేవెళ్లి విపక్షకోటి ననియం ♦ దున్ద్రుంచి రాజన్యవా
రము సంతోషమునొందఁజేతు; నను గా ♦ రామార మన్నించిపం
పుము; నాచిత్తమునన్ భవత్పదయుగం ♦ బున్ భక్తి భావించెదన్." 158.

క॥ అని యెంతయు వినయంబునఁ। దనువేఁడెడు చందుఁగాంచి ♦ తండ్రి ముదమునన్
"వినయాది పూజ్యగుణములు। తనయా! భూషణములగుచుఁ ♦ దగు నీయందున్. 159.

క॥ అనికరిగి, రిపుల క్షణమునఁ। దునుమన్గలవంచెఱుంగు ♦ దున్ భారతదే
శనృపాలుర యానతి శిర। మునఁగొనఁదగు విడువఁదగదు ♦ పుత్రక! వినుమీ! 160.

సీ॥ బవరంబునందు మే ♦ వాడసైన్యముఁగొంచు యవనులఁదాఁకు కా ♦ ర్యంబ్యైన
నీవైన నేనైనఁ ♦ బోవచ్చు నిది యిట్టిపనిగఁదోఁప దఖండ ♦ భరతఖండ
ధారుణీశ్వరులెల్లఁ ♦ దమతమసైన్యముల్ గొనివత్తు రట్లు చే ♦ రిన సమస్త
సైన్యంబులకు సర్వ ♦ సైన్యాధిపత్యంబు వహియింప నాకాజ్ఞఁ ♦ బంపినారు
గీ॥ వారలంద ఱెవ్వానిని ♦ గోరికొంద్రొ। వాఁడె యాసర్వసేనాధి ♦ పత్యమొంద
వలయుఁ బ్రతినిధి నెవ్వనిఁ ♦ బంపరాదు। ప్రాణములుపోవు విషమదు ♦ ర్దశలనైన. 160

శా॥ నాకేండ్లేఁబదికెక్కుడయ్యె నిఁక వా ♦ నప్రస్థమున్ బూని రా
మా! కృష్ణా! యని ముక్కుమూసికొని యే ♦ యారామమందైన నా

వైకుంఠేశు పదద్వయంబును మనః ♦ పద్మంబునన్ నిల్పి చిం
తాకాలుష్యములన్నియున్ వదలియుం ♦ డన్ వేళయయ్యెన్ జుమీ! 161.

గీ॥ సమరమున కీవు వలదు నేఁ ♦ జని యహితులఁ। గూల్చెదనటన్న నీ పల్కు ♦ కోటిసేయు;
ముదమునొందితి; ననికి నన్ ♦ బోవనిమ్ము;। మనసునను నొచ్చుకొనకు; నా ♦ మాటవినుము.

క॥ అని జయ మెపు డొక్కనిప్రా। క్కనె యుండునె? యెప్పుడెట్లు ♦ గా మారునొ; కా
వునఁ బోకమునుపె మనముకు। ళునిభాగము నిర్ణయము స ♦ లుపఁగఁదలఁచితిన్. 163.

ఆ॥ ముకుళుఁగూర్చి యిట్లు ♦ పోవుదమనుకొన్న। నవలఁ జింతయుండ ♦ దట్లుగాన
నిపుడుపలుకవలసె ♦ నింతదూరము పుత్ర! నీవు మదిఁదలంచి ♦ నిర్ణయింపు." 164.

క॥ అని యనురాగార్ద్రమనం। బున సమరముసేయఁ దానె ♦ పోవలెనను నా
జనకునిఁగని చండుఁడు కడు। వినయము ధర్మంబు గాను ♦ పింపఁగఁ బలికెన్. 165.

క॥ "తలమోపి నీపదంబులు। గొలువవలయు సుతుఁడనగుటఁ ♦ గొండొకమాటల్
పలుకఁగనోడెద మ్లేచ్ఛులఁ। దలఁప నుడుకుచుండు నెడలు ♦ తండ్రీ! నాకున్. 166.

క॥ ముదమునఁ గొండంతటియా। పదనైనను జెంది సుతులఁ ♦ బరమక్షేమా
స్పదుల నొనరింత్రు; తండ్రులు। హృదయములు శిరీషపుష్ప ♦ మృదులములెందున్. 167.

గీ॥ అధిప! యీత్రుటినుండి గ ♦ యాపురమున। నడుగువెట్టెడునందాఁక ♦ నన్నిగతుల
వలయు సౌకర్యములను నే ♦ నలవరింతుఁ। బయనమైపొమ్ము తలపూవు ♦ వాఁడకుండ.

క॥ కాని మహాభూమీశమ। ణీ! నాఁడొకమాట పలికి ♦ యీనాఁడొకమా
టేనెటుల వచింతును వా। గ్దానమ్మును మార్చుకొను న ♦ తండు నరుండే. 169.

మ॥ అకలంకానుపమ ప్రభావయుత గో ♦ త్రాధీశ సంతాన మ
స్తక విన్యస్త కిరీట కోటి నవర ♦ త్న స్ఫార నీరాజన
ప్రకటాంఘ్రిద్వయుఁడౌచు నీవసుమతీ ♦ రాజ్యంబు సర్వంబు నా
ముకుళుం డేలెడుఁగాత నాదు వచనం ♦ బున్ నిల్పెదన్ గావుతన్. 170.

మ॥ సమయంబున్ బొనరించియుంటి మును రా ♦ జస్థానసామ్రాజ్యభా
రము సర్వంబును మోపి యమ్ముకుళు స ♦ మ్రాడ్రత్నమున్ గాఁగఁజే
యుము; సూర్యాన్వయ సార్వభౌమతకు నే ♦ యొక్కింతయున్ దక్కువై
న మనంబొప్ప దతం డధీశుఁడయినన్ ♦ నామాటయున్ జెల్లెదున్. 171.

మ॥ ఇఁకనొక్కండు; పవిత్రలగ్న మది రే ♦ పే యున్న దట్లౌట నా
ముకుళున్ సర్వమహామహీస్థలికినై ♦ మూర్ధాభిషేకంబుచే

సీ కడున్ వేగ గయాపురంబునకు వేం ♦ చేయంగవచ్చుఁ గ రణాం
బకలంకస్థిర బాహుశౌర్యమునఁ జే ♦ యఁ గావచ్చు నీకెమ్మెయిన్. 172.

మ॥ మఱలన్ వెన్కకువత్తునే యనుచు యు ♦ ష్మద్బుద్ధి సందేహమున్
జొరఁగానీయకు తండ్రి! పాపము శమిం ♦ చున్ గాక; సర్వావనీ
శ్వరులన్ గూడి మహామ్మదీయబలమున్ ♦ జక్కాడి సేమంబుతోఁ
బురిఁ జేరన్ జనుదెంతుగాక విజయం ♦ బున్ లోక మగ్గింపఁగన్. 173.

క॥ చిత్తూరిరాజ్యలక్ష్మి భ। వత్తనయు వరింపఁజేసి ♦ పదఁపడి సైన్యా
యత్తుఁడవై యాజికిఁజను। మిత్తఱి నాప్రార్థనంబు ♦ వృథసేయకుమీ! 174.

క॥ అరమరయేటికి మనమున। వరసుతు రాజ్యాభిషేక ♦ వార్తను హంసా
తరుణికిఁ దెలిపి పురినలం। కరించునటు లాజ్ఞ నాకుఁ ♦ గరుణింపఁగదే." 175.

మ॥ అని ప్రార్థించెడు పుత్రుఁగాంచి లఘుఁ "డ ♦ న్నా! నీదుత్యాగంబు నే
మనువాఁడన్ భవదీయవర్తనము సౌ ♦ ఖ్యంబిచ్చె; సామంతరా
జనికాయంబులు భక్తితోఁగొలుచు రా ♦ జస్థాన సామ్రాజ్యల
క్ష్మిని లోష్టంబుగ వీడఁజూచితివి; నీ ♦ మేలెన్నఁగా శక్యమే! 176.

క॥ పలుకుట కెట్టులో పలికితి। నలనాఁ డిపుడెట్లు ముకుళు ♦ నభిషేకింపన్
గలుగుదు నిన్నెటు వదలుదుఁ। గలదే నాకింతకన్నఁ ♦ గష్టము తనయా! 177.

చ॥ పలుకుల నేర్పుచూపెడు నె ♦ పంబునఁ బుణ్యగుణాంబురాశివై
యలరెడు నీకుఁ దీరని మ ♦ హాపకృతిన్ బొనరించియుంటి నే
కలుషములేమి నిల్వఁగను ♦ గల్గితి నాసముఖమ్మునందు; సి
గ్గలమెడుఁజుమ్ము నన్నుఁ దన ♦ యా! నిను మోమునఁ జూచి పల్కఁగన్. 178.

క॥ తనయ! యుదారము కోమల। మును ద్యాగాన్వితము నీదు ♦ బుద్ధిన్ గనఁగాఁ
గనఁగా, నేఁజేసిన యా। పని మఱి మఱి క్రూరమనుచు ♦ భావము నొచ్చున్. 179.

చ॥ కలిగినమాట విన్ము సము ♦ ఖమ్మున నేటికి రాయబారముల్
పలుకుటకేమొ నాఁడటులఁ ♦ బల్కితి; నేఁడు సమస్తభోగముల్
వెలిగ నినున్ గనుంగొనఁగ ♦ ప్రీలెడు నామది; రాజ్యమందుఁ బా
ళులు దగఁబూచి నీవు ముకు ♦ ళుండును జేకొని యేలఁగోరెదన్. 180.

చ॥ మఱియొకమాట నాపలుకు ♦ మానసమందునఁ జింతచేసి నీ
యిరవగు నిర్ణయంబు నొక ♦ యించుకమార్పు యతింపు మట్టులే

నరుగుదు హర్ష మొప్పఁగ, గ ♦ యాపురి కట్టులు కాదయేని నా
యరుసము నీటిలోఁ బడిన ♦ యగ్గి విధంబున నంతమొందెదన్." 181.

మ॥ అన "నీవింతఁగఁ జింత నొందఁ దగవౌ ♦ నా తండ్రి! నీకూర్మినం
దనులందర్ మఱి నేననన్ ముకుళుఁడ ♦ న్నన్ భేదమే? నన్ను నా
తనిగా నాతని నన్నుఁగాఁగ నిజచి ♦ త్తంబందుఁ బ్రేమింతు; రా
జ్యనిరూఢిన్ దగ నేనచేకొనినయ ♦ ట్లానందమున్ జెందుమా. 182.

చ॥ అనుపమరాజ్యలక్ష్మి విడ ♦ నాడితి నాకయి నేన నీదుసా
ఖ్యనియతి నెంచి; దాని నిపు ♦ డందఁగనుండెడివాఁడు నీకునం
దనుఁడును నాకుఁదమ్ముఁడట! ♦ నాయన! నాకిఁక నేది లోటు నే
ననిన ప్రతిజ్ఞయున్ జరుగు ♦ నట్లొనరించి యనుగ్రహింపవే. 183.

క॥ జనకు పలుకు జవదాఁటక! యనుజుఁడు సకలావనీమ ♦ హారాజగుటన్
గని సంతోషించుటక। న్నను మేలగుకార్యమొండు ♦ నాకుఁగలుగునే! 184.

క॥ ఐదేండ్లబాలు ముకుళుని। నే దైవముగాఁ దలంచి ♦ నిరుపమ భక్తి
శ్రీదైవారఁగఁ గొలిచి మ। హీదార! సమస్తరాజ్య ♦ మేలింతుఁదగన్. 185.

క॥ జనపాలక! హంసానం। దనుఁడు మహీపతియు, నేను ♦ తద్భృత్యులయం
దున మొదటివాఁడనగుచును। మనియెద నిది తక్కువనుచు ♦ మదిని దలంపన్. 186.

క॥ కావున నన్నున్ గూఱిచి। యావంతయుఁ జింతనొంద ♦ కలరుము; హంసా
దేవి కెఱిఁగించి యభిషే। కావిష్కృతి నాచరింతు ♦ నంతటఁ బురిలో. 187.

మ॥ మఱి నాప్రార్థనఁ ద్రోయఁబోకుము; నన్ ♦ మన్నింపుమం"చున్ మహీ
ధరపుత్రుండును హంసఁజేరఁజని "యో ♦ తల్లీ! సమస్తావనీ
శ్వరులున్ గొల్వఁగ నీసుపుత్రకునకున్ ♦ బట్టాభిషేకంబు తే
పరయన్ దీర్పఁగనున్నవాఁడు పతి యా ♦ హ్లాదంబు దీపింపఁగన్. 188.

మ॥ జననీ! పుత్రకు నేఁటిరాత్రి యుపవా ♦ సం బుండఁగాఁజేసి ప్రా
ద్దున సుస్నానము దీర్చి మేలినగలున్ ♦ దువ్వల్వలున్ బెట్టి నా
జనకుం డెప్పుడుకోరు, నప్డనుపు మా ♦ స్థానమ్ముఁజేరంగ; నిం
కను గాఁజాలు సమస్తకార్యములు వే ♦ డ్కన్ దీర్ప నేఁబోయెదన్." 189.

క॥ అని విన్నవించి హంసాం। గన మది యొడఁబఱచి సెలవుఁ ♦ గైకొని నిజభృ
త్యనికాయంబులతో వల। సినకార్యంబుల నతండు ♦ చేయింపఁ జనెన్. 190.

గీ॥ వ్యవధిగలయంతలోఁ జుట్టు ♦ పట్టులను స। మీపమున నున్న సామంత ♦ భూపవరుల
రాఁగలుగువారలను గొంద ♦ అను బిలువఁగ। నాశ్వికులఁబంపి రప్పించె ♦ నతిరయమున.

సీ॥ కమ్మనివాసనల్ ♦ చిమ్ముపన్నీరంబు పలుచఁగా వీథులఁ ♦ జిలుకరించి
బుగబుగల్ గొలుపు క్రొం ♦ బునుఁగు జవాదియుఁ గస్తూరి విఫణిమా ♦ ర్గములఁజల్లి
ముకుళుఁడొందుత భాగ్య ♦ భోగమ్ములంచు స్వాగతపత్రముల నెల్ల ♦ కడలఁజేర్చి
తమయంతఁ బువ్వవ ♦ ర్షము గురియించు బొమ్మలచాలు చంద్రశా ♦ లలనునిల్పి
గీ॥ బహువిధవిచిత్రతరమైన ♦ బాణసంచు। వరుస ఘంటాపథమ్ములఁ ♦ బాదుకొలిపి
వీథివీథిని సిరితాండ ♦ వించుహరాయలు। నెరపి రవ్వేళఁ జిత్తూరు ♦ పురమునందు. 192.

సీ॥ ప్రాకారసుందరా ♦ గ్రములందు రాణించె రమణీయ సూర్యధ్వ ♦ జములగములు
వాడవాడలను శో ♦ భలుగులెక్క నవరత్న రాజీరచిత రమ్య ♦ రంగవల్లి
ద్వారసీమల మనో ♦ హారిదీప్తులను జిందులుద్రాక్షెఁ బచ్చతో ♦ తోరణములు
ప్రతిమందిరమునఁ గం ♦ బములందు వెలుఁగొందె సరసరంభా స్తంభ ♦ సముదయములు
గీ॥ గాలిచే నాఱిపోవక ♦ కన్నులు మిఱు। మిట్లు గొలుపు దీపంబు లె ♦ ప్పట్లఁదనరెఁ
బరమకల్యాణముల కాల ♦ వాలమగుచుఁ। బొలిచె నవ్వేళఁ జిత్తూరి ♦ పురవరంబు. 193.

సీ॥ ఒకదానినొకఁడు శి ♦ ల్పకళాగరిమమీఱు స్తంభంబు లొకసహ ♦ స్రంబుగలిగి
యొకదానికొకఁడు స ♦ మున్నతంబై చిత్రములపనుల్ వెలయు గో ♦ డలునుగలిగి
కొననున్న సమచతు ♦ ష్కోణవితర్దిపై నవరత్నసింహాస ♦ నంబుగలిగి
యుభయపార్శ్వముల మ ♦ హెూన్నతిఁ దనరారు కమనీయ కమ్రాస ♦ నములుగలిగి
గీ॥ జనులు లక్షలు గూర్చుండఁ ♦ జాలు వితత। భూతలముగల్గి యలరాజ ♦ పుత్రరాజ్య
లక్ష్మికేకాంతగృహమై చె ♦ లంగు సుప్ర। భాస్థలంబగు రాణాస ♦ భాస్థలంబు. 194.

సీ॥ చిలుకరామాష్టీని ♦ చెలువీసడించెడు సామంతు లుభయపా ♦ ర్శ్వములఁగొలువఁ
గను చెప్పపెట్టక ♦ కాలంబుఁగనుపెట్టు కాలజ్ఞు లొక్కప్ర ♦ క్కను వసింప
మంగళాశీర్వాద ♦ మహితమంత్రములు బల్కెడు భూమిసురు లొక్క ♦ క్రేవనుండఁ
బూర్వరాజచరిత్ర ♦ ములు వేయినోళులఁ బలుకు భట్టులు నొక్క ♦ సరసనిలువ
గీ॥ నల ముహూర్తము డగ్గఱు ♦ నంత నంతఁ। జప్పు డించుకలేక ని ♦ శ్శబ్దరీతి
నంద అలరార ముకుళుఁ బ ♦ ట్టాభిషేక। సభకుఁదెచ్చి రలంకార ♦ సహితమూర్తి. 195.

గీ॥ సకల కల్యాణ వాద్య ఘో ♦ షములు సెలఁగ। భూసురాశీర్నినాదముల్ ♦ బోరుకలఁగ
ముకుళుఁడు సభాస్థలముచేర ♦ భూమిపతులు। సకలజనులు నిలిచిరి ని ♦ శ్చలభక్తి. 196

గీ॥ చందురుఁడు మహోత్సవమునఁగై ♦ దండ యొసఁగి। రత్నసింహాసనము కుడి♦ప్రక్క ముకుళు
సురుచిరాసనమందుఁ గూ♦ర్చుండఁబెట్టి। నంతలో వచ్చె శుభముహూ♦ర్తావసరము. 197

శా॥ "దేవీంవాచమ"టంచు తత్క్షణమ భూ ♦ దేవావళుల్ మంత్రసం
రావంబొప్ప ముహూర్తమింక సుముహూ ♦ ర్తంబయ్యెదుర్ వైభవ
శ్రీవైశద్యము మీఱఁగా ముకుళునిన్ ♦ సింహాసనాసీనునిన్
గావింపుండని చల్లి రాతనిపయిన్ ♦ గల్యాణమంత్రాక్షతల్. 198.

మ॥ తనమోమున్ గనుఁగొంచు నింతటి విచి ♦ త్రంబుండు నేయంచు నా
జనులెల్లన్ గడువిస్మయంబుపడఁగాఁ ♦ జందుండు పార్శ్వస్థితా
సనమందుండియు లేపి యామకుళు రా ♦ జస్థానసింహాసనం
బున నాసీనుఁబొనర్చె నల్లనఁ గరం ♦ బున్ బట్టి కొంపోవుచున్. 199.

మ॥ నిలుచున్నట్టి నృపాలురందఱు శిరో ♦ నిర్భిద్రకోటీరపం
క్తుల నెక్కించుకవాల్చి నిశ్చలపు భ ♦ క్తుల్ సూప దివ్యప్రభా
కలితంబై యురగేంద్రుఁబోలిన మ ♦ హా ఖడ్గంబుఁ జందుండునున్
మొలకున్ గట్టెను రాజ్యభార మఖిలం ♦ బున్ గట్టెనుక్కోయనన్. 200.

గీ॥ పచ్చికస్తురి పునుఁగు జ ♦ వాది చేర్చి। కలపము రచించి మేలిబం ♦ గారు పళ్లె
మునను గొనిరాగఁ జందుఁడు ♦ ముకుళుఫాల। తలమునను దీర్చెఁ దిలక ము♦త్సాహలీల.

మ॥ అమలంబైతగు భక్తి నివ్వటిలఁగా ♦ నంతంత సింహాసనా
గ్రమహీభాగమునందు వ్రాలుచు నమ ♦ స్కారంబు ముమ్మారుచే
సి మహీనాథసుతుండు చందుఁడు మహా ♦ జీమూతగంభీరరా
వము దైవారఁగ నందఱున్ గనుచు సం ♦ భాషించె నీరీతిగన్. 202.

మ॥ "అరికోటిన్ సమవర్తిమూర్తియయి బా ♦ హాటోపమొప్పార సం
గరరంగాగ్రములందు డీల్పఱచి యే ♦ కచ్ఛత్రమైయుండ భా
స్వరధర్మంబునఁ బెక్కులేండ్లుగను రా ♦ జస్థాన సామ్రాజ్యసు
స్థిరలక్ష్మిన్ వరియించి పాలన మొన ♦ ర్చెన్ బెద్దరా జెంతయున్. 203.

క॥ ఆజేండ్లక్రింద హంసా। సారసముఖి పెండ్లిమాట ♦ జరిగినపుడు ధా
త్రీరాజ్య మామెకనెదు కు। మారున కిడువాఁడననుచు ♦ మాట యొసఁగితిన్. 204.

సీ॥ యవను లపారసై ♦ న్యములతో నిపుడరుదెంచి గయనుముట్ట ♦ డించినారు
నేటినుండి యఖండ ♦ నియతితో మతయుద్ధసంరంభ ముద్వృత్తి ♦ సాఁగు నచట

సకలభారతమహీ ♦ శ్వరపక్షమునను మాతండ్రి సైన్యాధిప ♦ త్యము వహించు
మేవాడరాజ్యల ♦ క్ష్మావిభుత్వంబు నాతలమోపి పయనంబు ♦ సలుపఁదలఁచె

గీ॥ నగ్రపుత్రుండనగుచు నే ♦ నంది యేల। వలయు మేవాణ్మహీరాజ్య ♦ భరమునెల్లఁ
బూర్వసమయానుసార మి ♦ప్పుడు గ్రహించి। యేను ముకుళకుమారున ♦ కిచ్చువాఁడ.

క॥ ఈనాఁడు మొదలు రాజ। స్థానమహీచక్రమునకు ♦ సర్వంబునకున్
దా నాథుఁడగుచు ముకుళ। క్ష్మానాయకుఁ డెప్పుడేలుఁ ♦ గావుత రక్తిన్. 206.

క॥ ముకుళుని మృగేంద్రపీఠము। నకు నవ్వలఁగూరుచుండి ♦ న్యాయంబున నీ
సకలమహీరాజ్యము మ। చ్చికవెలయఁగఁ బాలనంబు ♦ చేసెడువాఁడన్." 207.

చ॥ అన జను 'లౌ'ననంచన ధ ♦ రాధిపులందఱు దివ్యరత్నమం
డనము లనర్ఘవస్త్రములు ♦ నవ్యమనోహర వస్తుజాలముల్
ఘనకరికోటు లశ్వములు ♦ కానుకలుగా నటనుంచి నూతనా
వనిపతికిన్ నమస్కృతులు ♦ భక్తియుతంబుగఁ జేసిరయ్యెడన్. 208.

మ॥ జనులున్ వారలశక్తికిన్ దగిన యా ♦ చందంబునన్ గానుకల
ప్పనమున్ జేసినయంత నాలఘుఁడు భూ ♦ పశ్రేణులన్ బౌరులన్
గని "మీసాయముచేతఁగాదె సకల ♦ క్ష్మాభాగ మిన్నేండ్లు పా
లనమున్ జేయఁగఁగంటి ధర్మ మతివే ♦ లంబౌచు రాజిల్లఁగన్. 209.

ఆ॥ అలసహస్రనేత్ర ♦ ములతో సహస్రహ। స్తములతోడ మీరు ♦ సాయపడక
యున్న సౌఖ్యమలర ♦ నుర్వీభరంబు నే। మోచుటరిది కీర్తి ♦ మోచుటరిది. 210.

మ॥ అనిశోత్సాహముఁగొల్పు మీప్రబల సా ♦ హాయ్యంబునన్ 'జాలువా'
వని వంగంబును నాగతాంమ్రములు రా ♦ ష్యం బింక సౌవీరమున్
గొనఁగానౌ గనులెన్ని పెట్టి ధనమున్ ♦ గోటానఁగోట్లున్ గడిం
పను నేఁజాలితిఁ దోడిభూమిపతు ల ♦ బ్రంబంది వీక్షింపఁగన్. 211.

మ॥ అవనీభారము మోచి మూపులివె కా ♦ యల్ గాచె; నెమ్మేను డ
స్సె; విశేషంబుగ నేండ్లు చెల్లె; బలమున్ ♦ క్షీణించె; సంసారపున్
జవులన్ నేరుచిచూచియుంటిని; ప్రపం ♦ చంబందునన్ సర్వవై
భవముల్ గొల్లఁగఁ జెందియుంటి నొకలో ♦ పంబైన లేకుండఁగన్. 212.

క॥ మఱి సప్తమోక్షదాయక। పురముల మఱపించి గయమె ♦ పుణ్యప్రద మ
ప్పురమును మహమ్మదీయులు। కరగతముగఁ జేసికొనఁగఁ ♦ గడఁగిరఁట సుఁడీ! 213.

మ॥ మనదేశంబు నృపాలకోటి బలసం ♦ పత్తుల్ రహింపన్ విప
క్షనికాయంబులఁ గూల్పఁగాఁదలఁచి రా ♦ జస్థానసైన్యంబులన్
నను వెంటన్‌గొని తేరఁగోరిరి మత ♦ న్యాయంబునున్‌బట్టి నే
జని యుద్ధంబు నొనర్చుటే కరము శ్రే ♦ ష్ఠంబంచు భావించితిన్. 214.

చ॥ చనుటకుముందు రాజ్యమును ♦ జండునిమూపున మోపనెంచ ని
య్యనఘుఁడు పూర్వమాసభను ♦ నాడినమాటను దీర్ప రాజ్యపా
లనమును దాను గైకొనఁ ద ♦ లంపక యీముకుళున్ వసుంధరే
శుని బొనరించి యెల్లరును ♦ జూడఁగఁ బట్టము గట్టె నియ్యెడన్. 215.

మ॥ పతి మీకున్ ముకుళుం డితండు మిగులన్ ♦ బాలుండు; చండుండు మీ
పతికిన్ మాఱుగ రాజపుత్రధరణిన్ ♦ బాలించు ధర్మంబు వి
చ్యుతినిన్ జెందకయుండ; నందఱమన ♦ స్సుల్ భక్తిపూర్ణంబులై
యతనిన్ గొల్వఁగనిందు కష్టమున సౌ ♦ ఖ్యంబందు నేకస్థితిన్. 216.

ఉ॥ భూవిభుతన్ మహావిభవ ♦ మున్ విడి చండుఁడు నిశ్చలాత్ముఁడై
యీవిధిఁ ద్యాగమున్ నెఱపె; ♦ నింక నృపాలుర నేర్పఱించు నా
పావనబాధ్యతల్ కరము ♦ భాసిలు నీతనియందుఁ బైనఁ "జోం
డావతు"లైన యీతని య ♦ నంతర వంశము వారి యందునున్. 217.

క॥ పాలించుఁగాక సూర్యకు। లాలంకారుండు చండుఁ ♦ డతిహర్షమునన్
సాలుంబ్రాపురి మీఁదటి। కాలమ్మున రాజధాని ♦ గాఁ గైకొనుచున్. 218.

శా॥ పారంపర్యముగాఁగఁ జండుఁడు సుతుల్ ♦ పౌత్రుల్ ప్రపౌత్రుల్ సలుం
బ్రారాజ్యంబు గ్రహింత్రుగావుత; మహా ♦ రాణాలు చిత్తూర్ రవి
ద్వారం బెప్పుడు దాఁటిపోయిన సలుం ♦ బ్రాభర్తయే నాథుఁడై
వారున్ వచ్చెదుదాఁక సర్వధరణిన్ ♦ బాలించెడున్ గావుతన్. 218. (a)

మ॥ ధనధాన్యాది సమృద్ధి చొప్పడెఁ గొరం ♦ తల్ లేవు మీరెల్ల మె
త్తనిచిత్తంబుల మంచివారగుట సం ♦ స్థానంబు సింహాసనం
బు నెవండెక్కిన రాజ్యతంత్ర మఖిలం ♦ బున్ జల్లఁగా సాఁగి మీ
కును మిమ్మేలెడువాని కెప్పుడును గ ♦ ల్గున్ సౌఖ్యసంతానముల్. 219.

మ॥ ఇరువైయేడులు రాజ్యకార్యముల నే ♦ నింపారఁ దీర్పంగఁ గో
పరసావేశము నొందువేళలను వా ♦ క్పారుష్యమున్ జూపి చె

చ్చెర మీమెత్తని మానసంబులను గా ♦ సిన్ బెట్టియుందున్ ననున్
నిరతోత్సాహమనస్కులై కృపను మ ♦ న్నింపంగఁ బ్రార్థించెదన్. 220.

గీ॥ ఆయురారోగ్య భోగ భా ♦ గ్యములొసంగి। యుండఁజను మిమ్ముఁ బరమేశుఁ ♦ డరయఁగాత
హృదయపూర్వకముగ సెల ♦ వియ్యరయ్య। యనుచు విరమించె నావృద్ధ ♦ మనుజవిభుఁడు.

గీ॥ ముకుళు పట్టాభిషేకంబు ♦ సకలవైభ। వములు పొలుపార జరిగె భూ ♦ పతి లఘుండు
బలసి చతురంగబలములు ♦ గొలువఁగా, గయాపురంబున కపుడు ప్ర ♦ యాణమయ్యె. 222

గద్య:—ఇది శ్రీమత్కామేశ్వరీ కరుణాకటాక్ష వీక్షా సమాసాదితరసవత్కావ్య
నిర్మాణ చాతురీధురీణ, సుగుణగణపారీణ, దుర్భాకవంశ దుగ్ధాంభోరాశి
రాకాకైరవమిత్ర, శాలంకాయనగోత్ర పవిత్ర, సుజన జనాను
గ్రహపాత్ర, వెంకటరామార్య పుత్ర, కవిసింహావధాని
పంచాననేత్యాది బిరుదవిఖ్యాత, సుకవి రాజ
శేఖర, రాజశేఖరకవి ప్రణీతంబయిన
చండ నృపాలచరిత్రం బను
పద్యకావ్యము నం
దుఁ బ్రథమా
శ్వాస
ము

సంపూర్ణము.



గీ॥ ఎన్ని భాగ్యంబులుండిన ♦ నేమిఫలము! పతి యొకఁడు లేక; చతురబ్ధి ♦ పరివృతోర్వి
తలముఁ బాలించుచుండు నం ♦ దనుని కన్న! బిచ్చగాఁడైన భర్తయే ♦ ప్రియతముండు. 15

గీ॥ పరమపావనమట గయా ♦ పురి; మహాత్మ! దీయ లద్దాని ముట్టడి ♦ చేయనుండి
రట; మతోద్ధరణంబు పు ♦ ణ్యప్రదమట;! నాథుఁ డంతముఁగనె; నే న ♦ నాథనైతి. 16.

చ॥ అనుఁగుఁ గుమారుఁజూచుచు ని ♦ జాధిపుఁబాసిన వంతఁ ద్రింగి జీ
వనము నదెట్టులో జరుప ♦ భావమునన్ దలపోయుచుంటె; నీ
కనులను విచ్చునట్టి కసు ♦ గం దెపు డర్హవయస్సునొంది రా
జ్యనియతులన్ స్వయంబుగను ♦ సర్వము దీర్చెడు శక్తినొందునో. 17.

మ॥ పదియేండ్లైనను బట్టు నీతఁడు మహీ ♦ భాగంబుఁ బాలించు న
వ్విదితప్రజ్ఞఁ గడింప; నంతవఱకున్ ♦ బృథ్వీవిభుత్వంబు మా
యధిపైయుండుట నిశ్చితంబగునె; రా ♦ జ్యశ్రీ కదున్ లోల; య
య్యది యెడ్డెవ్వరిఁ జెందునో యకట! శం ♦ కాయత్తమయ్యెన్ గదున్. 18.

గీ॥ పయికిఁజూచుట కేమొ వి ♦ శ్వాసయుక్తి! ముకుళుపై భక్తి ప్రజలపైఁ ♦ బూర్ణరక్తి
గలిగి చండుఁడు వర్తించుఁ ♦ గాని యకట!! గోముఖవ్యాఘ్రమేల కాఁ ♦ గూడ దతఁడు.19

మ॥ మనకున్ బైపయిఁదోఁచు వర్తనములన్ ♦ మర్యాదలన్ బట్టి యె
వ్వని యోగ్యత్వమ యేని యిట్టిదని చె ♦ ప్పన్ రాదు; ద్రోహంబు సే
యను వీలుండియు ధర్మమున్ విడని సు ♦ స్వాంతుండె పూజ్యాత్ముఁ డే
పని లేనప్పుడు ధర్మశీలురని తోఁ ♦ పన్ వచ్చు నేరేనియున్. 20.

మ॥ తనభాగంబుగ నొందఁగాఁదగు మహా ♦ ధాత్రీతలప్రాజ్యరా
జ్యనిరూఢిన్ బరుఁ డేలఁగా విడువఁగా ♦ నైనష్టు సామాన్యమ
ర్త్యుని చిత్తంబది బాధలన్ బడుటలో ♦ నోహో! విశేషంబుగ
ల్గునె; పై కేమియుఁ జేయలేనపుడు లో ♦ లోఁ జింత యెంతుండునో." 21.

మ॥ అని చిత్తమ్మున నెంచి కొంతవడి "కా ♦ హా! యేమి నాబుద్ధివ
ర్తన మిట్లింతటి నీచమార్గమునఁ బా ♦ ఱన్ జొచ్చె సందేహమున్
గని నిష్కల్మషబుద్ధి చండునిపయిన్ ♦ గారాని ద్రోహంబు సే
యను వెన్దీయవొకింత మత్ఖలమనం ♦ బా! యింతదౌర్మార్గమా! 22.

మ॥ అకటా! నిన్నను నేఁడు నేఁగనినవాఁ ♦ డా చండుఁ డాతేండ్లుగా
నొకయింటన్ వసియించియుండు మిపుడ ♦ న్యున్ బోలె భావించి శం

కకుఁ జిత్తంబునఁ జోటొసంగి కలగం ♦ గానేల! ధీరుం డతం
డకలంకస్థిరవర్తనం బెపుడు ద్రో ♦ యన్ లేఁడు దూరంబుగన్. 23.

మ॥ గతసంవత్సర మాగయాపురికిఁ బోఁ ♦ గా నెంచి రాజ్యంబు నీ
వ తగన్ గొమ్మొకభాగమిచ్చి ముకుళున్ ♦ బాటింపుమీ! యంచు మ
త్పతి శాసించిన సమ్మతింపక, మహీ ♦ భాగంబు సర్వంబు నా
సుతుపైనుంచి తొలంగ నట్టి ఘనుఁడీ ♦ క్షోణీస్థలిన్ గల్గునే!. 24.

ఉ॥ అప్పటినుండియున్ నిమిష ♦ మైన వృథా వెడలంగనీక యే
తప్పును దన్నుఁజెందని వి ♦ ధంబున నీముకుళుండు రాజుగాఁ
దప్పక దాను భృత్యుని వి ♦ ధంబున నీమహనీయభూభరం
బెప్పుడుఁదాల్చి ధర్మము ను ♦ కింత తొలంగఁగనీక యేలఁడే! 25.

క॥ జనులను దమ్ములుగా, మ। త్తనయుని లఘు భర్తగాఁగఁ ♦ దలఁచి, జగంబుల్
దనుబొగడఁగ మెలఁగెడు స। జ్జనమాన్యుఁడు చందుఁడనఁగ ♦ సామాన్యుండే! 26.

చ॥ అరమరలేక శుద్ధమతి ♦ యై నిరతంబును భక్తిగల్గి మ
చ్చరణసరోజముల్ గొలుచు ♦ సజ్జనవంద్యుఁ డతండు; వానినే
నెఱిఁగి యెఱింగి శంకను వ ♦ హించి వృథాగఁ బరోక్షమందు మ
చ్చరమున నిందలన్ బడఁగ ♦ సల్పుచుఁ దప్పఁదలంచు టొప్పునే?” 27.

మ॥ అని చింతించుచుఁ జందు నిష్కలుషపు ♦ ణ్యస్వాంతుఁడంచున్ మనం
బున భావించుచునుండి వెండియును ద ♦ ప్పన్ ద్రోవనే చిత్తమున్
జనఁగా నెప్పటికే నతండు తనకున్ ♦ శత్రుండుగావచ్చు నం.
చనుమానంపుఁదెరల్ కడున్ గలియ న ♦ న్యాలోచనంబూనుచున్. 28.

మ॥ “సరిగాలేదిదిచూడ నేటి కితఁడున్ ♦ శత్రుండు కాఁగూడ దె
వ్వరిచిత్తంబది యెప్పు డెచ్చటను నే ♦ వంకన్ జనన్ బోలునో
యెఱుగంగా వశమానె! నేఁటి కితఁడెం ♦ తే సాయమున్ జేయు స
త్పురుషుండంచని తోఁచుఁగాని యకటా! ♦ ముందెట్టులై తేలునో. 29.

చ॥ జనులను గూర్మినేలుటను ♦ జల్లని పాలనమంచు మంచిపే
రునెగడెఁ; దానఁ బౌరులెవ ♦ రున్ దనమాటను దాఁటిపోవ రం
దున నదనైనయప్డు ధృతి ♦ తో మఱి రాజ్యమునెల్లఁ గైవసం
బొనరుపవచ్చు; నిట్టితల ♦ పుండెడిఁ; నియ్యది నిక్కమెట్టులున్. 30.

మ॥ అదిగాకుండిన నెన్నియేండ్లుగను రా♦జ్యంబన్న యయ్యాసలన్
వదలేన్; మాముకుళ్లున్ ధరాపతిగ భూ♦పాలుండు సేయంగ మం
చిదటం చూఱికవెళ్లిపోక యతఁడీ♦చిత్తూరు పాలింపఁగా
మదిఁ గాంక్షింపఁగనేల! రాష్ట్రము హరిం♦పన్ గోర్కెయే యుండెడిన్. 31.

సీ॥ తనకుఁగానట్టి సుం♦దరి రంభయైనను మదిఁ బరికింపఁగా♦మాచకమ్మ
తనకుఁగానట్టి బృం♦దారకపురమైనఁ గడుదిక్కులేని కు♦గ్రామసీమ
తనకుఁగానట్టి గో♦త్రాసార్వభౌమత్వ మరయఁగా బుజముల♦బరువుచేటు
తనకుఁగానట్టి యా♦దైవత్వమైనను భావింప డుబుడుక్క♦వానివేస

గీ॥ మంత్రు పెద్దలు తనకుఁగా♦నట్టిపనుల। నెవ్వరికినైన శ్రద్ధ య♦దేటికుండు
రాజ్యపాలనమునఁ జందు♦శ్రద్ధచూడ। నతని కొండొక తలఁపున్న♦దనియెతోఁచు. 32.

మ॥ ధనభోగంబుల కాసనొందమికి నీ♦తండేమి యాగాధినం
దనుఁడో వ్యాసుఁడొ నారదుండొ ధ్రువుఁడో♦దాల్భ్యుండొ దుర్వాసుఁడో
మునిచంద్రుండు వసిష్ఠుఁడో ధరణిపై♦బుట్టొందియున్నట్టి మ
ర్త్యునకా యాసలులేకయుండు! నిది యే♦ర్పన్ జూచినన్ నవ్వరే! 33.

గీ॥ నాతనయుఁడు ముకుళున కీ♦నాఁడు చందు। డతివిధేయుఁడై ప్రియభృత్యుఁ♦డగుచునున్న
రానురా నీతఁడే ధరా♦రమణుఁడగుచు। నాకుమారుని భృత్యు నొ♦నర్పఁగలఁడు. 34.

మ॥ అకటా! పేదకుఁ బెన్నిధానమటు రా♦జ్యంబబ్బె; నిద్దాని సం
దుకొనన్ బోలు; విడంగ రాదిపుడు చం♦దుం డడ్డమైయుండె; జం
కక వీనిన్ దొలఁగింప ముఖ్యమయగున్♦గాలంబునన్ గార్యసి
ద్ధికి యత్నింపకయున్నఁ గీడెదియొ సి♦ద్ధింపంగ సందేహమే! 35.

క॥ పని చెడిన యపుడు చింతిం। చిన లాభము లేదు; వేళ♦చిక్కినపుడు చం
దుని దొలఁగింపంగాఁదగు"। నని మనమున నిశ్చయించె♦నబలామణియున్. 36.

మ॥ మనమున్ శాంతము పూననీవు; మఱి ప♦ద్మంబందు నీరంబుచా
డ్పునఁ జాంచల్యము నొందఁజేసెదవు; త్రా♦డున్ బాముగాఁ బాముఁ ద్రా
డునుగా బ్రమోదును మర్త్యుమర్త్యు నొకబ్రమో♦డున్ జేయఁగా నేర్తు వో
యనుమానవ్యథ! నీవు సోఁకిననరుం♦డంధుండు కన్నుండియున్. 37.

గీ॥ అమృతము విసంబుగా హితు♦నహితుగా సు। జనుఁ గుజనుగా వినయము మో♦సంబుగాఁగ
మార్చి యనుమానమా! తాఱు♦మాఱొనర్తు। వఖిలవస్తు తత్త్వజ్ఞాన♦మలరనీక. 38.

గీ॥ చిత్తము కలంగి మేను శుష్కించి గుణము। గొఱఁతవడి కోపమెత్తి మ♦చ్చరము పెరిఁగి
క్షీణగతినొందు నానాఁడు ♦ కేవలాను। మానరోగంబు దవిలిన ♦ మనుజుఁ డెందు. 39.

క॥ అనుమానంబను జాడ్యం। బొనరు నరుఁడు మనసుచింత ♦ నొకరిర్వురకై
నను విచ్చి వచింపకయుం। డిన నూఱట చెందఁ డెందు ♦ డెందమునందున్. 40.

చ॥ వనితయు హంసయుం బ్రకృతి ♦ భావము నెట్టులు మీఱ నేర్చు! నె
మ్మనమునఁ జందుమీఁది యను ♦ మానము లోన నిముడ్పలేక చెం
తను వసియించు నెచ్చెలులఁ ♦ దానొకరిర్వురఁ గూర్మిచేర్చి మం
తనమునఁ గొన్ని యూహలను ♦ దప్పక తెల్పె విచారఖిన్నయై. 41.

గీ॥ మొదల లొకింత పిమ్మటఁ గొంత♦పిదప మఱియు। కింత పై మఱిమఱి కొంత♦యిట్లు దినము
లవలజరిగిన కొలఁది నా ♦ హంస తనదు। హృదయమందలి వార్తల ♦ నెఱుకపఱచె. 42.

చ॥ అతివలు రాజమర్మము బ ♦ యల్పడనీయక కొన్నినాళ్లు గూ
ఢత మదినుంచి రవ్వల దృ ♦ ఢత్వము తగ్గినఁ దెల్పి రాప్తసం
తతులకు; వార్తలుం బెదవి ♦ దాఁటినఁ బృథ్విని దాఁటునన్న పం
డితతతి వాక్యమెప్పుడు గ ♦ డిందిగ సత్యము గాకయుండునే! 43.

గీ॥ కొంద ఱలహంసఁ జందునిఁ ♦ గొంద ఱాడు। కొనుచు జను లెల్లెడల గుస ♦ గుసలు పోవ
వార్త లటుపడి యిటుపడి ♦ వచ్చి యొక్క। దినము చందున కేయవి ♦ తెలియనయ్యె. 44

గీ॥ హృదయ మగలించు వార్తలు ♦ మొదలు చెవిని। దవిలినప్పుడు చందుఁడం♦తగను శాంతి
నవల విడకుండె; నవ్వార్త ♦ లంత నంత। గుంపులై వచ్చి యతని గ ♦ గ్గోలుపఱచె. 45.

మ॥ "అకటా! యెంతకు వచ్చె నాదు పని; స ♦ త్యంబింతయుం బీడఁ బో
వక నేనీశ్వరు మోముఁ జూచి ధరణీ ♦ భాగంబు ధర్మంబుఁ బా
యక పాలించుచునుండఁ దల్లి మది శం ♦ కాన్వీతమై తోఁచె; నా
కిఁక నిందల్ పడనేల! రాజ్యభరణం ♦ బింకేటికిం దాల్పఁగన్!" 46.

క॥ అని కొంతసేపు దాఁకను। దనమనమునఁ జందుఁ డెంతో ♦ తహతహపడి ది
గ్గనలేచి హంసఁ జేరఁగ। జనె నంతఃపురములోని ♦ సదనంబునకున్. 47.

క॥ తల్లికడ కేగి తత్పద। పల్లవముల చెంత వ్రాలి ♦ వందనము తగన్
జెల్లించి మోముఁ గనుఁగొని। యుల్లము పల్లటిల నార్తి ♦ నూనుచుఁ బలికెన్. 48.

మ॥ "అకటా! యెంతటి భాగ్యహీనుఁడను మా ♦ తా! నేఁటికిన్ నీదు పూ
ర్ణకృపాదృష్టిని గోలుపోతి; ధరణీ ♦ రాజ్యంబుఁ జేకొంచు న

మ్మకుభున్ మోసముచేయఁబోదునని సం ♦ పూర్ణమ్ముగా నమ్మి నీ
యకలంకమ్మగు మానసంబును వ్యథా ♦ యత్తంబుగాఁ జేసితే! 49.

శా॥ ఆఱేడేండ్లుగఁ జూచుచుంటికద; నా ♦ యం దేని మేషంబునం
దేరేఁ దప్పొకఁడైనఁబట్టునటు నే ♦ నీధాత్రిఁ బాలింతునే!
నేరం బేమియెఱుంగ; నెమ్మనమునన్ ♦ లేదింత ద్రోహంబు; పృ
థ్వీరాజ్యంబన నెక్కలోష్టముగ భా ♦ వింతున్ మనంబందునన్. 50.

సీ॥ పదునాల్గుభువనముల్ ♦ పాడుచేసెడు పెద్ద పిడుగులు శిరమునఁ ♦ బడెనయేని
కాలకూటప్రభా ♦ భీలకాళవ్యాళవితతి సంధులు తెగఁ ♦ బెఱికెనేని
సప్తకులాచల ♦ సమితి పైవ్రాలి యధోలోకమునకుఁ బోఁ ♦ ద్రొక్కెనేని
కల్లోలభయదసా ♦ గరము లోకొక్కుమ్మడిఁ బొంగి పైఁబడి యట్టె ♦ ముంచెనేని
గీ॥ ప్రళయకాలాగ్ని సప్తజి ♦ హ్వాకరాళ। గతులఁ జెలరేఁగి బిట్టున ♦ గ్గాల్చెనేని
కాలు గదలింపకయె నిల్వఁ ♦ గలను గాని। జనని! నీశంకలను విని ♦ సైపఁజాల. 51.

సీ॥ నిను వివాహమునఁ జే ♦ కొనుమన్న గంభీరమర్యాదతోఁ దొల్త ♦ మానునాఁడు
జనకుండు గోర నీ ♦ కనెడు పుత్రునకు రాజ్యంబియ్యఁగఁ బ్రతిజ్ఞ ♦ సలుపునాఁడు
నను రాజ్యభరముఁ గొ ♦ మ్మనఁ గూడదదియెప్డు ముకుళునిదంచుఁ బ ♦ లికెడునాఁడు
సకలదిగ్దేశరా ♦ జన్యులు గొలువ ముకుళుసింహపీఠిపై ♦ నిలుపునాఁడు
గీ॥ తండ్రిలేనట్టి లోపంబు ♦ తలఁగఁబెట్టి। యీధరిత్రి నాతనిపేర ♦ నేలునాఁడు
జనని! నావర్తనం బిట్టి ♦ దనుచు మదిని। నెఱుఁగవే! వేఱె నేదెల్ప ♦ నేఁలయిపుడు. 52.

చ॥ ఎఱిఁగియెఱింగి నీవె మది ♦ నిట్టులు శంకవహించి నాగుణ
స్ఫురణ ముపేక్షసేయునెడ ♦ భూజనులెట్టులు గౌరవంబుతో
నరయుదురమ్మ; తల్లియె త ♦ దాత్మజుఁ దప్పఁదలంచినన్ నిజం
బెఱుఁగఁగలేని లోకము! గ్ర ♦ హించు గుణావగుణమ్ము లమ్మరో! 53.

క॥ నను నెఱుఁగువారు నిన్నును। నిను నెఱిఁగినవారు నన్ను ♦ నిందింపఁగ సం
దునెసంగి యిర్వురను భూ। జనములలో నిందపాలు ♦ సలిపితి జననీ! 54.

మ॥ అకటా! యేలఁగఁ గోర్కెయుండినను నా ♦ యాదేశభూనాయక
ప్రకరమ్మున్ రణమందునన్ గెలిచి వి ♦ శ్వంబెల్ల సాధించి భూ
పకదంబంబులు గొల్వ వైభవమునన్ ♦ బాలింపఁగాలేనె! నీ
దుకృపాదృష్టిని శౌర్యసంపదల కెం ♦ దున్ లోటులే దమ్మరో!. 55.

మ॥ సతతశ్రీదము మాతృదేశమగు రా ♦ జస్థానమే యేలఁగా
మతియున్నన్ జనకుం డొసంగెనెకదా? ♦ మానంగ నాకేల? నీ
సుతు వంచింపఁగనేల? యీక్షణమె యీ ♦ క్షోణిన్ గొనన్నేర్తుఁ ద
త్పతినై; గుప్పఁగనేల పిచ్చుకపయిన్ ♦ బ్రహ్మాస్త్ర మీలాగునన్. 56.

ఉ॥ ఆడినమాటలన్ నిలుపు ♦ నట్టి నరుండు నరుండుగాక; యే
వాఁడు ప్రతిజ్ఞనిల్పఁ డల ♦ వాఁడొక నాలుగుకాళ్ల జంతు వా
నాఁడు లఘుక్షితీశ్వరు మ ♦ నంబు ప్రియంబున కట్టులాడి నేఁ
డేడను లేని ద్రోహము వ ♦ హింతునె? తల్లిరో! యెట్లునమ్మితో. 56.

మ॥ జననీ! నామది యోజనల్ తెలిసినన్ ♦ సంహారమున్ జేతువీ
వని నాకెన్నఁడు భీతిలేదుసుమి; పూ ♦ జ్యంబైన నాయీమనం
బున నీరాజ్యము నేలుకోరిక లవం ♦ బున్ లేదు; ఛీ! పారవే
సిన యాపండును గ్రమ్మఱన్ గొనఁగ మ ♦ చ్చిత్తంబు గాంక్షించునే? 57.

గీ॥ పైన దేవుండు క్రింద భూ ♦ ప్రజయుఁ దృప్తి| నొంద రాజ్యంబుఁ బాలించు ♦ చుంటి; నీదు
మదికి సాగియక సందేహ ♦ మొదవెనేని| రాజ్యమును వీడి చనుట భ ♦ ద్రంబు నాకు. 58.

క॥ అనుమానాస్పదుఁడగు వా| నిని జెంతను నిలుపఁదగదు; ♦ నిలిపిన నురగం
బును దలకుఁగ్రింద నిలిపిన| యనువున వాఁడాపదలకు ♦ నాస్పదమిచ్చున్. 59.

గీ॥ ఒక్కరునిగూర్చి సందేహ ♦ మొదవువేళ| లను బరిత్యాగమే శ్రేష్ఠ ♦ మనిరి విబుధు
లటు విడువకున్న నిల్చిన ♦ యాతనికిని| నిలుపుకొను వారికిని హాని ♦ గలుగునిజము. 60.

మ॥ ధరణీరాజ్యభరంబు నమ్మకుళు హ ♦ స్తంబందునన్ మోపి చెం
త రవంతేనియు ద్రవ్యముంచుకొనకే ♦ తద్రాజ్యమున్ వీడుచున్
బరదేశమ్ములకేగి యందొక మహీ ♦ పాలున్ దగన్ గొల్చి నే
భరియింపన్ బడునట్టి యత్నము నొన ♦ ర్పన్ బోదు నోయమ్మరో! 61.

ఆ॥ వేయికనులఁ జూచి ♦ వేయిహస్తంబులు| మీఁదఁగప్పి మిగుల ♦ నాదరించి
పూలఁబెట్టి ముకుళు ♦ భూమిరాజ్యంబును| బ్రోవవమ్మ! యశముఁ ♦ బొందవమ్మ! 62.

క॥ నమ్మఁదగువారి నమ్ముచు| నమ్మంగాఁదగనివారి ♦ నమ్మక యొకధ
ర్మమ్మున్ సత్యము నమ్ముచు| నిమ్మహి నమ్ముకుళుచేత ♦ నేలింపుదగన్. 63.

చ॥ అమృతమువంటి స్వచ్ఛహృద ♦ యమ్మున నేను మెలంగుచున్న, నా
దుమనసు చందమిట్టిదని ♦ తోఁపక తల్లిరో! శంకనొంది, తం

చు మదినిఁ జింతల్ మునిఁగి ♦ స్రుక్కుటకాని యొకింతయేని కో
పము మదిలేదు గాటమగు ♦ భక్తియె రంజిలు నాకు నీయెడన్. 64.

మ॥ ధరణీరాజ్యము నిన్ను నాముకుళు మా ♦ తన్ మిత్రులన్ గూర్మిసో
దరునిన్ బంధులఁ బౌరులన్ విడువఁ జిం ♦ తన్ బొంద; మీరీ మహీ
భరమున్ జక్కఁగఁదాల్చి పౌరులఁ గృపన్ ♦ బాలింతురేనిన్ మతే
కొఱంతల్ లేక యపారసౌఖ్యములు గ ♦ ల్గున్ నాకు నిక్కమ్ముగన్. 65.

మ॥ జననీ! యుత్తరమందునన్ గలుగు రా ♦ జ్యంబందు నేనుందు నీ
వనుమానంబును మాని యేలుమిఁక రా ♦ జ్యంబందుఁ గార్యంబులె
ల్లను సౌమ్యంబుగసాఁగ మే లటులఁ జె ♦ ల్లన్ బోని వేళన్ హితం
బని నీవెంచినఁ జెప్పిపంపుము క్షణం ♦ బందిందు నే వచ్చెదన్. 66.

మ॥ జరగెన్ లోపము రాజ్యకార్యముల రా ♦ జస్థానమం దంచు నే
నెఱుఁగన్ జిత్తము నిల్వ దందుపంపు నీ ♦ విందాక రమ్మన్న నే
యరిసందోహము లడ్డువచ్చినను ప్ర ♦ య్యల్ ప్రయ్యలున్ జేసి నీ
చరణాబ్జంబుల మ్రోల వ్రాలఁగల ను ♦ త్సాహంబు రెట్టింపఁగన్. 67.

గీ॥ అమ్మ! నినుజెందు సూదిమొ ♦ నంత బాధఁ। బాపునెడ మేరువటు కీడు ♦ వచ్చెనేని
సంతసమున భరింతు; నీ ♦ చందుమేనఁ। బ్రాణముండ నేకీడు రా ♦ దని తలంపు. 68.

శా॥ అమ్మా! నీకు నమస్కరింతుఁ గొనవ ♦ మ్మా! మ్రొక్కు లాశీస్సు నా
కిమ్మా! యక్కరగల్గు వేళలను నా ♦ యీ ప్రార్థనంబింత చి
త్తమ్మందున్ మఱువంగఁబోక దయయున్ ♦ దైవార వీక్షింపు; కో
పమ్మున్ జెందకుమమ్మ! నేవెడలెదన్ ♦ భద్రంబు నీకయ్యెడున్." 69.

క॥ అని హంస పదంబులచెం। తను వ్రాలి నమస్కరించి ♦ తరలి తనదుత
ల్లినిజేరి వందనంబిడి। యనఘుఁడు పరదేశదూర ♦ యాత్రకు వెడలెన్. 70.

గీ॥ చందుఁ డుండినయపు డట ♦ నుండి వెళ్లు। పిదప గంటదాఁక మొలచి ♦ వేసినట్టి
రాతిపతిమ యొక్కోయన ♦ నాతి హంస। బదులు చెప్పక మానంబు ♦ వట్టియుండె. 71.

క॥ మానమ! నీవు గుణంబుల। లోనన్ శ్రేష్ఠంబవండ్రు ♦ లోకమువారల్
కాని యదియెంతదూరము। గా నమ్మఁగనౌనొ తెలియఁ ♦ గాలేము సుమీ! 72.

మ॥ తను దప్పంగఁదలంచినప్డు నిజచే ♦ తశ్శుద్ధి నాభూమినం
దనకున్ లక్ష్మణుఁ డొగ్గిచెప్పునపుడున్ ♦ దర్వాత నీచందుఁడున్

దననిష్కల్మషబుద్ధి హంసకడ శ్ర ♦ ద్ధాభక్తులన్ దెల్పిన
ప్డును నీచేసిన కీడుమేలును జగం ♦ బుల్ చూచె నోమానవా! 73.

గీ॥ పరులు నిర్దోషులై శుద్ధ ♦ వర్తనంబు। విప్పి చెప్పునప్డు గ్రహించి ♦ వెతలుమాన్ప
వలయుచో మానవా! నీవు ♦ కొలువుదీఱి। యెన్నికొంపలు గూల్చితో ♦ యెఱుఁగరాదు.

గీ॥ పాలు నీరు హంసము వేఱు ♦ పడఁగఁజేయు। మంచి చెడ్డ హంసయు గుఱు ♦ తించలేదు
నామసామ్యంబుచేత గు ♦ ణంబురాదు। మానవులకన్నఁ బక్షులే ♦ మంచివయ్యె. 75.

గీ॥ తొలుత నవ్యాజమానవృత్తి ♦ గలుగువాఁడు। తన విశుద్ధమానసమును ♦ దల్లి తెలియఁ
జాలనపుడు దేశమువీడి ♦ చనుటకన్నఁ। జందునకికేమి కర్తవ్య ♦ ముందునకట! 76.

క॥ దావాగ్నియొక్క యనఁగా। నీవార్తలు రాజధాని ♦ నెల్లెడఁ గవియం
గా విని పౌరులు కడుశో। కావిలమతి గుంపుగూడి ♦ యార్తింబడుచున్. 77.

చ॥ "మనుకులసార్వభౌముని కు ♦ మారుఁడు ధీరుఁడు సూర్యవంశ వ
ర్ధనుఁడును సద్గుణాఢ్యుఁడు ను ♦ దారుఁడు చందుఁడటన్న దేవుఁడే
యనఁదగుఁగాదె యాఘనుని ♦ యందొకశంకయె! హంస! నీమనం
బన నది వజ్రమో శిలయొ ♦ యక్కట! యాతని మమ్ముఁ బాపితే! 78.

క॥ గొనములగని చందుని బా। సిన హితులును బందుగులును ♦ జెలులును గురులున్
ధన మిండ్లును వాకిళులును। దనయులు మాకేల! యతఁడె ♦ దైవము మాకున్. 79.

చ॥ అనఘుఁడు చందుఁడుండెడు మ ♦ హాగహనాంగణమైన మాకు న
య్యనిమిషరాజధానిగ సు ♦ ఖాస్పదమౌ; నతఁ డుండనట్టి స్వ
ర్గనగరమైనఁ బాడునర ♦ కంబగు; నాతనితోడి లోకమై
చనఁగలవార మింకఁ జని ♦ సౌఖ్యము నొందఁగలార మియ్యెడన్" 80.

చ॥ అని వగనొందు పౌరులకు ♦ హస్తములెత్తుచు మ్రొక్కి పట్టణం
బున నిలువంగఁగోరి తను ♦ బూర్వమునుండియుఁ గొల్చుచున్న యా
వినయవివేకధన్యులగు ♦ వేటరు లప్డు శతద్వయంబు వెం
ట నరుగుఁదేరఁ జందనృప ♦ నందనుఁడున్ వనసీమకున్ జనెన్. 81.

మ॥ మనసున్ రంజిలఁజేసి దైవముగతిన్ ♦ మన్నింపఁగాఁబోలు న
య్యనఘస్వాంతుఁడు "కాదు కూడదు పురం ♦ బందుండుఁడీ"యంచు నా
జ్ఞనిడన్ నిల్చిరికాని సందొదవినన్ ♦ దండోపతండంబులై
జను లాబాలము వెంబడించి చనరే ♦ చందున్ దగన్ గొల్చుచున్. 82.

గీ॥ కతిపయదినంబు లీగతిఁ ♦ గడవ ఘోర। వనములును నదుల్ గ్రామముల్ ♦ పట్టణములు
దాఁటి మండూపురము చేరి ♦ తన్మహీశుఁ। జేరఁజని యొక్కనాఁడు ద♦ర్శించె నతఁడు. 83.

చ॥ ఎదురుగ వచ్చుచుఁ జెలిమి ♦ యేర్పడఁ జందుఁ గవుంగలించి స
మ్ముదమున సేమముల్ దెలిసి ♦ భూపతి చందుఁడు భూమిరాజ్యముఁ
వదలుటయాదిగాఁగఁ దన ♦ పజ్జను జేరెడుదాఁక వార్తల
న్ని దెలిసి చింతచేసి యత ♦ నిఁ గడుమన్ననతోడఁ జూచుచుఁ. 84.

గీ॥ తనదు సౌధంబుననె కొన్ని ♦ దినము లతని। నుంచుకొని యనుచరులకు ♦ నుచితమైన
వసతుల నొసంగి పోషించి ♦ వసుమతీశుఁ। డిచ్చె హల్లూరు చందున ♦ కేలుకొనఁగ. 85.

మ॥ కులదైవంబిటు చందురూపమున మా ♦ కుఁ నేఁడు ప్రత్యక్షమై
తొలఁగఁ జేసి యనేకలోపముల సం ♦ తోషంబు సంధించు నం
చలరారంగను జందుఁడుఁ నృపతియై ♦ హల్లూరుపాలించె ని
శ్చల సంపూజ్య సమస్త ధర్మయుత శ ♦ శ్వద్గౌరవం బేర్పడఁ. 86.

మ॥ తనరాజ్యంబును బాసి చందుఁ డవలఁ ♦ దాటంగ నాహంసయుఁ
"జనె నాచింతయు రాజపుత్రధరణీ ♦ సామ్రాజ్యభారంబు పు
త్రునకుఁ దక్కెఁగదా"యటంచు మది సం ♦ తోషించె; మార్తాండుఁ బా
సిన పద్మాటవిలీవఁ గాంతితొరఁగెఁ ♦ జిత్తూర్పురం బయ్యెడఁ. 87.

ఆ॥ అమితభోగభాగ్య ♦ మలరు పద్మాక్షికి। మగనియింటివారు ♦ మడిసిరేని
పుట్టినింటివారు ♦ పెట్టిపుట్టినవారు। తనివిదీఱ భాగ్య ♦ మనుభవింప. 88.

గీ॥ మగనివంకవా రెంతటి ♦ మంచివార। లైనఁ దనవంకవారెంత ♦ హీనులైనఁ
బుట్టినింటివారలయెడఁ ♦ బాలఁతుకలకుఁ। బ్రియము బలవంతమంద్రు వి ♦ వేకిజనులు. 89.

మ॥ వనజాతాక్షియుఁ జుట్టపక్కముల మా ♦ ర్వాడ్దేశమందుండియుఁ
దనచిత్తూరికిఁ బిల్వనంపఁ దొలుదొ ♦ ల్తఁ వచ్చె "జోడా" యతం
డును హంసాంగన కగ్రజుండు ముకులుం ♦ డుఁ వానిమేనల్లుఁ డం
దున నాహంసయనుంగు బందుగులయం ♦ దుఁ వాఁడు ముఖ్యుండగుఁ. 90.

ఉ॥ ఆరణమల్లభూపతి ప్రి ♦ యంబునఁ గొన్నిదినంబులైన మం
డూరుపురంబునుండి తన ♦ యుఁ గన దానును వచ్చిచేరెఁ జి
త్తూరుపురంబు; నిందలి మ ♦ హోన్నతభాగ్యములన్ని చూచి మా
ర్వారునకేగుమాట తల ♦ పంగను బోవక నిల్చె నిచ్చటఁ. 91.

గీ॥ ఇట్లు హంసాలలన పుట్టి ♦ నింటివారు। వారివారును వరుసగా ♦ వచ్చి చేరి
రంబుసౌకర్యమలరు ప ♦ ద్మాకరమునఁ। జేరు మండూక సంఘంబు ♦ దారి తోఁప. 92.

చ॥ పలుకులు శాసనంబులయి ♦ భాసిలె; వారలు చేయునట్టి యా
జ్ఞలె కరముల్ నిరంకుశపుఁ ♦ జందము గాంచెను; వేయు నేల వా
రలె యలరాజపుత్రవర ♦ రాజ్యము నేలఁగఁ బుట్టినట్టి రా
జులపగిదిన్ ధృతిన్ మెలఁగు ♦ చున్ బలమొందిరి నాఁడునాఁటికిన్. 93.

మ॥ తమముత్తాతలనాఁటినుండియును శ్ర ♦ ద్ధన్ బెంచి చిత్తూరురా
జ్యము సేవించిన భృత్యులున్ సచివులున్ ♦ సామంతు లుద్యోగధ
ర్మములన్ మెల్లనవీడి యున్నయధికా ♦ రంబెల్లఁ గోల్పోయి చి
త్తములన్ హంసను హంసబంధుజనులన్ ♦ ధ్యానింప నైరయ్యెడన్. 94.

గీ॥ మొదటి యుద్యోగులందఱ ♦ వదలఁగొట్టి। హంసబంధు లుద్యోగంబు ♦ లందుకొనిరి
మొదలువచ్చు చెవులకన్నఁ ♦ బిదప వచ్చు। శృంగములు వాఁడి యను సూక్తి ♦ స్థిరముచేసి. 95

ఉ॥ సారతృణాంబు కాష్ఠ ధన ♦ సస్యసమృద్ధమునై చెలంగు మీ
వారిది; వారున్ నృపతి ♦ వంశజు లందును హంసఁగూర్చి చి
త్తూరున రాజబంధు లటు ♦ లుండుట నెట్లుమెలంగుచున్నఁద
మ్మేరును నాజ్ఞపెట్టరిట; ♦ నెట్టులు ధర్మము నేల నేర్తురో! 96.

ఆ॥ అల్పనరున కెందు ♦ నధికార మొదవిన। గొడుగు శేయి పట్టి ♦ నడచినట్టు
లఖిలధర్మసమితి ♦ వ్యత్యస్తముగఁజేసి। యేలి రపుడు ప్రజలు ♦ జాలినొంద. 97.

చ॥ అకట! తలంప నానహుషు ♦ నంతటి పూజ్యుఁడు స్వర్గరాజ్యనా
యకుఁడయినంత దుష్టమతి ♦ యై తిరుగాడిన, నింకఁ బొట్టకూ
టికినయి మాతృభూమిని వ ♦ ద్దిన్ విడి వచ్చు నృపాలనామకుల్
సకలమహాగుణాఢ్యులయి ♦ చల్లఁగ రాజ్యము నేల నేర్తురే! 98.

సీ॥ అధికారియరుదేర ♦ నణఁగి మణఁగియుండ కతిమార్ఖ్య మీవు చూ ♦ పితివటంచు
నన్యునితో మాట ♦ లాడితి లోలోన నీవు లంచముఁ గొంటి ♦ వేమొ యనుచు
నర్థంబదేమొ బా ♦ గై యున్నదేకాని వాక్యమాత్ర మొకింత ♦ పరుషమనుచు
నీవు చేసెదు పను ♦ లేమొప్పదుమె కాని పైవారు కని తప్పు ♦ పట్టిరనుచు

గీ॥ నిపుడువదలుము కొన్నాళ్ల ♦ కెట్టులైన। నిన్నె స్థాపింపఁగను బ్రయ ♦ త్నింతుమనుచు
నున్న యుద్యోగులందఱ ♦ నూడఁగొట్టి। వివిధపదములఁ దమవారిఁ ♦ బెట్టి రపుడు. 99.

గీ॥ తుదినిగల సేవకునినుండి ♦ మొదటి మంత్రి। వఱకు నుద్యోగులెల్ల మా ♦ ర్వారువారె
పురిని దుర్గప్రధానగో ♦ పురముకడ జ। సల్ మియర్ ప్రభు నిల్పిరు ♦ తాసిహ మలర. 100.

సీ॥ అటవీస్థలులపైన ♦ నధికారియని యుంచి నెల కైదువేల్ రూప్య ♦ ముల నొసంగి
పసులబాధలను దీ ♦ ర్పఁగ నియోగించి యాఘనున కార్వేలు వే ♦ తనము చేసి
రాళ్లపై నొక్కని ♦ రయమార మోపి యాతని కేడువేలు జీ ♦ తంబు పెట్టి
చెట్లపై నొకనిఁజె ♦ చ్చెర నిల్పి వానికిఁ బదివేలుదాఁక సం ♦ బళమునిచ్చి

గీ॥ యూఱకయె పేరుపెట్టి యొం ♦ తో యొసంగి। పేరులేకుండ నొకకొంత ♦ పిలిచియిచ్చి
స్థానములనెల్ల మార్వారు ♦ జనులనిల్పి। మొగి హరించిరి చిత్తూరు ♦ పురధనంబు. 101.

సీ॥ "అకట! యన్యాయమే" ♦ యను వారలకు భుజదండంబులం దిన్ప ♦ గుండులెత్తి
"జనులెట్లుమనఁగల" ♦ రను వారలను బట్టుకొనిపోయి పలుబండ ♦ కొయ్యల నిడి
"యిదియేమి"యనువారి ♦ నెల్లరఁ గొండొక్కచోటికిఁ గొనిపోయి ♦ స్రుక్కఁగొట్టి
"చండునిపేరెత్తు ♦ జనులు రాజద్రోహు"లని చెఱసాలల ♦ యందు వైచి

గీ॥ "ఆ"యనిన "ఊ"యనిన తప్పు ♦ టంచు జనులఁ। బట్టి యెట్టెట్టులో బాధ ♦ పెట్టి బాల
నాయకత్వంబు మఱిబహు ♦ నాయకత్వ। మిట్టిదన రాజ్యమును వార ♦ లేలిరపుడు. 102.

సీ॥ రాజబంధులు వీధి ♦ రా వారిఁ గన్నెత్తి చుఱుకుచూపున నీవు ♦ చూచితనుచు
నధికారిఁగని లేవ ♦ కప్లై చట్టాయితీరునఁ దిన్నెపైనఁ గూ ♦ ర్చుంటివనుచు
శేలు నల్వురను జే ♦ రిచి రాజుఁగూరిచి యవినయోక్తులు పెక్కు ♦ లాడితనుచు
మార్వారువారన్న ♦ మంచిమనసులేక యేవేళ నీసు వ ♦ హింతువనుచు

గీ॥ విత్తవంతుండననుచు గ ♦ ర్వించితనుచు। లేమిమై తేలుచని దొంగ ♦ లించితనుచు
వంగినను లేచినను దప్పు ♦ పట్టుకొనుచు। దిక్కులేకుండ జనుల బా ♦ ధించిరపుడు.103.

సీ॥ అనరాదురాదైవ ♦ మా! యంచుఁ దమకున్న యారాటమును లోన ♦ నణఁచువారు
పల్లెత్తుమాటను ♦ బలికిన నెటలేని బెడదవచ్చు నటంచు ♦ నుడుగువార
లేమన్న నెటుపోయి ♦ యెటువచ్చునోయంచు స్వాంతంబుననె యంగ ♦ లార్చువారు
పెదవిదాఁటినమాట ♦ పృథివి దాఁటునటంచుఁ బెదవులపై ముద్రఁ ♦ బెట్టువారు

గీ॥ నాల్క కదలింప కత్తి వెం ♦ టనె కదలు। రంతటికిఁజాలమని యూర ♦ కైనవార
లగుచు హంసాంగనాబంధు ♦ లందఱిడెడు। సకలబాధల కోర్చెఁ బ్ర ♦ జాగణంబు. 104.

గీ॥ పద్మవనమునఁ బడినట్టి ♦ వారణములు। యోజ రాజ్యంబునేలుచు ♦ నొక్కనాఁడు
రాణి హంసావధూటిఁ జే ♦ రంగఁబోయి। తండ్రియగు రణమల్లగో ♦ త్రావిభుండు. 105.

ఉ॥ "నీకడఁ జేటియైన యళి ♦ నీలశిరోజ సమస్తసుందరీ
లోకము మేలుబంతి మృగ ♦ లోచన యాలలితాలతాంగి య
స్తోకమనోజ్ఞవేషయగు ♦ చున్ హృదయంబు హరించెఁ; దాని శో
భాకమనీయవీక్షణము ♦ పర్వఁగఁ జేయఁగదమ్మ! నాపయిన్. 106.

గీ॥ మాలతీపుష్పములలోని ♦ మార్దవంబు। నమృతమునఁ గల్గు తీపు సు ♦ ధాంశుబింబ
మందుఁగల సారమును గూర్చి ♦ యబ్జసూతి। లలనఁ జేసెఁ గాకున్న నీ♦ చెలువుగలదె. 107

మ॥ నెలయయ్యెన్ లలితాలతాంగిఁగని; యా ♦ నీరేజపత్త్రాక్షి యు
జ్జ్వలలోకైకమనోజ్ఞవిగ్రహము మ ♦ త్స్వప్నంబులందేనియున్
దొలఁగన్ బోదు మనంబునుండియును; బ్ర ♦ త్యగ్రప్రభారాసి యా
లలనన్ గూడకయున్నఁ బ్రాణములు ని ♦ ల్వన్ బోవు నిక్కంబుగన్. 108.

క॥ లలితాంగన కంతటికృప। గలిగి తరళదృష్టి నన్నుఁ ♦ గాంచిన మేల
ట్టులు గానియెడ, వివాహము। సలుపుకొనన్ గలుగువాఁడ ♦ సతి నతిరక్తిన్. 109.

గీ॥ అమ్మ! మండూర్పురముఁ జిత్త ♦ మందుఁదలఁప। కిచట నే రాజ్యకార్యంబు ♦ లెల్లఁదీర్చి
నిన్నుఁ గనుపెట్టుకొనియుందు ♦ నీదుచేటి। లలిత లలితకటాక్షంబు ♦ గలుగు నేని. 110.

చ॥ వనితయు నిన్నుఁగొల్చి కడు ♦ భక్తిని సేవలొనర్చుచుండుఁగా
వున నొకమాటనున్ హృదయ ♦ పూర్వకభంగిని హెచ్చరింపఁ గా
మినియును సమ్మతించు; నిను ♦ మీఱఁగఁజాలదుసుమ్ము, "మంచిదం"
చని వచనంబొసంగుము; ద ♦ యన్ గను తండ్రి"నటంచుఁ బల్కినన్. 111.

చ॥ పిడుగు తటాలునన్ దలను ♦ బిడియొనర్పఁగఁ బడ్డయట్టు ల
ప్పడతికిఁ దండ్రి దుర్ణయపు ♦ వాక్యము లెంతయు గాసిఁగూర్ప "దే
వుఁడ! యిదియేమిపాప మిటు ♦ పుట్టెను దండ్రికి దుష్టబుద్ధి"యం
చెడఁద గలంగ నెమ్మొగము ♦ నెత్తి కనుంగొని వానికిట్లనున్. 112.

మ॥ "కలఁగన్ గూడని కోర్కె యెట్లొదవె నో ♦ కన్నయ్య! నీవేఁబదే
డులకున్ మించినవాఁడ వాలలిత కీ ♦ డున్ జోడె! లేఁ బ్రాయపుం
దలిరున్ బోఁడి లతాంగి; నిన్గవయ మో ♦ దంబందునే? నీకు నెం
దుల కీరిత్తరిత్తకోర్కె లివి యేం ♦ డ్లున్ జెల్లు నిన్నాళ్లకున్. 113.

గీ॥ లలితసౌభాగ్యరేఖా వి ♦ లాసధన్య। సకలసాధ్వీమతల్లి మ ♦ జ్జనని యింటఁ
జల్లఁగానుండ నీకింకఁ ♦ జానలేల?। పరిణయము లేల? వలవని ♦ పనులివేల? 114.

ఉ॥ ధారిణిలోన సౌఖ్యములు ♦ దద్దయుఁజూచితి; వృద్ధువైతి; ధా
త్రీరమణేంద్రుఁడౌ ముకుళు ♦ ప్రేముడితాతవు; నీసువర్తనల్
పౌరులు మాళిఁదాల్పఁగను ♦ లక్ష్యములై రహియింపనొప్పఁగా
కేరును మెచ్చనట్టి పని ♦ యేటికి? దీన యశంబు హెచ్చునే? 115.

చ॥ సమమగు ప్రాయమున్ సొగసు ♦ సద్గుణసంపద లొప్పుచో. వివా
హములు సుఖప్రదంబులగు ♦ నన్నిఁట నొక్కఁడు తక్కువైన సౌ
ఖ్యమిడమి యట్టులుండఁగ న ♦ నంతవిషాదము నొందఁజేసి జ
న్మమును నిరర్థకంబుగ నె ♦ నర్చు లతాంగికి దానిభర్తకున్. 116.

సీ॥ ఏండ్లుపోయినవాని ♦ కిందీవరదళాక్షి యెదలోన దూరిన ♦ పదనుకత్తి
వృద్ధభర్తకు భీత ♦ మృగలోచన తలాడపైనుండెడి విషోగ్ర ♦ పన్నగంబు
ముసలిమానిసికి సం ♦ పూర్ణచంద్రానన యంతంబునొందించు ♦ గొంతుత్రాడు
ప్రాతనాథునకు లేఁ ♦ బ్రాయంపుఁ బువుఁబోఁడి యత్యంతభీకర ♦ హాలహలము
గీ॥ మొగము ముడుతలుపడినట్టి ♦ మగనికెందు। రాజబింబాస్య తీరని ♦ రాజయక్ష్మ
మట్టె కాలపాశము మెడఁ ♦ జుట్టినట్టు। లయ్యె! లలితను జేకొను ♦ నాస లేల. 117.

చ॥ కటకట! యేండ్లుచెల్లు లఘు ♦ కాంతుని గూడుచు గంపెడంతచీఁ
కటి తలవైచుకొంటి; నటు ♦ గాక గడించిన సౌఖ్యమేది! మ
త్పటుతర ఘోరదుస్థితి యె ♦ దగరగింపదె; నన్నుఁజూచి నీ
వటు లలితాంగనన్ గొనఁగ ♦ నాసలు మానుమ"టంచు వేఁడినన్. 118.

క॥ విని రణమల్లుఁడు తనబు। ద్ధిని శాంతము గనక "నీకుఁ ♦ దెలిసినయది నా
కును దెలియునైన లలితాం। గన మానఁగఁజాలఁ గూడఁ ♦ గావలయుఁజుమీ. 119.

చ॥ కళలను జిమ్ము వాల్గనులు; ♦ కన్నులకన్నను మోవి కాంతులన్
బొలిచెడు; మోవికన్న నగు ♦ మోమది చంద్రునియట్లు ముద్దులన్
గులికెడు; మోముకన్న మఱి ♦ కూతుర! యాలలితాలతాంగి క్రొం
దళుకుఁబిసాళిచూపులు ము ♦ దంబిడి నామనసున్ హరించెడున్. 120.

గీ॥ నాదు శుద్ధాంతసతులందుఁ ♦ గాదు పురము। నందలి లతాంగులందుఁగా ♦ దఖిలదేశ
ములఁ గలుగు రూపవతులైన ♦ వెలఁదులందుఁ। దల్లి! లలితఁబోలిన రూప ♦ ధన్య లేదు. 121

చ॥ లలితయుఁ బూర్ణయౌవన వి ♦ లాసినియే యగుఁగాక; వృద్ధునై
యలరుదుఁగాక నేను; నను ♦ నాపదలన్నియు ముట్టుఁగాక; లో

కులు గని ఛీ! యిదేటిపని ♦ కూడనివావి యటంచుఁగాక; యా
చెలువను గూడకుండినను ♦ జీవము నిల్పఁగఁజాల నమ్మరో! 122.

ఆ॥ గోటఁ బోవు పనికి ♦ గొడ్డలి యేటికి?। నీవు మంచిదన్న ♦ నెగ్గుఁ గార్య
మిటు మనోరథాప్తి ♦ యెసఁగకయున్నచో। నేమిచేయఁదగును ♦ యెఱుఁగువాఁడ." 123

క॥ అని మౌర్ఖ్యంబునఁ దనతన। యను గూఱిచి చెప్పుచుండ ♦ నాతనిసుతుఁ డో
య్యన 'జోడా' యరుదెంచినఁ। దనమాటల నపుడు నిలిపి ♦ తండ్రి తటుకునన్. 124.

గీ॥ "అమ్మ! మఱల నే వచ్చి సా ♦ యంతనమున। సావకాశమ్ముగా మాట ♦ లాడువాఁడ
నిప్పటికిఁ బోదు"నని వచి ♦ యించి వెడలి। పోయె; జోడాయు మాటాడి ♦ పోయెనవల.

గీ॥ ఆఁడుదియు భర్తృహీనయు ♦ నాత్మజాత। హంస కెఱిఁగింప వెనుదీని ♦ యతఁడు తనయుఁ
డెఱుఁగునంచు సిగ్గుననుగా ♦ దెఱిఁగి లలిత। నతఁ డెచటఁ గోరునోయని ♦ యరిగినాఁడు.

ఉ॥ ఆవల నొక్కనాఁడు లలి ♦ తాంగనగూఱిచి మాటలాడఁగా
నావనజాక్షి హంసయును ♦ నాదరమార వినంగఁబోమి నీ
త్రోవను గార్యమాననుచుఁ ♦ దోఁపదటంచని యాసవీడి యిం
కేవిధినైనఁ గాంతను గ్ర ♦ హించుట యొప్పు నటంచు నుండఁగన్, 127.

చ॥ ఒకదిన మాలతాంగి పౌరు ♦ గూరికి బంధులఁ జూడఁబోయి యిం
టికిఁ జనుదెంచుచుండఁగ వ ♦ డిన్ జని యాత్మభటాళితోడఁ ద
చ్ఛకటముఁ జేరి చోదకుని ♦ జావఁగమోది తోలంగనీడ్చి యా
సకి లలితన్ గ్రహించి తన ♦ సద్మముఁ జేరఁగఁబోయె దానితో. 128.

మ॥ మఱియున్ రాణికిఁ దండ్రియూట నెవరున్ ♦ మాటాడఁగాలేరు; కా
మరతుం డెంతయు లోభమానసుఁడు పై ♦ మానావమానంబు లో
క్కరకంబౌనను ధీరుఁ డింక లలితా ♦ కంజేక్షణా శీల సుం
దరతారూఢులఁ గొల్లకొట్టకయె యుం ♦ డన్ నేర్చునే యాతఁడున్. 129.

గీ॥ తలఁచుగాఁ బవలెల్ల నా ♦ స్థానమందు। రాజ్యకార్యముల్ సవరించి ♦ రాత్రులందుఁ
దివిరి లలితావిచారమై ♦ త్రిని గృహమున। మనసు చెల్లించె నారణ ♦ మల్లనృపతి. 130.

గీ॥ ఇంతదాఁక మండూరుఁ దా ♦ నేలియుంట। హంసబంధులఁ బెద్దవాఁ ♦ డగుట వృద్ధుఁ
డై యనుభవజ్ఞుఁడగుట రా ♦ జ్యంబు కీడు। మేలు నరయుట రణమల్లు ♦ మీఁదనిలిచె.131

మ॥ తలపైనన్ ధవళాతపత్ర మవదా ♦ తశ్రీ సముల్లాసముల్
చిలుకన్ జామరముల్ కరంబులఁ బ్రకా ♦ శింపన్ వధూరత్నముల్

కలయన్ వీడఁగ మన్మఁడౌ ముకుళుఁ డం ♦ కస్థానవిభ్రాజియై
చెలువారన్ రణమల్లుఁ డొక్కదినమా ♦ సింహాసనం బెక్కుచున్, 132.

మ॥ అల సామంతనృపాలశేఖరులు భృ ♦ త్యామాత్యులున్ గొల్వఁగా
వెలిమీసంబులడాలు చామరలతో ♦ వియ్యంబు సేయంగ, న
వ్వులు పైపైనఁ దరంగలింపఁగ జనం ♦ బుల్ దెల్పు నా విన్నపం
బుల నాలింపక యాలకించిన విధం ♦ బున్ బూని కొల్వుండఁగన్. 133.

మ॥ తనమాతామహు నంకపీఠి డిగి చెం ♦ తన్ గల్గు నాసుందరా
ననసందోహముఁ జేరి యాముకుళుఁ డు ♦ త్సాహమ్ముతో నాటలా
డను బోయెన్; రణమల్లుఁ డావిధము చూ ♦ డన్ లేదొ, తాఁ జూచియుం
డెనొ, సింహాసనమందునుండి యవలన్ ♦ డిగ్గంగలే దయ్యెడన్. 134.

ఉ॥ మానమె ప్రాణమంచు నస ♦ మానపరాక్రమమూని ఖడ్గధా
రానిశితవ్రతంబుల ని ♦ రంతరమున్ జను రాజపుత్రసం
స్థాననృపాలురున్ సచివ ♦ సత్తము లారణమల్లుసేత కెం
తేనియుఁ దల్లడిల్లి కను ♦ లెఱ్ఱనచేసి రుదగ్రమూర్తులై. 135.

గీ॥ "కటకటా! యిట్టు లవమాన ♦ కారణంబు। గలిగె"నంచు దుఃఖించిరి ♦ కాని నృపుని
ప్రతినిధియతండు ప్రథమాప ♦ రాధ మిదియు। నగుట నెట్లొ శాంతిని బూని ♦ రపుడువారు.

గీ॥ ముకుళునకుఁ బాలొసంగెడి ♦ ముగుద చంద్ర। వదన యనుదాది యపుడు స ♦ భాస్థలంబు
నకును ముకుళకుమారు వెం ♦ ట నరుదెంచి। యుండి రణమల్లుసేతకై ♦ యుల్లమవియ, 137.

చ॥ కలిగె మహావమానమని ♦ కాంత కలంగుచుఁ బట్టరాని బి
ట్టలుకను లేచి యంతిపురి ♦ హంసను జేరఁగబోయి యమ్మ! నిన్
గొలుచుట చాలుఁ జాలు; నిదె ♦ కొల్వున నెక్కనిమేషమేనియున్
నిలువఁగఁగూడ దింక నిట ♦ నిల్చిన నిక్కము వచ్చు నాపదల్. 138.

మ॥ జనకుండంచని నీవు భక్తిమెయిఁ జే ♦ ర్చన్ గంటి చిత్తూరునం
దున; నాతం డొనరించు దుష్కృతు లవె ♦ న్నో చెప్ప శక్యంబె! నీ
జనకుం డాముకుళేంద్రు నెత్తుకొని రా ♦ జస్థానసింహాసనం
బునఁ గూర్చుండెను బట్టభద్రుఁడగు నా ♦ భూమీశు చందంబునన్. 139.

మ॥ ముకుళుం డంతట సింహపీఠిడిగి యా ♦ ముందున్న క్రమాసన
ప్రకరంబున్ దగఁజేరి యాడుకొన నా ♦ రంభించె; నద్దైన లే

వక మీతండ్రి మృగేంద్రపీఠమున గర్వ ♦ స్ఫూర్తిఁ గూర్చుండి యిం
చుకయైనన్ మరియాదచూడఁ డిది యె ♦ చ్చో భావ్యమై యుండునే! 140.

మ॥ అమలాత్ముల్ నరపాలకుల్ నతులు సే ♦ యన్ ముందు పట్టాభిషే
కమునన్ బొందిన రాజరాజునకె యె ♦ క్కన్ జెల్లునేకాక; యిం
క మఱెవ్వాఁ డెటువంటివాఁడయిన నె ♦ క్కన్ దప్పగున్; రాజపు
త్రమహీనాయకు లిట్టిదుష్కృతుల కో ♦ ర్వన్ లేరు మాతల్లిరో! 141.

మ॥ మనుమండేయగుఁగాక యేమికులుఁ డ ♦ మ్మా! నీవు నవ్వాని నం
దనవై యుందువుగాక; తాను నొక భూ ♦ నాథుండె యౌఁగాక; యీ
పని నిక్కంబుగఁ జేయరాని దిఁక నె ♦ వ్వా రెట్లు భావింతురో
యనలంబున్ దరికొల్పు చందమున మ ♦ త్స్వాంతంబు నొప్పిన్ గనెన్. 142.

చ॥ ఇది సహియింపరాని పని; ♦ యెచ్చటనుండియొ పొట్టకూటికై
మొదలను వచ్చి తా రుదర ♦ పోషణతోడనె తృప్తినొంద కి
య్యదనను గర్వమెక్కి మను ♦ జాధిపు నిట్లు తృణీకరించి త
మ్మెదిరెడువారు లేమి నెటు ♦ లేని యొనర్చిన నెట్లు చెల్లునో! 143.

క॥ ఈరాజ్యము నీజనకుఁడు। చేరుటకై మొదలె నొప్పి ♦ చెంది రిపుడు తా
నీరీతిఁ జేయఁ దొడఁగినఁ। బౌరులు సామంతు లొకట ♦ వనరుట యరుదే. 144.

మ॥ జనులన్ బెట్టెడు బాధ లిట్లని వచిం ♦ చన్ బోల దేతప్పు సే
యని యుద్యోగుల నోరుకొట్టి కడు న ♦ న్యాయంబుఁ గావించె నీ
సున; రాజ్యంబునఁ బౌరు లీకడుపు చి ♦ చ్చున్ బాయఁగాలేక తా
మనువైన ప్డెదిరించి నిల్చెదరు; రా ♦ జ్యంబప్డు వాసిన్ జెడున్. 145.

ఉ॥ స్వామియెడన్ గలట్టి కడు ♦ భక్తి మనంబునఁ గల్గు రీతి నీ
తో మొఱపెట్టికొంటి; నిది ♦ తుష్టియొనర్చిన నాలకింపు; లే
దే మది నీకుఁ దోఁచిన గ ♦ తిన్ జరియింపుము; నీహితంబు ప్రా
పై మను నాకు నీతనయు ♦ నందు మఱొక్క తలంపు గల్గునే! 146.

చ॥ తనకున్ మన్మఁడుగాన గేహమున భే ♦ దంబుంచకే యెత్తవ
చ్చును; మాటాడఁగవచ్చు; ముద్దిడఁగవ ♦ చ్చున్; గౌఁగిటన్ జేర్పవ
చ్చును; సామంతుల మ్రోల నమ్ముకుళు హె ♦ చ్చున్ జేసి మర్యాద చూ
పనె పోలున్ జుమి; యొండురీతిని జరిం ♦ పన్ రాదు మీతండ్రికిన్. 147.

చ॥ జనులకెకా దతండు నృప ♦ సత్తముఁ డానరపాలకోటికిన్
జననికి నీకు నాకు మఱి ♦ సర్వధరిత్రి కతండధీశుఁ డ
య్యనఘుఁడు దేవునట్లు మన ♦ కండఱికిన్ గడుఁబూజ్యుఁ డట్టివా 148.
నిని మరియాదచూడక తృ ♦ ణీకరణం బొనరింపఁ బాడియే!

క॥ తనయుండు చిఱుత; నీవం। గనవు; మగఁడు లేఁడు; నీకుఁ ♦ గల బంధుల వ 149.
ర్తన మెఱిఁగి తట్లుగావునఁ। గను గలిగి మెలంగవమ్మ! ♦ కనకఁపు బొమ్మా!

క॥ చెఱువునను గండిపడె నే। నరసి యద నెఱింగి మూయ ♦ నవసరమగుఁగా 150.
కుఱక విడువ నింతింతై। పెరిగి పెరిగి చెఱువునీరు ♦ వెలిఁ జేర్పదొకో!

క॥ కావున సమయంబున నే। దే వెఱవు మదిన్ గణించి ♦ హితమగు భంగిన్ 151.
గావింపుమ"నుచుఁ బలుకం। గా విని హంసావధూటి ♦ కళవళపడుచున్.

గీ॥ "దాది! నీవచించినయది ♦ తథ్యమయగు। నంకపీఠమ్మునందుండి ♦ యవల ముకుళుఁ
డరిగియుండుట మాయయ్య ♦ యెఱిఁగియుండఁ। డెఱిఁగియుండిన లేవ క ♦ ట్లేటికుండు.152

మ॥ అది యట్లుండెడుఁ గాక నాముకుళుపై ♦ నాసక్తి వాత్సల్యశు
ద్ధి దిటంబొటను గాంచి చంద్రవదనా ♦ దేవీసుతుండంచుఁ జె
ప్పదు రేకాని మదీయపుత్రుఁడని యె ♦ ప్డున్ బల్కరీ లోకు ల
య్యది గుర్తింపనె! నీహితోక్తులను గ ♦ ట్టా! నెత్తిపైఁ దాల్పనే? 153.

ఉ॥ నీవనిన ట్లుపాయము గ ♦ ణించి మనంబునఁ దండ్రి రేపొ మా
పో వడి నిందురాఁగఁ గని ♦ యొక్కవిధంబున మందలింతుఁ జు
మ్మీ! వెలితిన్ మదిన్ గనకు ♦ మెప్పటియట్టులఁ గూర్మిఁజూడు మ
మ్మా! వరపుత్రు నీకనిన ♦ యట్టి కుమారుని యట్టు లెంచుచున్." 154.

మ॥ అని హంసాంగన పల్క దాది యటుచే ♦ యన్ బోలునం చాడుచున్
బని వెంటన్ జనెఁ;దండ్రి దుష్కృతికినై ♦ భావంబు గాసిల్లి యి
ట్లనఁగారాని వెతన్ గనెన్ సతియు; సా ♦ యంకాలమైనంత నం
దనఁ జూడన్ రణమల్లభూవరుఁ డమం ♦ దప్రీతి నేతెంచినన్. 155.

చ॥ అనుదినమున్ రచించునటు ♦ లంగన తండ్రికిఁ గూరుచుండ నా
సనము నమర్చి సేమములు ♦ చల్లనిమాటలు సాగినంతఁ జెం
తను దగఁజేరి "యోజనక! ♦ తావకసత్కృపగాదె నన్ను నీ
మనుమని రాజ్యసంపదల ♦ మాన్యులఁ జేయఁగఁగ్గె నీయెడన్. 156.

మ॥ నెల రెన్నెల్లుగ రాజ్యలక్ష్మియు భవ ♦ న్నిర్ఛిద్రకారుణ్యరీ
తుల నూత్నంబగు శోభలన్ గులికి యెం ♦ తో వాసినిన్ గాంచి రం
జిలె; రాజ్యంబు స్థిరత్వమూనుపనికై ♦ చింతించు భారంబు నా
కు లవంబున్ గలుగంగనీ వెపుడు నీ ♦ కూర్మిన్ బ్రశంసించెదన్. 157.

ఆ॥ ఒక్కమాట వింటి ♦ నోయయ్య! మైననే। జూడలేదు; జనము ♦ లాడఁ దెలిసెఁ
గాని చక్కనీవు ♦ గనియుండ వది గని। యున్న నిట్లు సలుప ♦ కుండియుందు. 158.

మ॥ అదియే మంతఁగ నెక్కిచెప్పఁదగు ము ♦ ఖ్యంబైన యంశంబుగా
దిదికార్యంబుగ నేల తెల్పవలెనం ♦ చే నెంచితిన్ గాని యి
ప్డది యెట్లో మదికిన్ స్ఫురించుటను నా ♦ యందెందు భేదంబు నీ
కొదవన్ బోమిని జెప్పుటే సరియటం ♦ చూహించితిన్ బుద్ధిలో. 159.

మ॥ జనకా! నేఁడల సింహపీఠమున ను ♦ త్సంగంబునన్ ముద్దుమ
న్మనితో నీవు వసించి పౌరులమొఱల్ ♦ మన్నించుచున్నప్డు మ
త్తనయుం డాడఁగఁ బీఠమున్ విడిచి క్రిం ♦ దన్ నిల్వ సింహాసనం
బున నీవెప్పటియట్లు లుంటివఁట స ♦ మ్మోదంబు దైవారఁగన్. 160.

చ॥ తెలివి గలట్టి వారు మఱి ♦ దీనినిఁ గొండఁగఁజేసి తప్పుగాఁ
దలఁపరు కాని పామరు లె ♦ దన్ గణియించి మఱొండురీతిగాఁ
దలఁతురొ యేమొ; నాకు నిది ♦ తప్పని తోఁపదు నీవుమాత్ర మ
ట్టులె తలపోసియుండుట ని ♦ టుల్ చరియించియ యుందు వచ్చుటన్. 161.

చ॥ నిలయమునందునున్నపుడు ♦ నీకు మనం బెటువచ్చు నట్లు ము
ద్దులు కురిపింపు మమ్ముకుళు ♦ తోఁ దగఁ గాలముఁ బుచ్చుచుండు మా
కొలువున నెట్లొ గారవము ♦ కొంత కనన్ బడు నా తెఱంగునన్
మెలఁగుము; లోకు లెవ్వరును ♦ నిన్నొకఁడాడఁగఁబోవ రెప్పుడున్. 162

చ॥ జనులను నేలఁగాఁ దగిన ♦ చందము లింక సమస్తధర్మమ
ర్మనియమముల్ మహీవలయ ♦ రాజ్యమునందలి లగ్గు లెగ్గులున్
జననమునాఁటనుండియును ♦ సర్వమెఱింగిన నిన్నువంటి య
త్యనఘున కన్నియున్ గరత ♦ లామలకమ్ములు చెప్ప నేటికిన్. 163.

చ॥ పలికిన దొప్పొ తప్పొ మఱి ♦ భావమునందున నెందురీతిగాఁ
దలఁపవు నీవటంచు బలి ♦ తంబగు నమ్మిక ముంట నెమ్మదిన్

గల తెఱఁగెల్లఁ జెప్పితిని ♦ నాయన! యేమను కోకు; పిల్లలున్
బలికెడి పల్కు తండ్రికి మ ♦ నఃప్రమదమ్మును గూర్చుఁగాదొకో". 164.

మ॥ అని యెంతేని విధేయతాగరిమతో ♦ నాహంసయున్ విన్నవిం
చినయంతన్ రణమల్లుఁడున్ గినిసి రా ♦ జీవాక్షితో "మేలుమేల్
నిను మెచ్చంగనువచ్చు నీదుగుణమున్ ♦ నీమాటలున్ నీదుబో
ధనముల్ మిక్కిలి యబ్రమున్ గొలుపుఁగా ♦ దా! విన్న నెవ్వారికిన్. 165.

మ॥ జననస్థానము బంధులన్ హితుల రా ♦ జ్యంబున్ విసర్జించుచున్
నినుఁ బ్రేమించుచు నీకు మేలొనరుపన్ ♦ జిత్తూరి కేతెంచి నీ
ఘనరాజ్యావనభారమంతయును జ ♦ క్కన్ మోచి నేఁదీర్చినం
దునకున్ నీబహుమానవాక్యతతు లెం ♦ తో మోద మిచ్చెన్ బళా! 166.

మ॥ ఘనరాణోడ్కల మందుఁ బుట్టితి బహు ♦ క్ష్మానాయకుల్ గొల్వ నె
ప్డును లోపంబొకఁడైనలేనిగతి మం ♦ డూరాజ్యసంస్థానపా
లనమున్ జేసితి ధర్మమర్మముల నె ♦ ల్లన్ గాంచి సత్కీర్తినూ
నిన నావంటి నృపాలశేఖరునకున్ ♦ నీవా! పనుల్ నేర్పుటల్. 167.

ఉ॥ తాతకు దగ్గ నేర్పెడు వి ♦ ధంబున ధారిణిరాజ్యమర్మముల్
నీతులు సర్వవిద్యలును ♦ నేర్చిన నాకడఁ జెల్లునంచు నీ
రీతిగఁ జెప్పవచ్చితర ♦ రే! గరువంబది నెత్తికెక్కె నీ
కీతఱి; సీ! నితంబినుల ♦ కేటికి రాజ్యమహాప్రసంగముల్. 168.

గీ॥ నిన్ను నీతనయుని నమ్మి ♦ నేను వచ్చి। చెడుటయేకాక బంధుల ♦ స్నేహితులను
దనయులను దెచ్చి చెఱిచితిఁ ♦ దానుచెడిన। కోతి వనమెల్లఁ జెఱచెనన్ ♦ రీతిదోఁప. 169.

ఉ॥ నేనఁట సింహపీఠమున ♦ నిల్చితినంట; కుమారుఁ డాడఁగాఁ
దానెటొ డిగ్గెనంట; కని ♦ తత్క్షణమే నిలనంట; యెరో యే
దేని తలంతురంట; తన ♦ కెంతయుఁ దప్పని తోఁపదంట; యా
హా! నిజమన్న నిట్టులుగ ♦ దా రహియింపఁగఁబోలు ధాత్రిలో. 170.

మ॥ జనకుండంచని గౌరవంబుగనకే ♦ సద్భావమున్ లేక శం
కను లోఁబెంచుచు నీవె యున్నిగతులన్ ♦ గాఱుల్ వెసన్ బల్కి నా
మనసున్ గాసిలఁజేయుచుంటివి; నినున్ ♦ మన్నింపఁగారాదు; నం
దనవం చించుక యోర్చుకొంటి; నెరులై ♦ నన్ జెండియుందున్ జుమీ! 171.

గీ॥ చెప్పిన ట్లుండఁగారాదు; ♦ చెప్పునిగతి। నొప్పఁగారాదు; చెప్పియుఁ ♦ జెప్పునట్లు
యుక్తితోఁ జెప్పి తెటునేర్చి♦తో యెఱుంగ। నిన్ని టక్కులుఁ డెక్కులు♦నీవయసున.172.

చ॥ అనుపమరాజనీతియెడ ♦ నారణమల్లునిసాటి గానమం
చనిశము భూజనుల్ పలుకు ♦ నట్టి ననున్ మొగమెత్తిచూచి ధై
ర్యనియతిఁ దప్పుపట్టి యిటు ♦ లాడితి; మాయురె! గ్రుడ్డువచ్చి పి
ల్లను వెసవెక్కిరించినటు ♦ లన్ మెలఁగన్గను జొచ్చి తక్కటా! 173.

చ॥ జనకుని శంకసేఁత కలు ♦ షంబగుఁగాదె? ప్రజాళిమాటతోఁ
బని యదియేల నీకిఁకఁ బ్ర ♦ పంచము మూయఁగ మూఁకుడున్నె! నా
మనసున కెక్కినట్లు జన ♦ మండలి నేలద; నీవు చెప్పినన్
వినియెడువాఁడనే? యొరులు ♦ నేర్పెడు మాటల నాదరింతునే? 174.

మ॥ జనులున్ బల్కెడి మాట లేనువిన; నా ♦ సామంతులున్ జెప్ప వా
నిని నాలింపను; నీవచోగరిమ మ ♦ న్నింపన్ జుమీ; నాకుఁదోఁ
చిన నీపుత్రుని లెక్కసేయకయె యా ♦ సింహాసనం బెక్కువాఁ
డను; నన్నెవ్వరు నిల్పఁజాలి యెదురా ♦ డన్ వత్తురో చూచెదన్. 175.

ఉ॥ ఆఁడుదియైన దెప్పుడు గృ ♦ హమ్మున లోపల వంటయింటిలోఁ
గూడొనరించు కార్యముల ♦ కున్ దగుఁగా కధికప్రసంగముల్
పాడి యిదిట్టులంచు మగ ♦ వారల దిద్దఁగఁజూచు కార్యముల్
గూడవు; దీనినీ వెఱిఁగి ♦ కూయక వే పడియుండు మింటిలోఁ. 176.

మ॥ తనయుల్ నే నొనరించుకార్యము సమా ♦ ధానంబటం చూరకుం
డిన లగ్గౌ; నటుకాదయేని తృటిలో ♦ నీపుత్రు సింహాసనం
బునకున్ గాక తదీయజీవములకున్ ♦ ముప్పుండు; నీనెమ్మనం
బున నీమాటను నమ్ము; తథ్యమిది నే ♦ ముమ్మాఱు వాక్రుచ్చితిన్. 177.

ఉ॥ కూటికి గుడ్డకున్ గొదవ ♦ కూరనియట్టులు చూచుకొమ్ము; నీ
కేటికి రాజ్యమర్మముల ♦ నెల్ల విమర్శనమున్ బొనర్ప; నీ
తీట జనించినన్ ద్వారగఁ ♦ దీఱదు; చల్లఁగ నింట నుండు; నా
మాటను గోటఁజిమ్మినను ♦ మాకును నీకును వచ్చు వైరముల్. 178.

చ॥ "తనయవు భర్తఁగోల్పడిన ♦ దానవటంచుఁ దలంచి యెంతొ మె
త్తని మదితో, క్షణక్షణము ♦ తద్దయు మేలొనరింపఁజూడఁగాఁ

గొనకిదె యిట్లు తెలితివి ♦ గోముఖమున్ గల వ్యాఘ్ర మట్టులన్;
దనయవుగావు నీవు పెను ♦ దయ్యము వౌదువు నాదుపాలికిన్. 179.

మ॥ నిను నే దేనికి లెక్కసేయను; తగన్ ♦ నీమాటలన్ దృప్తినొం
దను; నాయిష్టముభంగిఁ జేసెద; సమా ♦ ధానంబు లేకున్న బో
రన దేవుండును లేని కోవెలను మొ ♦ ట్టన్ బెట్టి ప్రార్థింపు మిం
కను నీతోఁచినవారి నష్టపడ రాఁ ♦ గా వేఁడి తోడ్తెమ్మిటన్." 180.

చ॥ అని రణమల్ల భూమిరమ ♦ ణాగ్రణి యాడుచుఁ గోపసంభ్రమం
బునను దటుక్కునన్ గదలి ♦ పోయెఁ గుమారిని వీడి, హంసయున్
దనపయిఁ గొండ వ్రాలిన వి ♦ ధంబున నోరు కదల్పలేక వే
దనపడి నెమ్మనమ్మునను ♦ దద్దయు గాసిలి తండ్రిసేతకై, 181.

మ॥ "సుకమో కష్టమొ రాజ్యపాలనము ని ♦ చ్చోఁ దండ్రిపై మోపి యూ
రక నేనుండక దాది మాటవిని యా ♦ రాజన్యు బోధింప నే
టికి! బోధించిన నాతఁడేమిటికి నా ♦ డెందంబు నొప్పింపఁగా!
నకటా! గాలికిఁ బోవు కొమ్మకు శిరం ♦ బడ్డంగ నాకేటికిన్. 182.

ఆ॥ భర్తవంకవారు ♦ బలమరి పోయినఁ। దల్లివంకవారె ♦ తగినదిక్కు
టంద్రు; నాకుమాత్ర ♦ మది యసత్యంబయ్యె। నేమనందు! నింక ♦ నెట్లుమందు! 183.

ఉ॥ చెప్పఁగలేక నెమ్మదిని ♦ జింతిలి చింతిలి యెంతొ మెత్తఁగాఁ
జెప్పితి; నిష్ఠురోక్తిని వ ♦ చింప నొకింతయు, నాకుమాత్ర మే
తప్పును దోఁపదంటి; మఱి ♦ తానె కృపన్ గన దిక్కటంటి! నే
తప్పును లేని నాపయినఁ ♦ దండ్రికిఁ గోపము గల్గె నేటికో? 184.

చ॥ తనయుని సింహపీఠమది ♦ తప్పెటకా దిఁకఁ బ్రాణముల్ దొలం
గునని వచించెనే! యిదియుఁ ♦ గోపపుఁ బల్కొ యథార్థమో కనుం
గొనఁగ నశక్య మొక్కయెడఁ ♦ గోపపుఁబల్కగు నేని చింతిల
న్గను బనిలేదు; సత్యమయి ♦ నన్ మఱి నాకిఁక దిక్కు సున్నయౌ. 185.

మ॥ తలపైఁ బెద్దకిరీట ముంచఁగలఁడీ ♦ తండంచు నేనమ్మి ని
ప్పులగంపన్ దలపైనఁ జేర్చునటు లీ ♦ భూమీశుఁ జిత్తూరికిన్
బిలువన్ బంపియుఁ జేర్చుకొంటి మును దె ♦ ల్విన్ దక్కువై; యిప్డు చిం
తిల నేమౌను; స్వయంకృతం బితని నిం ♦ దింపంగ నన్యాయమౌ. 186.

చ॥ జనకుఁ డితైన నగ్రజుని ♦ సన్నిధి నావెతఁ జెప్పుకొందమ
న్న నతఁ డితండె మేలగు న ♦ నర్ జరియించెడి; మూఢచిత్తుఁ డా
తనికి దయాదిసద్గుణక ♦ దంబ మదెట్టిదియో యెఱుంగరా
దనిశము దుష్టులన్ గలిసి ♦ యాడి వ్యయంబొనరించుఁ గాలమున్. 187.

క॥ తనయులు దిక్కఁటేనియు। జనకు మఱుంగుఁజొచ్చుటెందు ♦ సరియగునం డ్రా
జనకుఁడె తనయులఁ దిగ్రమిం। గను జూచిన నేమిసేయఁ ♦ గా వెరవగునో! 188.

మ॥ మనసున్ రాయిగఁ జేసికొంచుఁ దలవం ♦ పన్ బోలునేకాని యే
మనుకోఁగూడ దదేరితోనయిన నా ♦ యాయాస మిట్లున్నదం
చనిన్ దీర్చెడువార లెవ్వరికఁగ ♦ ట్టా! నన్ను నాపుత్రకున్
మనుపన్ గల్గిన వారు లేరె యిచటన్ ♦ మాపాలి దైవంబులై. 189.

శా॥ ఆశల్ పుత్రునిపైన మోపుకొని త ♦ న్నత్యంతమున్ నమ్మి యిం
కే శంకల్ మదిలేక భక్తిమెయి ని ♦ ల్లే తీర్థమున్ ద్వారమే
కాశీపట్టణరాజ్యమంచుఁ గడుపే ♦ కైలాసమంచుందు; న
న్నే శిక్షింపఁ దలంచెఁ దండ్రి; యికనే ♦ నేలాగు జీవింతునో! 190.

చ॥ కినిసిన లోకమంత యొక ♦ క్రేవకుఁద్రోవఁగఁజాలు నుగ్రకో
పనుఁడును నందిఁ బందినిగఁ ♦ బందిని నందిగఁ జేయు నీతఁడున్
దునుమఁగఁబూనినప్పుడు సు ♦ తున్ దగఁ బ్రోవఁగ నాకు శక్యమే!
పెనుపిడుగట్టె పైఁబడెడు ♦ వేళలలో గొడు గాపఁజాలునే! 191.

శా॥ నాకోర్పుండెడుదాఁక రాజ్యభరమున్ ♦ నాపుత్రకున్ జూచు చిం
దే కాపాడుచునుందు నోర్పుసెడిన ♦ ప్డెట్లనియూఁగాక; యా
హా! కంజాక్షులపాలి దైవతములై ♦ యాక్ష్వేళమో త్రాడ్రా! నీ
రో కాకుండినఁ గత్తియో యలర నో ♦ హెూ! భీతి నాకేటికిన్". 192.

మ॥ అని చిత్తంబును గట్టిచేసికొని యా ♦ హంసాంగనారత్న ముం
డిన దానున్ రణమల్లుఁ డెప్పటిగతిన్ ♦ స్వేచ్ఛారతిన్ రాజ్యపా
లనమున్ జేయఁదొడంగెఁ బౌరవితతుల్ ♦ 'చాల్ చాలురా దైవమా!'
యనున ట్లందఱ బాధపెట్టుచును దుః ♦ ఖాంభోధిలోఁ ద్రోయుచున్. 193.

గీ॥ తనదుపేరన్న జనులకు ♦ దండధరుని। పేరుగాఁదోఁప, రణమల్ల ♦ ధారుణీశుఁ
డుర్విఁ బాలించుచుండి తా ♦ నొక్కనాఁడు। తలఁచె నీరీతిఁ దనదు చి ♦ త్తంబునందు. 194.

ఉ॥ "దేవుని సత్కృపారతి మ ♦ దీయకుమారిక చండ రాజపు
త్రావని వీడఁదోలె; సమ ♦ యంబున నేనును వచ్చి యాలఘు
క్ష్మావరుఁ డుంచినట్టి యధి ♦ కారుల నూడఁగఁగొట్టి బంధుమి
త్రావళిఁ దత్పదంబులఁ బ్రి ♦ యంబున నిల్పితి దూరదర్శినై. 195.

గీ॥ అస్మదధికారమిచట రా ♦ జ్యంబునందు। నెలకొనియె స్థిరంబుగ; సూర్య ♦ కులజులందు
నెంచ రఘుదేవుఁ డొకఁడె శే ♦ షించియుండె;। వానిఁ గడతేర్పఁబోలు ను ♦ పాయమెంచి."

చ॥ అని యరిశేషముండుటకు ♦ నాత్మను జింతిలి యొక్కనాఁడు న
మ్మిన భటు లిర్వురన్ బిలిచి ♦ "మీరలు మారఘుదేవుఁ జేరి యీ
కనక దుకూల సంతతులు ♦ కానుకగా రణమల్లభూవరుం
డనిపినవాఁడటంచు మరి ♦ యాద చెలంగఁగ నిచ్చిరావలెన్. 197.

ఉ॥ ఆతఁడు శైలవారపుర ♦ మందు వసించును నేనొసంగు నీ
నూతనవస్త్రసంతతుల ♦ నున్ గడవేయక గట్టుకొమ్మటం
చాతని వేఁడి యొక్కదిన ♦ మవ్వల మీరిటఁ జేరరందు పోం
డా! తడవుండఁబోకుఁడిదె ♦ యానఁగరం"డని చేరఁబిల్చుచున్, 198.

చ॥ మఱియొక కొన్నిమాటలను ♦ మంతనమందునఁజెప్పి పంప వా
రరిగిరి శైలవారపురి ♦ కచ్చట నారఘుదేవుఁగాంచి భ
క్తిరతి నమస్కరించుచును ♦ "దేవరకున్ రణమల్లధారిణీ
శ్వరుఁ డనిపెన్ దుకూలములు; ♦ స్వామి! గ్రహింపుము ప్రీతి యేర్పడన్. 199.

మ॥ అమలంబౌ హృదయంబుతో ననిపె గో ♦ త్రాధీశుఁ డీనూత్నవ
స్త్రములన్ బెట్టెను వేయ కిడ్డె ధరియిం ♦ చన్ బోలు"నంచాడ "భా
గ్యమయయ్యెన్ జుఁడి"యంచుఁ జేలముల వే ♦ డ్కన్ దీసి యందెవ్వరుం
డమి దా నప్పుడ వారి సాయమునఁ గ ♦ ట్టంగా మొదల్ పెట్టఁగన్, 200.

మ॥ తమకున్ వీలగునట్టి వేళ భటులు ♦ ద్యత్క్రౌర్యసంరంభదా
ర్ఢ్యమునన్ వైళమ పైనవ్రాలి నవరం ♦ ధ్రంబుల్ వెసన్ మూసి లో
భమునన్ జంపిరి భాస్కరాన్వయ పయః ♦ పాథోధి సంపూర్ణ చం
ద్రు మహాత్మున్ రఘుదేవు ధీరగుణశాం ♦ తున్ మాని సంకాశునిన్. 201.

చ॥ అటురఘుదేవునిన్ దునిమి ♦ యాభటు లానగరమ్ము వీడి పి
మ్మట వడిఁ జేరి రెండు రణ ♦ మల్లనృపున్; రఘుదేవు నంతమున్

బటుతరధాటితోఁ దెలిసెఁ ♦ బట్టణమెల్లెడ, నెల్లవార లు
త్కట పరివేదనాభరము ♦ గాంచి ధరం బడి సొమ్మసిల్లఁగన్. 202.

చ॥ అనుపమధాటితో దవమ ♦ హానల మవ్వన మావరించి యొ
య్యనఁ బెనువృక్షజాలముల ♦ నన్నిఁటిఁ గాలిచి బొగ్గుసేయు రీ
తిని రఘుదేవు వార్తలును ♦ దేశమునంతట నావరించుచున్
జనుల మనస్సరోజములఁ ♦ జాలఁగ గుందఁగఁజేసె నయ్యెడన్. 203.

సీ॥ "పడితివే భాస్కరా ♦ న్వయపయఃపాథోధి కుముదబాంధవ" యంచుఁ ♦ గుందువారు
"జారితే దివ్యన ♦ క్షత్రమా! తేజంబుఁబాసి నీ"వని వంతఁ ♦ బడలువారు
"త్రుంగితే సర్వస ♦ ద్గుణగరిష్ఠస్థానమా!" యంచు మదిలోన ♦ నడలువారు
"మడిసితే రఘుదేవ! ♦ మాపాలికులదైవమా!" యంచు బాధల ♦ నందువారు
గీ॥ "కటకటా! తెగిపోతె ని ♦ ష్కలుష పరమ। ధీరశాంతా!" యటంచుఁ జిం ♦ తించువార
లగుచు నాబాలగోపాల ♦ మఖిలజనులు। వనటఁ బడిపడి నేలలు ♦ పట్టిరపుడు. 204.

చ॥ దినకరవంశ్యమౌళి రఘు ♦ దేవుని యాయువు నింతకొద్దిగాఁ
గ నిడి యపారదుఃఖమునఁ ♦ గ్రాఁగఁగఁజేసితె మమ్ము! దుర్జనుల్
కనులకు నీకుఁ గన్పడరు ♦ గా! మఱి నాలుగుపెద్దమోము లా
యెనిమిదికన్ను లున్న ఫల ♦ మెయ్యది! కాల్పనె వారిజాసనా! 205.

చ॥ ప్రకటితధర్మరాజ! యమ ♦ రాజ! మహిన్ రఘుదేవుఁ డెల్లవా
రికి రఘురాముఁడంచు వివ ♦ రించి స్వయంబుగఁ ద్రుంతువేని నిం
దకు గురియౌదువన్న కత ♦ నన్ రణమల్లుని రూపమెత్తి నేఁ
డకటకటా! వధించితివె ♦ యన్యు లెఱుంగకయుండ నిర్దయన్." 206.

చ॥ అని జనులందఱుల్లముల ♦ హాలహలంబును బుట్లకొద్ది పో
సినటుల దుఃఖభారమునఁ ♦ జిక్కి తపించి, రెవండొ పూర్వపున్
జనపతికిన్ గనిష్ఠతను ♦ జాతుఁడుగాఁ డితఁ డెల్లవారికిన్
జనకుఁడెయంచు నందనుల ♦ చందము ముందు వహించిరో యనన్. 207.

చ॥ అకటకటా! మనోభవుని ♦ యట్టులు లోకమనోజ్ఞమూర్తి పై
నకలుష సత్కృపాన్వితుఁడు ♦ దారమహాగుణభూషణుండు కీ
ర్తికలితుఁడైన రాజు రఘు ♦ దేవుని దుర్మరణంబువార్తకె
ట్లొకొ హృదయంబులున్ బగుల ♦ కుండఁగ నేర్చెడి నెల్లవారికిన్! 208.

గీ॥ కట్ట! చిత్తూరు మొదలుగాఁ ♦ గడను బోయ। పల్లెవఱకును దేశంబు ♦ ప్రజలయందుఁ
బరమదుఃఖముద్రలె కాన ♦ వచ్చుచుండె। నెంచి రఘుదేవు నెంత ప్రే ♦ మించువారొ! 209.

చ॥ అదిమొద లమ్మహాపురుషుఁ ♦ డారఘుదేవునిపేరు గౌరవా
స్పదమయి రాజిలెన్ సకల ♦ సజ్జను లాయవతారమూర్తిగా
నెదలఁ దలంచి యాతనిఁ ద ♦ దేకమనంబులఁ గొల్చి రెప్పుడున్
సదమలసద్గుణోన్నతులు ♦ సర్వజగత్పరిపూజ్యులే కదా! 210.

చ॥ అనయము శారదోత్సవము ♦ లందున నాశ్వయుజాష్టమీదినం
బనితరమోదమొప్ప విధి ♦ ధాయుధపూజలు సేయునప్పు డ
య్యనఘుని బింబముల్ కడిగి ♦ యగ్రతలంబునఁ బీటపెట్టి భ
క్తిని జరిపింత్రు పూజలను ♦ దీపము దూపము నిచ్చి మ్రొక్కుచున్. 211.

గీ॥ శారదాష్టమియందునఁ ♦ జైత్రశుద్ధ। దశమి నీరీతి మేవాడ ♦ ధరణిజనులు
వారు వీరనకయె యెల్ల ♦ వారుకూడి। దేవునటు కొల్తు రారఘు ♦ దేవు భక్తి. 212.

గీ॥ భర్తలెల్ల భార్యలు ప్రజా ♦ వతులుగాఁగ। నంబుజాస్యలు సుతులు దీ ♦ ర్ఘాయురాప్తిఁ
బొంద జతలు జతల్ గూడి ♦ మ్రొక్కుకొందు। రల్ల రఘుదేవు పదముల ♦ యందు వ్రాలి. 213

చ॥ అలరఘుదేవు బింబము ప ♦ దాబ్జయుగంబున వ్రాలి యబ్దమం
దలరఁగ రెండుమాఱు లిటు ♦ లందఱు పౌరులు చేరి గొప్పగుం
పులగుచుఁ గొల్తు రింక దిన ♦ మున్ బ్రొయికించుకపైన విగ్రహం
బులనిడి స్త్రీలు కొల్తురి పరి ♦ పూర్ణమనంబుల భక్తిఁ బెంచుచున్. 214.

గీ॥ సద్గుణుండని ఋషియని ♦ శాంతుఁడనియు। నల్లరఘుదేవునెడ భక్తి ♦ యతిశయిల్ల,
నవగుణుఁడు ద్రోహియనియును ♦ హంతయనియు। నల్లరణమల్లునెడ నస ♦ హ్యతనుగనిరి.

గీ॥ మునుపె రణమల్లుచేష్టల ♦ వనటమునిఁగి। దిక్కులేని హంసయు రఘు ♦ దేవువధముఁ
గూర్చి విన్నప్డు ప్రాణముల్ ♦ కొనకువచ్చు। గతి నరుంతుదమైన శో ♦ కమున నొరఁగె. 216.

చ॥ తనమదిలోని వేదనకుఁ ♦ దాళఁగఁజాలక బాష్పధారలన్
గనుఁగవ చిమ్మఁ జంద్రవద ♦ నన్ దరిఁజేరఁగఁ బిల్చి "తల్లి! నీ
వనిన యనాగతోక్తులవి ♦ యన్ని ఫలించెడు నట్టి కాల మ
ల్లనఁ జనుదెంచె నింక నెటు ♦ లన్ నను బుత్రునిఁ గాచి ప్రోతువో! 217.

ఉ॥ నీవు నెఱింగియుందు విట ♦ నిన్నను మొన్నను బుట్టినట్టి యా
యీవెతలన్నిఁటిన్; మనసు ♦ నేర్చుఁగదే! రఘుదేవుఁ డెట్టివాఁ

డో! వసుధాజనం బెఱుఁగ ♦ రో! రణమల్లుఁ డెఱుంగఁడో! కటా
దేవునకైన నుండు; రఘు ♦ దేవునియం దొక దోస ముండునే! 218.

ఉ॥ మేరుమహామహీధరము ♦ మేకొని త్రవ్వి శిరానమెత్తునం
చీరణమల్లుఁ దత్సుతుని ♦ నిచ్చటఁ జేర్చితి; గర్వమెక్కి య
వ్వారు ప్రజాళినెల్లపుడు ♦ బాధలు పెట్టుచు వారియెమ్ములన్
నూఱుచుఁ ద్రావి రెండయిన ♦ నున్ గలవే యిటువంటి కృత్యముల్! 219.

చ॥ నను గను తండ్రియైనకత ♦ నన్ గడుఁగూరిమిఁ జూచునంచు న
మ్మిన మొదలంట నన్నుఁ దిగ ♦ ద్రింగఁగఁ గోరు నితండు; మందిరం
బున వెలుఁగొందు దీపమని ♦ ముద్దిడఁబోయిన మూతి మీసముల్
మునుకొని కాలెనన్న విధ ♦ మున్ నిజమై కనుపట్టె నేఁటికిన్. 220.

క॥ తనయందుకన్న రఘుదే ♦ వునియందునఁ బ్రీతి తద్ద ♦ పూనును జందుం
డనుజుని మృతి విని మదివే ♦ దనలకుఁ బ్రాణములు పట్టి ♦ తాళఁగఁ గలఁడే? 221.

మ॥ కలిగెన్ సర్వము నన్నుఁగూర్చి యటులన్ ♦ గాకున్న, నేశౌర్యసం
కలితుండున్ రఘుదేవు మోమును గనం ♦ గానేర్చునే! దుర్భర
జ్వలనుండోయన రేఁగి లోకములఁ గా ♦ ల్చన్ బోఁడె చండుండు? త
ద్బలశౌర్యోద్ధతి కోర్వనేర్చునె యమి ♦ త్రశ్రేణు లావంతయున్. 222.

మ॥ మనకున్ వారికిఁ గల్గు మైత్రియును సం ♦ బంధంబు కాసంత త
గ్గినఁ దగ్గెన్ జుమి; కల్గు సత్యమును వీ ♦ క్షింపంగ నాచండుఁడ
య్యనుజుండున్ రఘుదేవుఁ డిర్వురును బు ♦ ణ్యస్వాంతులున్ లోకపా
వను లవ్వారల కెగ్గుచేసెడు జనుల్ ♦ పాపుల్ దురాత్ముల్గదా! 223.

చ॥ ఇటువలె సద్గుణోన్నతు ల ♦ హీనపరాక్రమశోభితాత్ము లు
త్కటకరుణాసముద్రులు ను ♦ దారులు వారల కెగ్గుచేసి నేఁ
డటమటమయ్యె నాదుబ్రదు ♦ కన్యులు నన్నెటు నమ్మనేర్తు ర
కటకటకట! నాకె హంసయన ♦ గౌరవ మింతయు లేదు నెమ్మదిన్. 224.

సీ॥ ముప్పొద్దు దినదినం ♦ బును నమస్కృతిసేయు నప్పుడైనఁ బాదంబు ♦ లంటవెఱచు
భక్తితో నాపద ♦ ద్మయికాని మోము నేనాఁడును గన్నెత్తి ♦ చూడవెఱచుఁ
దల్లీ! యటంచు మా ♦ తా! యటంచేకాని వేఱుపేరుల నన్నుఁ ♦ బిలువవెఱచు
నామ్రోల దూరాన ♦ నడచుటేకాని యల్లంత చేరువకు డా ♦ యంగవెఱచు

గీ॥ మాతృదైవంబనంచు నె ♦ మ్మదిఁ దలంచు। సరససౌజన్యధన్యుఁ డా ♦ చండుపైన
లేని పోని శంకలు పెట్టి ♦ లేవఁగొట్టి। పంపి యిపుడు చింతించిన ♦ ఫలముగలదె! 225.

చ॥ "కలుషము లేదు నేముకుడు ♦ గాదిలితమ్ముని గాఁగఁ జూతుఁ బొ
రుల సుతులట్ల చూతు నెన ♦ రున్ గను నిన్నును దల్లికన్న మి
క్కిలియగు భక్తిఁ జూతు"నని ♦ కేలు మొగిడ్చి వచించె; నానుడుల్
దలఁచిన బాష్పముల్ కనుల ♦ ధారలు ధారలు గట్టి దూఁకెడున్. 226.

గీ॥ మొదట రాజ్యభోగంబులు ♦ వదలవలసె;। నవల మాతృదేశము వీడి ♦ యరుగవలసెఁ;
బాప! మోదాది! ననుఁగూర్చి ♦ పడఁగరాని। బాధలన్ బడెఁ జండనృ ♦ పాలసుతుఁడు.

శా॥ "ఏకాంతంబు విపత్తు గల్గిన భటుం ♦ డెవ్వాని సేఁబంపుమా
నాకున్ దెల్పఁగ నెక్కడున్నటు లమం ♦ దస్ఫూర్తి నేతెంతున
మ్మా! కారుణ్యముఁ జూపుమా!" యనె జగ ♦ న్మాన్యుండు చండుండు; నా
యీ కష్టంబెఱుఁగన్ గదున్ వడిగఁ దా ♦ నేతెంచు నిక్కమ్ముగన్. 228.

ఉ॥ చండుఁడు చండుఁడే యిపుడు ♦ సర్వవిధంబుల మమ్ముఁ బ్రోవ నా
పుత్రుండును జాలువాఁడు; తటి ♦ తో నతఁడీడకు వచ్చి పాతకో
ద్దండులు నాదుబంధువుల ♦ దౌష్ట్యము మాన్చిన నెట్లొ నాదుపు
త్రుండును నేను జీవముల ♦ తో నిలువంగను నేర్తు మంగనా! 229.

గీ॥ శీఘ్రగతిఁ గార్యగతిని ర ♦ క్షించుకొనుచు। నల్ల మండూపురముఁ జేరి ♦ యతని గుప్త
ముగ నిటకుఁ దోడితేఁగల ♦ ప్రోఢ లెవ్వ। రీవు దక్కంగ; సుతభిక్ష ♦ మిడుము నాకు. 230

సీ॥ తను నకారణము శం ♦ కనుజెంది నొప్పించినట్టి పాపఫలంబు ♦ నందితినను
హంసయు ముకుళుండు ♦ వ్యాఘ్రంబులన్ మృగశిశువులచందానఁ ♦ జిక్కిరనుము
తనయు నన్నిటవచ్చి ♦ మనుపకుండిన నొక్కనిమిషంబు బ్రదుకంగ ♦ నేరననుము
మాత నబలఁ దెల్వి ♦ మాలిన నన్నుఁగూర్చియుఁ బెద్దమనసును ♦ జేయుమనుము
గీ॥ తెప్పవాల్పక తనరాక ♦ రేయుఁబవలు। డెందమందున నేఁగోరి ♦ యుందుననుము
దేవునటువచ్చి నావెత ♦ దీర్పుమనుము। వేగముగఁ బుత్రభిక్ష మి ♦ ప్పింపుమనుము."231

క॥ అని హంసాంగన చంద్రవ। దన చేతులు పట్టి వేఁడఁ ♦ దరుణియుఁ "దల్లీ!
నిను ముకుళుని గొలుచుట నా। కును భాగ్యముగాదె చండుఁ ♦ గొనివత్తువడిన్. 232.

చ॥ కనుఁగొనలేఁడు శత్రులును ♦ గష్టములొందినఁ; బెక్కులేండ్లుగాఁ
గ నెఱుఁగుదున్; విశుద్ధగుణ ♦ గౌరవుఁ డాతఁడు; సూర్యుఁడేనియున్

దనగతిఁ దప్పవచ్చు; వసు ♦ ధఁగల యాపద లన్నివచ్చినన్
దనవచియించు మాటలను ♦ దప్పఁడు; సత్యము పట్టి నిల్చెడున్. 233.

క॥ తడవేటికి సెలవిమ్మ"ని। యడుగులకును మ్రొక్కి దాది ♦ యరుగఁగ మదిలో
నెడనెడ హంసయు భయమునఁ। గొడుకును భద్రమునఁ గాచి♦కొనియుండెఁ బురిన్.234

గద్య:—ఇది శ్రీమత్కామేశ్వరీ కరుణాకటాక్ష వీక్షా సమాసాదితరసవత్కావ్య
నిర్మాణ చాతురీధురీణ, సుగుణగణపారీణ, దుర్భాకవంశ దుగ్ధాంభోరాశి
రాకాకైరవమిత్ర, శాలంకాయనగోత్ర పవిత్ర, సుజన జనాను
గ్రహపాత్ర, వెంకటరామార్య పుత్ర, కవిసింహావధాని
పంచాననేత్యాది బిరుదవిఖ్యాత, సుకవి రాజ
శేఖర, రాజశేఖరకవి ప్రణీతంబయిన
చండ నృపాలచరిత్రం బను
పద్యకావ్యము నం
దు ద్వితీయా
శ్వాస
ము
సంపూర్ణము.



శ్రీ

# చండనృపాలచరిత్రము.

## తృతీయాశ్వాసము.



చ॥ మలయధరంబునన్ వలపు ♦ ప్రాకులనెయ్యమునన్ మెలంగి ద
వ్వుల విహరించుచున్ విమల ♦ ఫుల్లసరోజసమాజసౌరభా
వళులను దొప్పఁదోఁగుచుఁ బ్ర ♦ భాత సమీర కుమారవారముల్
వెలయఁగఁజొచ్చె నెల్లెడల ♦ విశ్వము సర్వము మోదమందఁగన్.

చ॥ మడతల మేలి కుచ్చుల రు ♦ మాలు శిరంబునయందు మేన నె
ల్లెడఁ బలువన్నెలన్ గులికి ♦ యింపగు సన్నని యంగరేకులున్
బిడికిట విల్లు నంపపొది ♦ వీపున నుండఁగ వేఁటకాండ్రు సొం
పడరఁగ రెండునూఱులు ర ♦ యంబున నొక్కదినంబు ప్రొద్దుటన్, 2.

మ॥ అతిదూరమ్ముననుండి వచ్చిన ఘనా ♦ యాసంబు ప్రాభాత మా
రుత మొక్కించుక తీర్ప శీఘ్రగతి వా ♦ రున్ సాఁగి చిత్తూరుదు
ర్గతలంబందుఁ జొరంగ నున్నయెడ ద్వా ♦ రంబందునున్నట్టి యో
ధతతుల్ వైళమ యడ్డువచ్చి యవలన్ ♦ దాటంగనీ కొక్కటన్, 3.

ఉ॥ "ఎవ్వరుమీర, లిచ్చటికి ♦ నేనగరంబుననుండి వచ్చినా,
రెవ్వని పక్షమున్ గొలుతు, ♦ రిందులరా మఱిహేతువేమి, మీ
కెవ్వరితోడఁ గార్యము, మ ♦ హీపతి సమ్మతి నొందినారె మీ
రివ్విధి లోనికిన్‌జొరఁగ? ♦ నిన్నిఁటి కుత్తర మియ్యఁగావలెన్. 4.

మ॥ అనువా నుత్తర మియ్యకున్నఁ బురమో ♦ య్యన్ జేరఁగానీము మి
మ్మ"నఁగా వేఁటరులున్ వెసన్ బలికి "ర ♦ య్యా! చండునిన్ గొల్చి యా
తనివెంటన్ జనియుంటి మిప్పటికి న ♦ బ్దంబయ్యె; హల్లూర్పురం
బున నిన్నాళ్లు వసించియుంటి మతనిన్ ♦ ముప్పొద్దు సేవించుచున్. 5.

ఉ॥ ఆతఁడు సర్వకార్యవిజ ♦ యాంకుఁడు, ధీరుఁ, డుదగ్రసాహసో
పేతుఁడు, పైన వీరులకు ♦ వీరుఁడు, కష్టము గల్గువేళ ని
ర్భీతిఁ జరించువాఁ, డతని ♦ వెంట ననారత ముండలేక మా
చేతము తల్లడిల్లుటఁ దృ ♦ జించితి మాతని తోడినెయ్యమున్. 6.

మ॥ వనితల్ పుత్రులు నిండ్లు వాకిళులు స ♦ ర్వస్వంబుఁ బోనాడి మా
యనుఁగుల్ బంధుల నందఱన్ విడిచి ఘో ♦ రారణ్యముల్ చొచ్చి యా
తనితోఁ గాననిదేశముల్ దిరిగి చెం ♦ దన్ రాని కష్టంబులన్
గని మామేనులు క్రుళ్లి పోయినవి ప ♦ ల్కన్ లేము మాదుస్స్థితిన్. 7.

మ॥ "యువతిన్ బుత్రులఁ జూడఁగావలయుఁ గు ♦ య్యో! మొఱ్ఱో! నీవెంట మే
ము విదేశంబుల నుండఁజాల మిఁక మ ♦ మ్మున్ బంపు మేవాడ మే
మవలోకింప ననుగ్రహింపు మిదె వీ ♦ లైనంత కాలమ్మునున్
భవదంఘ్రిద్వయిఁ గొల్చినార మతిశం ♦ భద్భక్తి పూర్వమ్ముగన్. 8.

మ॥ మది కిష్టంబగునేని నీవును తగన్ ♦ మావెంటఁ జిత్తూరికిన్
గదలన్ బోయిము తొంటియట్ల కడు వే ♦ డ్కన్ శీర్షమందుంచి నీ
పదముల్ గొల్తుము; నిల్వఁగోరిన మమున్ ♦ బంపించి నీకిష్టమై
న దెసన్ బొమ్ము; జయంబు కీర్తియును నిన్ ♦ బ్రాపించు నెందేనియున్." 9.

మ॥ అని యెన్నేనియుఁ గూర్మిచక్కటుల మా ♦ యాయాసమున్ దెల్పి యా
తని చిత్తంబును గుస్తరించుచును నా ♦ ధన్యాత్ముతో 'మీరు పొం'
డని యన్పించి నమస్కరించి నిమిషం ♦ బైనన్ వృథాసేయ కా
య్యన హల్లూర్పురి వీడివచ్చితి మర ♦ ణ్యప్రాంతముల్ చేరఁగన్. 10.

ఉ॥ దూరమటంచు వేసరక ♦ తోడనె యామడ కొక్కయద్దుగాఁ
దీరని శీఘ్రయానములఁ ♦ దీర్చుచు మూయని ఱెప్పలెత్తిచి
త్తూరును జూతుమే యనుచు ♦ నెక్కగతిన్ జనుదెంచినాము మా
కోరిక లాలుబిడ్డలను ♦ గూడి మెలంగుటయై తనర్చెడున్. 11.

మ॥ ప్రమదం బిచ్చుచు జన్మభూమియగు మే ♦ వాడ్సీమయే మాకు ము
ఖ్యము; వేఱొండది వేల్పుఁబ్రోలయిన నా ♦ గ్రామంబునన్ జక్రవ
ర్తిమహాస్థానము మాకుఁ జిక్కినను సం ♦ దేహింపనేలా! నిమే
షము సేపుండుము; మౌళిఁ దాల్చెదము రా ♦ జస్థానమున్ నామమున్. 12.

ఉ॥ మేమును దెల్వియందునను ♦ మిక్కిలి తక్కువవారమౌచు నె
ట్లో మునుముందుఁ జండుబడి ♦ నుంటిమి కాని యతం డనంగ రా
జో! మఱి రాతో! వాఁడెవఁడు! ♦ క్షోణిని పాలనసేయు రాజము
ద్రామహితుం డెవం డతఁడె ♦ రాజును రాతును మమ్ము నేలఁగన్. 13.

చ॥ సకలనృపాలకుల్ గొలువ ♦ సర్వధరిత్రికిఁ జక్రవర్తియా
ముకుళుఁడు వైరి; కొంతవడిఁ ♦ బొత్తున నుండినమాత్రఁ జండుఁడున్
సకలమహేంద్రభోగములఁ ♦ జయ్యన నెత్తికి నెత్తు మిత్రుఁడా!
ముకుళుఁడె రాజరాజుకడుఁ ♦ బూజ్యుఁడు మాకు జగద్గురుండగున్. 14.

మ॥ మదిలోనన్ గల చందమిప్పు వివరిం ♦ పన్ సందియంబేల యు
న్నది యున్నట్టులఁ జెప్పుకొంటి మిది మీ ♦ కంగీకృతంబైన నుం
డెద 'మేగుండ'న గుడ్డ నెత్తినిడి యెం ♦ దే 'లక్ష్మణా'యంచుఁ బో
యెద మిడ్డే ప్రతికూలదైవమున కి ♦ స్సీ! జోతలన్ బెట్టుచున్;" 15.

చ॥ అని ముకుళాధినాథునెడ ♦ నచ్చపు భక్తి నటించి పల్కఁగా
విని యల దుర్గరక్షకులు ♦ వేగముమై రణమల్లుతోడ వా
ర్తను దగవిన్నవించిన న ♦ తండును నందలి మంచిచెడ్డలన్
మనసునఁ జింతచేసి యను ♦ మానము నొందక సమ్మతించినన్, 16.

క॥ జనపతి యనుమతి శిరమునఁ। గొని వేగమ దుర్గరక్ష ♦ కులు వచ్చి "పురం
బునఁ జేరవచ్చునని రా। జనుమతి నిడె నిచ్చె"ననఁగ ♦ నావేటరులున్, 17.

సీ॥ చేరెడంతై బెడ ♦ గారు కన్నుల భార్య లడుగకుండనె సేమ ♦ మరయుచుండఁ
బరుగెత్తి యెదురుగా ♦ వచ్చుచు విచ్చిన కరముల బాలురు ♦ గౌఁగిలింపఁ
"దండ్రి! రారా!" యని ♦ దటిఁజేర్చి తల్లులు మిగులఁ బ్రేమంబున ♦ మేనునిముర
నెన్నాళ్లకబ్బె మి ♦ మ్మిటఁ జూడఁగానంచుఁ బౌజులుగాఁ గూడి ♦ బంధులలర
గీ॥ నలరుమోములతోడ మి ♦ త్రులును వచ్చి। చూడఁ జిత్తూరుదుర్గంబుఁ ♦ జొచ్చి వారి
వారి యిండ్లకు బిరబిర ♦ వచ్చిచేరి। యంద అసమాన సౌఖ్యంబు ♦ లంది రపుడు. 18.

మ॥ తమవాసంబులఁ జేరుటాదిఁ గడు శ్ర ♦ ద్ధాభక్తు లొప్పారఁ గొ
ల్చి మహీశున్ రణమల్లుఁ గొంద ఱెటులో ♦ చిత్తూరుదుర్గంబు ద్వా
రమహాసీమలఁ గాచు నాభటపద ♦ వ్రాతంబులన్ బొంది ని
త్యముఁ దప్పించుకలేని మార్గమునఁ జే ♦ యన్ జొచ్చి రుద్యోగముల్. 19.

గీ॥ ఇఁకను గొందఱు వేటరుల్ ♦ ముకుళునెడలఁ। బూర్ణభక్తి వహించి ము♦ప్పొద్దు నతని
సరస వర్తించి యంగర♦క్షకు లనంగ। బేరులను బొంది కరము సే♦వించి రపుడు. 20.

మ॥ సతతోత్సాహభరంబు రంజిలఁగ హం ♦ సాదేవి యంతన్ బురో
హితులన్ బిల్చి తదాజ్ఞ నొందుచు ముదం ♦ బేపార లక్ష్మీవ్రతం

బతిదీక్షన్ బొనరించుచున్ దినము పూ ♦ జ్యస్వాంతులౌ భూమిదే
వతలన్ దృప్తులఁజేసె దక్షిణలతో ♦ భక్ష్యాది భోజ్యాళితో. 21.

గీ॥ నాతి విప్రసమారాధ ♦ నముల నెంత। భక్తి జరిపించు, నంతటి ♦ భక్తి, బీద
లందఱను బిల్వనంపుచు ♦ నన్నదాన। మలర జరిపించు వరకృపా ♦ స్వాంతయగుచు. 22.

క॥ దిన మొక గ్రామసమీపం। బున లక్ష్మిని బూజచేసి ♦ భూతావళిఁ దృ
ప్తిని గనఁజేయఁగ నంతటఁ। జనుదెంచె శరత్తు, సకల ♦ జను లలరంగన్. 23.

సీ॥ బృందారకాంగనా ♦ బృందంబు కనుసన్న వర్తింపుచును బరా ♦ బరు లొనర్పఁ
బద్మాలయాసర ♦ స్వతు లిరువంకలఁ దరిచేరి నిలిచి చా ♦ మరములిడఁగ
నంబరాంబరుఁడు ప ♦ శ్యల్లలాటుఁడు కూర్మిదైవార వచ్చి కై ♦ దండయిడఁగ
నలచతుర్దశలోక ♦ ముల భయంబొందించు హర్యక్షరాజ వా ♦ హనము దనరఁ

గీ॥ ప్రకట కారుణ్యరస ముట్టి ♦ పడుచునుండ। ఘనమణిద్వీపముననుండి ♦ కదలి భక్త
జనమనస్సరోజముల వా ♦ సంబుసేయ। వచ్చె జగదంబ, శారద ♦ వాసరముల. 24.

మ॥ పసపున్ గాళ్లకుఁబూసి కుంకుమ తగన్ ♦ ఫాలంబులన్ దిద్ది పు
ష్పసమూహంబిడి సత్ఫలంబులు రహిం ♦ పన్ దక్షిణల్ తమ్ములం
బు సమర్పించుచు శీతశైలతనయా ♦ పుణ్యావతారంబులం
చు సతం బైసువరాంధ్ర హంసయును గొ ♦ ల్చున్ భక్తి రెట్టింపఁగన్. 25.

చ॥ హిమగిరిరాజపుత్రికకు ♦ నెంతయు భక్తిని షోడశోపచా
రము లొనరించుచున్ దినము ♦ రాత్రులయందున మాత్ర మేకభు
క్తి మెసవి రాష్ట్రమందు నలు ♦ దిక్కులఁ బల్లెల నెన్నియో సహ
స్రములగువారి కన్నమిడ ♦ శాసనమున్ బొనరించె నయ్యెడన్. 26.

మ॥ కరమున్ హెచ్చగు దైవభక్తి నితర ♦ గ్రామంబులన్ మేటిజా
తర లింకన్ దిరునాళ్లలన్ జరుపఁ బ్రో ♦ త్సాహంబు గావించి భూ
సురులన్ బీదలఁ దృప్తిచేసి యెపుడున్ ♦ సుశ్లోకయై యుంట నం
దఱు హంసాంగన నన్నపూర్ణ యనుచున్ ♦ ధ్యానించి రుల్లంబులన్. 27.

ఉ॥ ఈవిధి నన్నదానముల ♦ నెంతయుఁ బ్రీతి నొనర్చి రాజపు
త్రావనియందునన్ జనము ♦ లందఱు తన్ బొగడన్ జరించి హం
సావరవర్ణినీమణియు ♦ సద్యశమున్ గడియించుచుండ దీ
పావళి వచ్చె భారతజ ♦ నావళికిన్ గడు సౌఖ్యదాయియై. 28.

ఉ॥ దోమల భంగి దేవతలఁ ♦ దోలిన యానరకాసురేంద్రు స
త్యామహిళాశిరోమణియుఁ ♦ దాఁకి తదూర్జితభూరిగర్వరే
ఖామహిమంబు మాన్ప, నుతి ♦ గాంచిన భవ్యచతుర్దశీదినం
బీమహి నేఁడు వచ్చెనని ♦ యెల్లర యుల్లము లొందె హర్షముల్. 29.

గీ॥ మూఁడునాల్గుదినంబులు ♦ ముందె దూర। మందు వసియించు నల్లుండ్ర ♦ నాఁడుబిడ్డ
లను బిలువనంపి తమబంధు ♦ లను హితులను।జుట్టుగలవారినెల్లఁ బి♦ల్చుకొని రపుడు.30

గీ॥ తొలిదినమె యిండ్లువాకిళు ♦ లలికి పూసి। రంగవల్లులు దీర్చి ద్వా ♦ రములఁ దోర
ణములు నెలకొనఁజేసి స్తం♦భముల నరఁటి। చెట్టులను గట్టి రవ్వేళఁ ♦ జిగురుఁబోండ్లు.31.

గీ॥ కూటిపేదగుడిసె మొదల్ ♦ కొని ధనికుల। హర్మ్యములదాఁకఁ బురిని గృ ♦ హంబులెల్ల
మహిత మంగళదేవతా ♦ మందిరముల। సరణి వెలుఁగొందె సుఖమహో♦త్సాహవశత.

గీ॥ అర్ధరాత్రంబునకుఁ గొంచె ♦ మవల లేచి। యంద అభ్యంజనస్నాన ♦ మాచరించి
యసుర నరకుని దెగడి స ♦ త్యను నుతించి। బాణసంచును గాల్చి ర♦త్రంబు తోఁప. 33.

సీ॥ ఏవీథిఁ గనిన రే ♦ యెండ గాసెడునట్లు పగలువత్తులకాంతి ♦ పరిఢవిల్ల
నేవాడఁ గనుఁగొన్న ♦ నావియద్వీధికి నెగిరిపోయెడు చివ్వ ♦ లింపుగులుక
నేచాయఁగనిన బూ ♦ లైవ్రచినచందాన బిరుసుఁగ్రోవులు కళల్ ♦ చెఱఁగుచుండ
నేకడఁజూచిన ♦ నిందుబింబములట్టులొప్పు చిత్రపుజోతు ♦ లుల్లసిలఁగ

గీ॥ మఱియుఁ గ్రొంగ్రొత్తసరణుల ♦ మెఱయు బాణ। సంచులెల్లెడ నందముల్ ♦ చల్లుచుండ
నీపురం బాపురం బన ♦ నేల! భరత। ఖండమే పట్టపగలట్లు ♦ కళలఁ గులికె. 34.

సీ॥ ఎపుడువచ్చిన దైత్యు ♦ నెదిగి పట్టుదమంచు వేనవేల్ దీపముల్ ♦ పెట్టువార
లెదురరాఁ డవ్వాని ♦ వెదకి పట్టుదమంచుఁ బగలువత్తులుపట్టి ♦ పఱచువారు
గాలిలోనైనను ♦ గలిసియుండు నటంచు బిరుసులు గాల్చి పోఁ ♦ దఱుమువార
లల్లదే యాకస ♦ మందగపడెనంచు నాచువ్వలను గాల్చి ♦ వైచువార

గీ॥ లదిగొ మేడలపైఁదోఁచె ♦ ననుచు ఢమఢ। మారవంబులు గొలుపు చి ♦ త్రాయుధప్ర
యోగములు చేయువారునై ♦ యుర్విజనులు। నరకుఁగడతేర్చు మార్గంబు ♦ లరసిరపుడు.

గీ॥ క్రింద దీపముల్ బిరుసులు ♦ క్రందుకొనియె। నాకసమున నొక్కటఁ జువ్వ ♦ లలముకొనియె
నలఢమారావములు వను ♦ లాక్రమించె। నెట్టు లూపిరిగొను దైత్యుఁ♦డెట్లు నిలుచు!36.

మ॥ అలదేవాసురయుద్ధకాలమున ప ♦ ద్మాక్షుండు సత్యాసతీ
తిలకం బిర్వురెయుండి రియ్యదననో ♦ స్త్రీపూరుషుల్ వేలు ల

క్షులు కోల్పైరి; నిమేషమాత్రమునఁ ద్రుం ♦ చన్ నేర్తు సందేహముల్
వలదంచున్ డెగఁబాఱియుండును భయ ♦ భ్రాంతుల్ దనున్ ముంపఁగన్. 37.

చ॥ నరకసురారి కూలిన ది ♦ నం బది మధ్యమలోకవాసులా
నరులకె కాదు ముజ్జగము ♦ నన్ గలవారికిఁ బండు వంచు ని
ర్జరపతి కాంతులన్ జెరగు ♦ చక్కనిదీపము నెత్తెనో యనన్
మెఱయుచు వేఁగుఁజుక్కయును ♦ మింట వెలింగె మహోదయాద్రిపై. 38.

గీ॥ బాణసంచులకును బ్రతి ♦ ధ్వని విధానఁ। బులుఁగుల కలకలారావ ♦ ములు చెలంగె;
నచటి యాబాలగోపాల ♦ మంద ఱముఖ। సమితివలెఁ బద్మములు విక ♦ సనము నొందె. 39

చ॥ అమలిన రోదసీకుహర ♦ మంతటి ఘాతుకమా తమోమృగం
బు మడియఁజేయఁగా సమయ ♦ పూరుషుఁడున్ వెడలింపఁ గాంతిపూ
రములకుఁ డెంకియై కడు వి ♦ రాజిలు పెద్దపిరంగిగుండనన్
గమలవయస్యబింబము క ♦ నంబడెఁ బూర్వధరాధరంబునన్. 40.

మ॥ జిలుఁగున్నిద్దపుఁ గ్రొత్తవల్వలు ప్రకా ♦ శింపంగ నిండారుమో
ములఁ గస్తూరిని బొట్టువెట్టి మెయి సొ ♦ మ్ముల్ మెండుగాఁదాల్చి యు
జ్జ్వలవేషంబులు సొంపుమీఱఁగను రా ♦ జస్థానదేశంబునం
దలి స్త్రీపూరుషు లొప్పి రప్పుడు రమా ♦ నారాయణప్రాయులై. 41.

క॥ డెందము లలరంగా 'గో। సుందా'పురి హంస సుగుణ ♦ శోభిత యీరే
యిందిరకుఁ బూజ జరిపెడి। నందఱు రండనుచు వార్త ♦ లరుదెంచె వడిన్. 42.

చ॥ వలసిన యన్నివస్తులును ♦ బాడ్లపయిన్ దొలినాఁడె చేరె; బం
ధులును ననుంగుమిత్రులును ♦ దోడనె వెళ్లిరి; రాణిహంస యం
దలమున నెక్కిపోయెను; బ ♦ దంపడి నమ్మకుళుండు సంతసం
బొలయఁగ నశ్వమెక్కిచనె ♦ యోధులు చుట్టును దన్నుఁ గొల్వఁగన్. 43.

గీ॥ హంసబంధులు రణమల్లుఁ ♦ డాదిగాఁగ। నఖిలమార్వారుదేశీయు ♦ లారగించి
యల్లోనేరేడు పండంత ♦ నల్లమందు। మ్రింగి తూఁగుచునుండిరి ♦ మేనుమఱచి. 44.

గీ॥ మూఁడుక్రోసులు గడచి య ♦ మ్మకుళనృపతి। చేరె గోసుంద సుభటులు ♦ చేరి కొలువఁ
దోడ నపరాబ్ధిలోఁ గ్రుంకెఁ ♦ దోడిమయూడి। పడిన గుమ్మడిపండన ♦ భాస్కరుండు. 45.

మ॥ తగ నల్దిక్కుల రోదసిన్ దమము సాం ♦ ద్రంబౌచుఁగప్పంగఁ గ
ష్టగతుల్ గల్గినవేళ ధీరు లతితే ♦ జశ్శాలురౌ రీతిగన్

గగనోద్యానములోని పుష్పములు చు ♦ క్కల్ చొక్కమౌకాంతి హె
చ్చగ రాణింపఁగఁజొచ్చెఁ జూపఱకు ను ♦ త్సాహంబు సంధిల్లఁగన్. 46.

మ॥ స్వరితోదాత్తముఖస్వనంబులను వి ♦ ప్రశ్రేణి మంత్రాళి భ
క్తిరసంబొప్పఁ బఠింప హంసయును ల ♦ క్ష్మీదేవి బింబంబుముం
దఱఁ గూర్చుండియుఁ బూర్ణచిత్తమున శ్ర ♦ ద్ధాభక్తు లొప్పారఁగా
జరిపెన్ సల్లలితోపచారములు పూ ♦ జానిష్ఠ లవ్వేళలో. 47.

మ॥ "కమలోద్యానమునన్ వసించెడి మహా ♦ కాంతాశిరోరత్న మా
కమలద్వేషికిఁ దోడఁబుట్టువు ననం ♦ గస్వామికిన్ దల్లి దు
గ్ధమహాసాగరు పూర్వజన్మఫల మా ♦ కంసారిదేవేరి య
క్కమలాకాంత భజించు వారలకుఁ గ ♦ ల్గన్ నేర్చునే! పాపముల్. 48.

చ॥ ఎవరికృపాకటాక్షమది ♦ యించుకసోఁకిన రోహణాచలం
బు విబుధశైలమున్ సదన ♦ మున్ దగఁజేరినయట్లు భోగభా
గ్యవిభవ మిష్టమైనటులఁ ♦ గల్గెడి; నట్టి నినున్ భజించు భ
క్తవితతి కెట్టిలేములును ♦ గల్గవు సాగరరాజనందనా! 49.

మ॥ సతతంబున్ భవదీయసత్కరుణ రా ♦ జస్థానదేశంబు పౌ
రతతుల్ విశ్రుత పుత్ర పౌత్ర విభవ ♦ భ్రాజిష్ణులౌచున్ దరి
ద్రతయన్ పేరె యెఱుంగకుండ ధనమున్ ♦ ధాన్యంబునున్ జెంది సం
తతహర్షంబుఁ గనంగఁజేయుము జగ ♦ న్మాతా! సరోజాలయా!" 50.

మ॥ అని యామంగళదేవతాపదములం ♦ దత్యంతమౌభక్తి హె
చ్చ నమస్కారము లాచరించుచును బూ ♦ జానిష్ఠ చాలించె నం
గన; పీఠమ్మున నిల్పుచున్ మెరవడిన్ ♦ గావింప నూరెల్ల వి
ప్రనికాయంబుల స్వస్తివాక్యము లెల ♦ ర్పన్ బట్టి కొంపోవుచున్, 51.

క॥ పురి నెల్లెడలన్ ద్రిప్పుచుఁ। బురజనము లొసంగు భక్తి ♦ పూజావిధులన్
నెఱి నర్పించుచు నయ్యెం। దిరఁ గొని చని మొదటిచోట ♦ నిలిపిరి జనులున్. 52

గీ॥ పరిసరగ్రామములనుండి ♦ వచ్చినట్టి। యన్నిజాతుల వారల ♦ కాత్మభక్తి
యలరఁగాఁ బంచభక్ష్యభో ♦ జ్యములతోడ। భోజనమ్ములఁ బెట్టించెఁ ♦ బువ్వఁబోడి. 53.

మ॥ ముకుళుం డశ్వము నెక్కి సద్భటచయం ♦ బుల్ ఖడ్గముల్ పూని మ
చ్చికఁ జుట్టున్ గొలువంగ నంత వెడలెన్ ♦ జిత్తూర్పురిన్ జేరఁ ద్రో

వకు నిర్వంకల నచ్చటచ్చటను దీ ♦ పశ్రేణు లొప్పారె దీ
పకృతాధ్వంబనఁ జూపఁటున్ నయనప ♦ ర్వం బొంది వీక్షింపఁగన్. 54.

మ॥ ఖురసంఘట్టన తాళమానముల ని ♦ గ్గున్ జూపఁ గర్ణంబులున్
గరమున్ నిక్కఁగ మోరలెత్తుకొని చ ♦ క్కన్ ముందుకున్ సాగి సుం
దరమౌ వల్గితధారతోఁ బరచి గం ♦ ధర్వావళుల్ చేరవ
చ్చె రయంబారఁగ నర్థరాత్రమునకున్ ♦ జిత్తూర్పురప్రాంతమున్. 55.

మ॥ యువతిన్ 'బద్మినిఁ' జేకొనన్ మును పలా ♦ యుద్దీను చిత్తూరు నా
హవమందున్ గొన నేగుదెంచి తనసై ♦ న్యంబుండ దుర్గంబుచే
రువ నెత్తించిన మట్టిదిబ్బకడ వా ♦ రున్ జేరి వేవేగ సైం
ధవముల్ డిగ్గుచు దిబ్బ నెక్కిరి వడిన్ ♦ నానాప్రకారమ్ములన్. 56.

శా॥ పాదాగ్రంబులు నేలమోపి మడమల్ ♦ పైకెత్తి దేహంబు నెం
తే దీర్ఘంబుగఁజాచి యుత్తరమునన్ ♦ దృష్టుల్ వడిన్ ద్రిప్పి త
మ్మేదో బాధ కలంచినట్లు ముకుళో ♦ ర్వీశానుయోధాళి చిం
తాదైన్యంబులు మోమునన్ వెలయ వం ♦ తన్ జూచె నాసక్తితో. 57.

చ॥ ఒకరుని దాఁటి యెక్కఁడు మ ♦ హోన్నతభాగముఁ జేరఁజూచువా
రొకని బుజంబుఁ బట్టుకొని ♦ యొండొకదూరము చూడఁబూనువా
రొకరుని పృష్ఠభాగమున ♦ నొయ్యన నెక్కుచు నిక్కిచూచువా
రొకరునిమించి యొక్క రెడ ♦ రొందిరి సంభ్రమసంశయాత్ములై. 58.

మ॥ "జరగెన్ రాత్రి సగంబు; పట్టణము ని ♦ శ్శబ్దంబుగానయ్యె; నం
దఱు నేత్రమ్ముల మోహముద్రనిడె ని ♦ ద్రాదేవి; వాతోద్ధతుల్
పరగన్ బొమ్మినిఁ జెట్లయాకులును శ ♦ బ్దంబీవు; సర్వావనీ
భర మొప్పారఁగ రెండువేల్కనులు మో ♦ డ్పన్ బోలు నాశేషుఁడున్. 59.

గీ॥ కన్నులను జీల్చినను జెంత ♦ నున్నవాఁడు। కనఁబడని యంధతమసంబు ♦ గప్పుకొనియె
నండ నున్నది పులియొ ద ♦ య్యంబొ తెలియ। దకట! కనులుండియును లేని ♦ యట్లయయ్యె.

గీ॥ మల్లెపూఁదోటవలె నున్న ♦ మామనసుల। దైన్యదేవత వసియించి ♦ తలఁగదయ్యె;
నింత యాశాంకురము మొల ♦ కెత్తదయ్యె। నెచట నున్నాఁడొ! తానిట ♦ కేలరాఁడొ!

మ॥ ఎటు తా నాజ్ఞయొసంగె నట్టులనె మే ♦ మీదేశమున్ జేరి స
ద్భటులై కొందఱు మీనృపున్ ముకుళ శ్ర ♦ ద్ధన్ గొల్చుచున్ గొందఱొ

కర్కట దుర్గంబున ద్వారరక్షకులమై ♦ కాపాడుచున్నార మ
కర్కట! మాయందొక దోసమైనఁ గలుగం ♦ గా నేర్చునే యెప్పుడున్! 62.

ఉ॥ తాను వచించి పంపిన వి ♦ ధంబున నీముకుళావనీశ సం
స్థానములోని గ్రామములఁ ♦ దప్పక త్రిప్పితి; ముత్సవంబు లె
న్నేని యొనర్పఁజేసితి; మ ♦ నేకశతంబులు వేలు లక్షలుం
గా నరు లాత్మతృప్తి గనఁ ♦ గా జరపఁబడె నన్నదానమున్. 63.

మ॥ అలదీపావళిరాఁగఁ బందువులు చే ♦ యన్జేసి గోసుందయం
దుల నూరేగఁగఁజేసి యిందిరను, సం ♦ తోషంబునన్గొల్చి తె
ప్పను వాల్పంగనుబోక యిప్పుడు పుర ♦ ప్రాంతంబునన్జేరి త
న్గెలువన్ వేచితి మర్ధరాత్రమున కెం ♦ తో యెక్కుడయ్యెన్ గటా! 64.

చ॥ అరుగుఁడు మీరలంచు మము ♦ నందఱ ముందుగఁ బంచె; మేము నీ
పురమును జేరి తానును మ ♦ మున్ బనిగోరినయట్టిరీతి నే
కొఱయును గల్గకుండ నోడఁ ♦ గూర్చితి మింకను రాఁడు; కార్యమున్
మఱచెనొ! లేకయున్న నను ♦ మానము లేదిటు తామసించునే. 65.

చ॥ జరపిన మాటలన్ వెలితి ♦ సందుకొనంగనుబోనిరీతి ని
ష్ఠురతరదీక్షతో నడపు ♦ శూరశిఖామణులందు నగ్రత
స్సరుఁడని పేరుగాంచి యొక ♦ చానకొసంగిన మాట బూదిలోఁ
బరపి మనంబునన్ మఱచు ♦ వాఁడె! యఘుంబగు నట్లు పల్కినన్. 66.

చ॥ మఱచుట లేనిమాట; తన ♦ మాటను జ్ఞప్తి వహించియుండు టే
స్థిరమగు; నీదినం బిచటఁ ♦ జేరక తప్పఁడు; కాని రాత్రియున్
జరగె సగానకెక్కుడుగ; ♦ స్వామియు నింతకు వచ్చియుండినన్
నెఱియగు; రాని హేతువు గ ♦ ణింపఁగఁజాల మొకింత యేనియున్. 67.

మ॥ అరు లేరేనియుఁ దాఁకి రేమొ యనుచున్ ♦ స్వాంతంబునం దెంచ న
య్యరిసందోహముఁ జూచినన్ బ్రళయకా ♦ లాభీల దుర్వార భా
స్కరపుత్రాకృతిఁదాల్చి తత్క్షణమ బ్ర ♦ క్కల్ బ్రక్కలున్ జేయు శౌ
ర్యరసావేశున కడ్డుగల్గెడునె! దై ♦ త్యాదిత్యు లేతెంచినన్. 68.

మ॥ గురుభీతిప్రదమై రహించెడు మహా ♦ గోత్రాచలేంద్రంబు గ
హ్వారమందుండి వడిన్ బయల్వెడలు నా ♦ హర్యక్షరాజంబు ముం

దఱిఁ గొండంతటి యేన్గులైనఁ ద్రుటిమై ♦ నన్ నిల్వఁగా నేర్చునే?
యరికోట్లున్ గిరికోట్లు నిల్పెడునె యా ♦ హార్యక్షశౌర్యోజ్జ్వలున్. 69.

మ॥ నిమిషంబైనన్ దను వీడినన్ సుఖులమై ♦ నిల్వంగలేమంచుఁ జి
త్తమునం దెంచఁడో! యాదినుండియును భృ ♦ త్యత్వంబునన్ బెంచు భ
క్తిమహత్త్వం బెఱుఁగండొ! తన్ను విడు నా ♦ దేవేంద్రభోగంబు తు
చ్ఛముగా నెంతుమటం చెఱుఁగఁడో! యెటుల్ ♦ సైరింతు మీవేదనల్! 70.

మ॥ 'అలదీపావళినాఁటిరే యిటకు నె ♦ య్యన్ వత్తు నిన్గెల్వఁగా
వలనొఁ గ్రమ్మఱ' నన్న యాసలవి మా ♦ ప్రాణమ్ములన్ నిల్పె నీ
నెల రెన్నెల్లుగ; నట్టియాస లకటా! ♦ నిక్కంబుగాఁ జెడ్డచో
నిలువన్ లేవు నిమేషమాత్రమయినన్ ♦ జీవంబు లీమేనులన్. 71.

గీ॥ సందెప్రొద్దునఁ గదలి గో ♦ సుఁడఁ జేరి। శ్రీసతిని గొల్చి యద్దమ ♦ రేయి యిటకు
వచ్చె ముకుళుఁ డేమెఱుఁగని ♦ బాలుఁడితఁడు। తేజిపై వ్రాలి యిపుడు ని♦ద్రింపఁదొడఁగె.

మ॥ అరి యీతండు సఖుం డితండనుచు భే ♦ దాలోకనం బింతయున్
బరగన్ బోవని ముగ్ధుఁడన్ వయసు స్వ ♦ ల్పం బేఁడు లేడయ్యె; నీ
చిఱుతన్ నెత్తినఁ బెట్టుకొంచు మఱి యీ ♦ చిత్తూరియం దద్దరా
తిరి నీరీతిగ వంతలన్ బడుచుఁ జిం ♦ తింపంగ నయ్యెన్ గటా! 73.

మ॥ మదితో మాటలతో శరీరములతో ♦ మాస్వామియం చేము న
మ్మ దయావారిధి మాయధీశుఁడు రయం ♦ బున్ మీఱ వేంచేసినన్
మదు లుప్పొంగి బుజంబు లింతయగు; నా ♦ మాన్యుండు రాకున్న నా
త్రిదివంబైన లవంబు సౌఖ్యమును సం ♦ ధింపంగ లే దియ్యెడన్. 74.

మ॥ కను లల్లార్పక యట్టె చూచుచుఁ దదే ♦ కధ్యానమున్ బూనియుం
ట నిమేషంబులు సాఁగి లో బలిసి గం ♦ టల్ యామముల్ ఘస్రముల్
గను మాసంబులు వత్సరంబులు పయిన్ ♦ గల్పంబులై తోఁచి మా
మనసుల్ పట్టి దహించు; నెట్టులు త్రియా ♦ మన్ దాటఁగా నేర్తుమో!" 75.

మ॥ అని యొక్కించుకసేపు కస్తిపడి "క ♦ ట్టా! యామహాభాగుఁ డెం
దనుకన్ రాఁడొకొ! యేమి సేతు మెటులై ♦ నన్ జీఁకటుల్ విచ్చుదాఁ
కను నెందొక్కెడ కేగనేల! యెటులో ♦ కాలంబు చెల్లింత మీ
డనె! సూర్యోదయమైన నాప్రభుని గూ ♦ డన్ బోద మెందుండినన్." 76.

మ॥ అని చిత్తంబులు గట్టిచేసికొని యో ♦ ధాగ్రేసరుల్ దిబ్బపై
నని కూర్చుండిరి నిస్పృహన్ దవిలి మా ♦ నంబూని; నిశ్శబ్దతన్
గనియుండెన్ జగమెల్లఁ, జీమ చిటుక ♦ న్నన్ బెద్ద కొండంతయై
ధ్వనిగాఁ దోఁచియుండు నెల్లఱకు శ్రో ♦ త్రశ్రేణి చిల్లుల్ పడన్. 77.

మ॥ తొలుతన్ ద్రాడును నీడ్చు నాసరసరల్ ♦ తోపించి, యావెన్క నా
కులు రాల్ మర్మరమొప్పఁజేసి, చినుకుల్ ♦ గుప్పించినట్లుండి, య
వ్వల నెంతే వడగండ్లచప్పుడులు తోఁ ♦ పన్ జేసి, దూరమ్మునన్
గలిగెన్ బ్రోన్నత మాంసలాశ్వ ఖుర సం ♦ ఘర్షాతివేలధ్వనుల్. 78.

మ॥ “అదెవచ్చెన్ జవనాశ్వభూరిఖురతీ ♦ వ్రారావసంరంభ మ
ల్లదె తద్ఘర్షణమాత్ర భూమి యఖిలం ♦ బాకంపితంబయ్యెఁ బై
నదె దూరంబునఁ జెట్లత్రోవ నొకయో ♦ ధాగ్రేసరుం డీపురిన్
గదియన్ వచ్చెడి దీపపున్ వెలుఁగునన్ ♦ గంద్రో! హితగ్రామణుల్.” 79

మ॥ అని వారొండొరుఁ బిల్చి చూపఁగను వీ ♦ క్షాసక్తులై ఱెప్పవే
యని సంఫుల్లవిశాలనేత్రములతో ♦ నామార్గమున్ జూచుచున్
“మనదేవుం డగునొక్కొ!”యంచు ననుమా ♦ నంబొంది యోజించి ని
ల్చిన నవ్వారల యోధుఁడొక్కరుఁడు డా ♦ సెన్ సైంధవారూఢుఁడై. 80.

ఉ॥ మాసినయట్టి గుడ్డ లస ♦ మానఘనాయుధముల్ ధరించి న
వ్యాసమశౌర్యధాటిని భ ♦ టావళి యుండెడి మట్టిదిబ్బనున్
డాసిన వీరయోధుఁడు త ♦ టాలున నశ్వమునుండి డిగ్గుచున్
జేసె నమస్క్రియారతులు ♦ చెచ్చెఱ నమ్మకుళాధిభర్తకున్. 81.

క॥ చేరువకు వచ్చి ముకుళోర్వీరమణున కెరగినట్టి ♦ వీరుని భటులున్
జేరి గుమిగూడుచు నమస్కారము లొనరించి రపుడు ♦ కడుభక్తిమెయిన్. 82.

మ॥ “అకటా! జీవములేని బొంది మఱలన్ ♦ బ్రాణంబులన్ జెందు నా
రకమాఁగాదె! భవద్వియోగమున ధై ♦ ర్యంబేది నిర్విణ్ణులై
మొకముల్ వాల్చుచు నాసలున్ వదలు మే ♦ మున్ గ్రమ్మఱన్ నేఁడు నా
యకచూడామణి! నిన్నుఁ గన్గొనుట, ధ ♦ న్యంబయ్యె మాజన్మముల్. 83.

ఉ॥ ‘నావచనమ్మునన్ జనుఁడు ♦ నమ్మక మచ్చటి కేగుడెంతు దీ
పావళినాఁటి రాతిరి’ క ♦ టంచు వచించుచు మమ్ముఁ బంపి నేఁ

డీవిధి నీవునున్ మసల ♦ నేల! నిమేషము నిన్నుఁ బాసి మా
జీవములుండఁజాలవని ♦ చిత్తమునం దెఱుఁగంగఁ జాలవే! 84.

సీ॥ అర్ధరాత్రంబు దాటిన ♦ దాది నిమిష। మొక్కఁడొక్కఁడు కనుపించె ♦ యుగమునట్లు;
సంశయాందోళనముల వ♦శమున హృదయ। మెటు వడిఁ జలించెనో దేవ!♦ యెఱుఁగఁగలవె!

చ॥ త్రిభువనపావనంబయిన ♦ దేవర పాదయుగంబుఁ గాంచు భా
గ్యభర మదెప్పు డెప్పుడని ♦ కన్నులు గాయలు గాఁచె; నిన్ననా
ళ్లభము శుభంబునున్ దెలియ ♦ దక్కట! పైఁ దడవయ్యె; నేఁడు లో
కభరణయోగ్యుఁడైన నినుఁ ♦ గాంచుట యిప్డు దివంబు నేలుటల్. 86.

గీ॥ అనఘ! మాపాలిదేవుఁడ ♦ వైన నిన్నుఁ। జూచుటను మాకుఁ బ్రాణముల్ ♦ లేచివచ్చె;
నాజ్ఞ యిడవయ్య! యగ్నిలో ♦ నరుగఁగలము; భయద వాసుకినైనఁ జే ♦ పట్టఁగలము."

మ॥ అని ప్రాణంబుల నైన నీయ వెనుదీ ♦ యన్ బోని యోధాళి భ
క్తి నమస్కారయుతంబుగా నుడున నా ♦ ధీరుండు తానంతఁ బ
ల్కెను "మీమంచిమన స్సెఱుంగుదును; గ ♦ ల్గెన్ మోదముల్; స్వామిభ
క్తిని బోషించెడువార లేరికిని శ్లా ♦ ఘింపంగ యోగ్యుల్ గదా! 88.

చ॥ తడవది యైన దయ్యె నికఁ ♦ దప్పక కార్యముఁ జూడఁబోలు; మీ
రెడపక నశ్వరాజముల ♦ నెక్కుఁడటం"చని హెచ్చరింపఁగా
వడివడి వారలందఱును ♦ వార్వము లెక్కినఁ "గార్య మిచ్చటన్
నడిచెనె? చెప్పినట్టు"లని ♦ నాయకుఁ డాడినఁ దద్భటావళుల్, 89.

మ॥ "అనఘా! యాజ్ఞ శిరంబునన్ దిడుచుఁ గా ♦ ర్యంబున్ జయశ్రీకమై
తనరన్ జేసితి మంతయున్ సుముఖమై ♦ దైవారె నిందాక; నే
యనుమానంబును లేదు; నీవలసిన ♦ ట్లొందందు ద్వారంబులం
డున నీవారలె చేరినారు; కొఱయెం ♦ దున్ లేదు మన్నింపవే." 90.

మ॥ అన, నానాయకరత్నమున్ సరియటం ♦ చశ్వంబు నంతన్ గద
ల్చినఁ దోడ్తో ముకుళుండు దా ననుగమిం ♦ చెన్ దద్భటుల్ వానివెం
టనె పోఁజొచ్చిరి, శీఘ్రమహానియతయా ♦ నశ్రీలతో; నీగతిన్
జని రయ్యందఱు చెంత దుర్గము ప్రథా ♦ నద్వారమున్ జేరఁగన్. 91.

సీ॥ సమున్నమై విశాలమహా ♦ శైలకంఠమున వైభవముల్లసిలఁ గట్టఁ ♦ బడినదాని
నాకాశమధ్యంబు ♦ నంటఁగాఁ బెరుగు గోపురరాజముల నొప్పు ♦ మెఱయుదాని

గుబ్బలు నిప్పరే ♦ కులు దాపియుండి దార్ఢ్యముగల్గు గొప్పద్వా ♦ రములదానిఁ
బైనను గ్రింద ది ♦ వ్యజ్యోతిబృందంబు పగలట్లు వెలుగఁగ ♦ వఱలుదానిఁ
గీ॥ జెక్కువేలమందు ♦ విచ్చుకత్తులభటు। లండనుండి కాచి ♦ యుండుదాని
నాత్మనలరఁజేయు ♦ నా'రవిద్వార' ము। ఖంబు వారలెల్లఁ ♦ గాంచిరపుడు. 92.

మ॥ అమరాధీశ్వరు వైజయంతవితత ♦ ద్వారంబునున్ గేరు సూ
ర్యమహాద్వారముఁ జూచినంత మదిలో ♦ నావేశముప్పొంగ వి
క్రమధుర్యుండు భటాగ్రగామియు నమ ♦ స్కారంబు గావించి ద్వా
రమునన్ దగ్గరి కాచియున్న సుభట ♦ వ్రాతంబు నిర్వంకలన్. 93.

మ॥ కని, లోనన్ జొరఁబూన రక్షకభటుల్ ♦ గన్గొంచు ద్వారంబు చెం
తనె యడ్డంబుగ నిల్చి "యిందఱును లో ♦ నన్ జేరఁగా నీయ మిం
దె నిలుం డద్దమరేయి వచ్చితి రహా! ♦ దేవుం డెఱుంగున్ బురం
బునకున్ మిమ్మును బోవనిచ్చినను మ ♦ మ్మున్ జెందు నాకష్టముల్. 94.

మ॥ చను నుద్యోగము మిమ్మువీడిన నిమే ♦ షంబందు మాకం"చుఁ బ
ల్కిన "గోసుందరు నుత్సవంబులను వీ ♦ క్షింపంగ రే యేమునున్
జనఁగా నీముకుళేంద్రుఁ దోడ్కొనుచు హం ♦ సాదేవి పొమ్మంచు నా
జ్ఞను పాలించిన వచ్చినారము ధరే ♦ శానున్ దగన్ గొల్చుచున్. 95.

మ॥ జననాథున్ గృహమందు డించి మఱి స్వ ♦ స్థానమ్ములన్ వేగఁ జే
రనె కాంక్షింతుము కాని యిచ్చటను గా ♦ ర్యం బేదియున్ గాన మీ
డ నిమేషంబొకఁడుండుఁడీ! యనిన నుం ♦ డన్ బోవ మీవేళ; మ
మ్మును బోనిండు పురంబులోనికి భయం ♦ బున్ జెంద మీకేటికిన్! 96.

చ॥ కరమును నమ్మి యమ్ముకుళుఁ ♦ గాచి చరించెడు వారమయ్య! త
స్కరులము గాము; వైరులము ♦ గాము; ముఖాముఖి వచ్చినార; మే
కరణినిగాని దోసములు ♦ గల్గవు మాయెడ; శంక యింకనున్
బరగిన మీరె భూవిభునిఁ ♦ బట్టణమందునఁ జేర్చి రండొగిన్. 97.

క॥ పురరక్ష మీరొనర్తురు। పురికన్నను విలువఁగలుగు ♦ భూవిభురక్షా
స్ఫురణమున మేము మెలఁగెద। మిరుదెగలం దెక్కుడెదియొ ♦ యెఱుఁగు జగంబుల్. 98

క॥ ఐనను మీతోవాదం। బూనుట పనిగాదు మాకు ♦ నుర్వీశుఁ బురిన్
బోనిండు చాలు; మాపలు। కే నెగ్గింపంగఁ గోర ♦ మేమెయ్యెడలన్. 99.

చ॥ జనపతి యిల్లు చేరె నను ♦ సంగతి మీరలు వచ్చి తెల్పినన్
విని చని రాణి హంసఁగని ♦ విన్నపమున్ బొనరించువార మొ
య్యనఁ బనిసాగనిం”డనిన ♦ నావచనమ్ములు ద్వారరక్షకుల్
మనమునఁ జింతచేసి నృప ♦ మండను గాంచి భటాగ్రగామితో, 100.

ఉ॥ “ఎందుల కంతమాట! ముకు ♦ ళేశ్వరుఁ జూచినమీఁద శంకలన్
జెందఁగఁ బాడి యౌనె! యిటఁ ♦ జెప్పిన మాటలయం దసత్య మే
సందున లేదు; సర్వమును ♦ సత్యము! మీరన మేమనంగ నీ
యందఱ మామహాప్రభు ప ♦ దాబ్జముఁ గొల్చెడు వారమే కదా! 101.

మ॥ ఎవరో వీరలు క్రొత్తవార లని మే ♦ మిందాక శంకించి మి
మ్ము విడన్జాలక యుంటి; మిప్పు డఖిలం ♦ బున్ వింటి; మీద్వారమం
దు వసింపన్ జను మాకుఁ; బట్టణమునం ♦ దున్ బోవఁగా రాదు; మీ
రవనీశున్ గొని పొందు; లే విచట నే ♦ యాటంకముల్ మీ కికన్. 102.

మ॥ నెరసుల్ గల్గిన బుద్ధిలో నిడక మ ♦ న్నింపన్ దగున్” నావుడున్,
“సరి! యుద్యోగము లెవ్వ రిట్టులుగదా ♦ సల్పంగ బోలున్; క్షితీ
శ్వరు నైనన్ గనఁ బోక ధర్మమునె దై ♦ వం బంచు సేవించుచుం
టిరి; మీవృత్తికి నుత్సవం బొదవె మా ♦ డెందంబులం దెంతయున్” 103.

మ॥ అని యోధాగ్రణి యొప్పఁ బల్కి యపుడా ♦ ద్వారంబునున్ దాటిపో
యిన, నామీఁదటి ద్వారమున్ గొలుచు వా ♦ రీరీతినే నిల్వ, వా
రిని బైరీతిని నుత్తరం బొసఁగి సం ♦ తృప్తాత్ములన్ జేసి, వే
డ్కను దద్ద్వారము దాఁటి మూఁడవ కవా ♦ టంబున్ జొరన్ బోయినన్, 104.

ఉ॥ ద్వారముఁ గాచు సద్భటులు ♦ వారినిఁ బూర్వమురీతి నిల్పఁగా
వారు సదుత్తరం బొసఁగి, ♦ వారలఁ దృప్తులఁ జేసి, పైనియా
ద్వారము చేరఁగా నరుగ, ♦ నచ్చటివారలు నట్లె నిల్పినన్
వారల సమ్మతిన్ బడసి ♦ ద్వారము లన్నియు నిట్లు దాఁటుచున్, 105.

మ॥ మనయోధుల్, మఱి వారి నాయకుఁడు ‘రా ♦ మద్వార’మన్ పేరు నొం
దిన యాలోపలి గుమ్మమున్ దరిసి, దా ♦ నిన్ దాఁట యత్నించినం
తనె, యచ్చోట ‘జసల్మియర్’నృపతియున్ ♦ దత్సేవకుల్ వారలన్
గని కాఠిన్య మెలర్ప నిల్పిరి చొరం ♦ గానీక వారించుచున్. 106.

చ॥ తొలుతటి ద్వారరక్షకుల ♦ తో వచియించినయట్టు లుత్తరం
బులు వచియించి దాటుకొని ♦ పోవఁగడంగినఁ "గాదు కూడ దిం
దుల నిలువుండు; భూవరునిఁ ♦ దోడ్కొని యిందఱు పోవ నేటి; కే
నలువురొ కూడి వెంటఁ జని ♦ నన్ గృహమందునఁ జేరఁ జాలఁడో! 107.

చ॥ గగనమునందుఁ జుక్కల ప్ర ♦ కారమునన్ బురి నెల్లదీపముల్
దగదగ వెల్గుచుండె; వసు ♦ ధాపతి సౌధముఁ జేర నేర్చుఁ జ
ల్లఁగ; నటు కాదయేని పది ♦ లంబుగ మే మిదె వెంటఁబోయి చే
ర్పఁ గలము; మీరలున్ మరలి ♦ వచ్చిన త్రోవను బట్టి పోవుఁడీ! 108.

చ॥ అనుచు జసల్మియర్ నృపతి ♦ యడ్డము నిల్చి వచించు మాటలన్
వినుచు భటాగ్రగామియును ♦ "వింతగ నున్నవి నీవచోగతుల్!
మనుకులనాథుఁ డొంటరిగ ♦ మందిరసీమకుఁ బోవునంటె! వే
పని కిఁక మీరు మేము మఱి ♦ ప్రాణములన్ భరియించి యుండుటల్! 109.

చ॥ నరవరుఁ డింటి కొంటిఁ జని ♦ నన్ జగముల్ పయివచ్చి దూఁకి దె
ప్పర మగు హాని చేయు నని ♦ పర్వదు భీతి యొకింత; రాణి 'మీ
రరుగుఁడు పుత్రు వెంట' నన, ♦ నద్దమ రే యిటు వచ్చినార మీ
ధరణిపుఁ గూడి; యాతని ప ♦ దంబులు గొల్వఁగఁ దప్పు గల్గునే! 110.

మ॥ మది నేదేనియు ద్రోహమున్న యెడ నీ ♦ మాడ్కిన్ మిమున్ డాసి యి
య్యదనన్ వాదము పెంచుచుండుదుమె! మా ♦ యం దెట్టి లోపంబు గ
ల్గదు; మ మ్మాఱక పోవనిండు; ముకుళ ♦ క్ష్మానాథుఁ దోడ్కొంచుఁ ద
త్సదనంబందున డించి వత్తుము నిమే ♦ షంబందు మీయొద్దకున్. 111.

చ॥ తెలతెలవాఱఁ జొచ్చెడి! మ ♦ దిన్ మఱి మీ కనుమాన మేల! యీ
వెలిఁగెడు నిన్ని దీపములు ♦ వేలకు వేలుగ వీరయోధులున్
నిలిచియు భీతియేల! యవ ♦ నీపతి వెంటను నూఱుమంది మే
కల మిఁక ద్రోహ మున్న క్షణ ♦ కాలమునన్ మముఁ గూల్పకుందురే! 112.

క॥ అనుమానము గలవారలు। ముని నైనను ముచ్చ టంద్రు; బుద్ధి నరయ మీ
పనిగూడ నున్న దట్టుల"। ననిన జసల్మియరునృపతి ♦ యంతయు వినుచున్, 113

చ॥ "సరిసరి మంచి దయ్యె! మిముఁ ♦ జక్కఁగ నిందఱఁ జూచి చూచియున్
బురమున కంపి కీడెదియొ ♦ పుట్టినఁ బిమ్మట నంగలార్చినన్

శిరములు పోక నిల్చెడునె! ♦ చెప్పెదఁ గల్గినమాట; మూరెడున్
బరవఁగ నేల, యిప్డవల ♦ బారెడు క్రుంగఁగ నేల మాకిఁకన్! 114.

ఉ॥ మీ రొక కోటి చెప్పినను ♦ మిమ్మిపు డెట్లును రాజసౌధమున్
జేరఁగఁ బంపఁ జాల; మిది ♦ నిక్కము; మీ రుదయంబుదాఁక నీ
ద్వారముచెంత నిల్చి జన ♦ పాలుఁడు సద్మముఁ జేరు వార్తలన్
గోరినయట్లు రాణికడ ♦ కున్ గొనిపోందు ప్రభాతవేళలన్. 115.

ఉ॥ భూమిపుఁగాక సన్న దొక ♦ పుర్వును సైతము లోనికిన్ విడన్
బో; మిది నిక్క; మిప్డయిన ♦ మూర్ఖత మాని తొలంగి పొండు; హం
సామహిళాశిరోమణియె ♦ చక్క స్వయంబుగ వచ్చెనేని యిం
దే మసలంగఁ బోలు! నిట ♦ నిల్పెదు మరుక్కఁడు పుట్టు నంతకున్". 116.

చ॥ అన విని యోధనాయకుఁ"డ ♦ హో యిటు మాటలతోఁ బనేమి! పో
వను సెలవిత్తువో యిడవొ ♦ పల్కుము చక్కఁగఁ జింతచేసి నీ"
వనఁగ, జసల్మియర్ నృపతి ♦ "ప్రార్థన లన్నియు మాని యానతుల్
గను వెడలంగ సాగెడి; భళా! ♦ నిను మెచ్చఁగవచ్చు నెంతయున్. 117.

ఉ॥ ముప్పదిమూఁడుకోట్లు సుర ♦ ముఖ్యులు గుంపులు గూడి వచ్చి రే
నిప్పుడు ద్వారమున్ గడచి ♦ యేగఁగ నీయ నెకింతయేని; నేఁ
జెప్పెడు గట్టిమాట యిది; ♦ చేకొని నిల్చిన మేలు; లేనిచోఁ
దప్పదు మీకుఁ బ్రాణములు ♦ తప్పుట మత్కరవాలధారలన్." 118.

మ॥ అని యెంతేనియు నిశ్చయం బలరఁగా ♦ నాతండు పల్కంగ, యో
ధనికాయంబుల నెక్కమాఱు గని యో ♦ ధస్వామి యత్యంతకాం
తిని బైఁజల్లెడు ఖడ్గమున్ బెటికి యు ♦ ద్రేకంబునన్ సింహగ
ర్జనమున్ జేసి జసల్మియర్ప్రభుని జే ♦ రంగా వడిన్ బోయినన్, 119.

క॥ అకలంకశ్రద్ధాళులు। ముకుళేంద్రుని హయము నెక్క ♦ మూలకుఁ గొనిపో
యి కనున్ దెప్ప విధమ్మున। నొక కొందఱు భటులు గాచి ♦ యుండిరి భక్తిన్. 120.

శా॥ చండారాతికులాటవీదహనుఁడై ♦ సంగ్రామమున్ జేయ ను
ద్దండస్ఫూర్తి వెలుంగు నాప్రళయమా ♦ ర్తాండప్రభారాశియై
చండుం డిప్పుడు వచ్చె! నెల్లభటులున్ ♦ సంతోష మేపారఁగా
"రండో! యీతనిఁ గొల్చి వీరరణయా ♦ త్రన్ నేఁడు సాగింపఁగన్. 121.

మ॥ "చనఁగా నీకుఁడు! వేళ మంచి దిపుడీ ♦ చండేశ్వరుఁ గొల్వఁగా"
నని యోధాళులు వేగ పల్క నల వా ♦ క్యశ్రేణు లాలించి బో
రన ద్వారంబులు గాచియుండెడు భట ♦ వ్రాతంబు: చండేశుఁ గొ
ల్వను గాంక్షించుచు వచ్చి దూఁకెను ద్రుటిఁ ♦ వందల్ సహస్రంబులుఁ. 122.

మ॥ పొలముఁ జేరుచు రాత్రివేళలను గుం ♦ పుల్ గూడి నిద్రించు గో
త్రాల మధ్యంబున బిట్టు రేఁగుచు వృక ♦ శ్రేష్ఠంబు లంఘించు జా
డల దుర్దాంత దగద్ధగల్ గురియు ఖ ♦ డ్గం బూని యాద్వారమం
దలి సైన్యంబులు దిక్కులన్ జెదరఁ జం ♦ డస్వామి ముందేఁగినన్, 123.

మ॥ కని యాలోన జసల్మియర్ నృపతి ఖ ♦ డ్గం బట్టె పై కెత్తి బో
రన విద్యుల్లతచంద మై యెగసి ధై ♦ ర్యస్థైర్యముల్ మీఱఁ బై
న నిమేషంబున వ్రాలి చండుని బ్రచం ♦ డస్ఫూర్తితోఁ దాఁకె! నా
తని యశ్వంబున కొక్కకాలు విఱిగెన్ ♦ దత్ఖడ్గధారాహతిన్. 124.

చ॥ ధర నెరగంగ నుండియుఁ బ ♦ దంపడి తెప్పిఱి చండుఁడున్ భయం
కర లయకాలరుద్రుఁడటు ♦ క్రన్ననఁ గ్రిందికి డిగ్గి నిల్చి భా
స్వరతరశౌర్య మొప్పఁగ జ ♦ సల్మియరీశునిఁ దాఁకె: నప్పుడా
యిరుదెగలందునున్న భటు ♦ లెల్లరు యుద్ధము మాని చూడఁగన్. 125.

క॥ అతఁ డితని సరకుసేయక,। యితఁ డతనిని లెక్కసేయ ♦ కిటు లొక్కొకరున్:
ధృతిశౌర్యంబులఁ దఱుఁగక। యతిసాహస వృత్తిఁ బోరి ♦ రందఱు మెచ్చన్. 126

మ॥ అతిగాంభీర్యవిలాసభాసురమహా ♦ హర్యక్షయుగ్మంబొ, ప్రో
ద్ధతకల్లోలరటద్భయానకసము ♦ ద్రద్వంద్వమో, విస్తృతిన్
ధృతి ద్రుష్టాంతముగాఁగ నిల్చు ఘనధా ♦ త్రీధ్రద్వయంబో యనన్
బ్రతిలేకుండ నొనర్చి రిర్వురును సం ♦ గ్రామంబు భీమంబుగన్. 127.

చ॥ ఎఱుఁగమె! యొదతేని రణ ♦ మీయఁగ వచ్చిన యోధులన్ ద్రుటిన్
మరణము నొందఁజేయు బల ♦ మాన్యుఁడు మత్పతి! యింతదాఁక నీ
యరి నిటు నిల్పెఁ! జోద్య మిది! ♦ యం చిరువాగుల నున్న యాభటో
త్కరములు వానినాయకుల ♦ ధాటికి శంక వహించె నత్తఱిన్. 128.

చ॥ హరిసమశౌర్యశోభితుఁ డు ♦ దారుఁడు చండుఁడు ఖడ్గధారలఁ
గురిసి రణంబు సేయ నడ ♦ గొండయుఁ బోలె జసల్మియర్ ప్రభుం

డరుదుగ గేడెముల్ నిలిపి ♦ యన్నిఁటి వమ్ముగఁ జేసె, వర్షముల్
పరగిన నట్టె నిల్చు వృష ♦ భప్రభుచందముఁ బూని నిల్చుచున్. 129.

మ॥ నిను మెచ్చంగను వచ్చుఁ బో బలమునన్ ♦ వీర్యమ్మునం దంచుఁ బ్ర
న్ననఁ జండుండును మండలాగ్రమును బై ♦ నన్ ద్రిప్పి తద్వైరి నే
సిన వాఁడున్ గడుసొమ్మసిల్లి యడ లే ♦ చెన్ దోఁకనున్ ద్రొక్కు శే
షుని చందంబున నిప్పులట్లు కనులున్ ♦ శోభిల్ల శోణద్యుతిన్. 130.

మ॥ కరవాలంబును ద్రిప్పుకొంచుఁ దనువున్ ♦ గాపాడుకొంచున్ బలో
ద్ధురుఁడై ముందుకు వచ్చి చండుని దగన్ ♦ దోరంబుగా మండలా
గ్రరుచుల్ మీఱ బిరానఁ దాఁక నతఁడున్ ♦ రౌద్రప్రభారాశియై
విఱిచెన్ శత్రుని ఖడ్గరాజమును బృ ♦ థ్విన్ వ్రక్కలై రాలఁగన్. 131.

మ॥ 'సముఁడై పోరఁగఁ జొచ్చె వీని నిఁక ద్రుం ♦ చన్ గష్టమా'నంచు నొ
క్క మహాఖడ్గము గ్రమ్మఱన్ గొనుచు నా ♦ కాలాంతకుం డంచు సై
న్యము వీక్షింప జనల్ మియర్ ప్రభుఁ డుద ♦ గ్రాకారుఁడై చండు శీ
ర్షము వంకన్ బయికెత్తి వ్రేయఁ గడు సం ♦ రంభంబుతో డాయఁగన్, 132.

చ॥ 'పడెఁబడెఁ జండుఁ డం'చు భట ♦ వర్గము లార్వ జనల్ మియర్ ప్రభుం
డుడుగక ముందు వచ్చుచు మ ♦ హోద్ధతిఁ జండు శిరంబు వ్రేయ డీ
ల్పడక యతండునున్ మెఱుపు ♦ భంగిని బ్రక్కకు జాఱ ఖడ్గ మ
ప్పుడు భుజమందునన్ దగిలె ♦ బోరనఁ గండలు నెత్తు రొల్కఁగన్. 133

శా॥ చండుం డంతట బిట్టు మండి తనహ ♦ స్తంబందు నయ్యాదిశే
షుండున్ బోలె వెలుంగు ఖడ్గమును గొం ♦ చున్ దక్షిణంబే మహో
ద్దండస్ఫూర్తి జనల్ మియర్ ప్రభుని మ ♦ స్తంబున్ దెగన్ వ్రేయఁ నా
తండున్ శృంగము త్రుంగు పర్వత మటుల్ ♦ ధాత్రిన్ బడెన్ గ్రక్కునన్. 134.

మ॥ తమనాథుం డటు కూలినంత భటసం ♦ తానంబు లావంత దై
న్యమునున్ జెందక మొక్కవోని పటుద ♦ ర్పం బొప్ప గుం పొచు వే
గమ చండున్ నలుదిక్కులన్ బొదివి తాఁ ♦ కన్ జొచ్చి; రాతండు దు
ర్దమశౌర్యోద్ధతి వారిపైఁ గవిసె హ ♦ ర్యక్షుంబు చందంబునన్. 135.

ఉ॥ ద్వారములందు నున్న భటు ♦ లందు జనల్ మియరీశు నెప్పుడున్
గూరిమి పేర్మియున్ వెలయఁ ♦ గొల్చెడు వారును, వారుగాక మా

ర్వారుననుండి యచ్చటికి ♦ వచ్చిన వారును మాత్ర మొక్కఁడై
పోరను దారసిల్లఁపనిఁ ♦ బూనిరి చండునితోడ నత్తఱిన్. 136.

చ॥ మిగిలినవారు చండవిభు ♦ మిక్కిలి కొల్చిన వేటకాండ్రతో
డఁ గలిసి వచ్చి యాతని క ♦ డన్ దగ నిల్చి "రణంబు చేయఁగా
నగుఁ! బనిసాగనిండు! పదు ♦ డం"చును, "బట్టుఁడు కొట్టుఁ డాలసిం
పగఁ దగ"దంచుఁ బల్కుచును ♦ వైరులఁ దాఁకఁగ నుత్సహించిరన్, 137.

చ॥ ఇరుదెగలందు నున్న భటు ♦ లెల్ల నొకింతయుఁ దీసిపోక సం
గర మొనరింపఁ బూనినను ♦ గ్గలెను ఘోర రణంబు; కోప వి
స్ఫురణ భటాళిఁ దాఁకి తల ♦ పుచ్చెలు కొబ్బెరకాయలట్లుగా
ధరపయి రాల్చెఁ జండుఁ డహీ ♦ తత్రపతతుల్ కడు భీతి నొందఁగన్. 138.

చ॥ పరసమవర్తి చండుఁ డహీ ♦ వర్యకుటుంబములోన నుగ్రుఁడై
గరుడుఁడు దూఁకుమాడ్కిఁ ద్రిజ ♦ గన్నుతశౌర్యముతోడ దూఁకి చి
చ్చుఱపిడుగై మహాభయద ♦ సాహసవృత్తి నరాతినాశమున్
జరుపఁగఁ జొచ్చెఁ ద న్నెవరు ♦ చక్కఁగ దగ్గరఁ జేరకుండఁగన్. 139.

చ॥ జననుతశౌర్యరాశియగు ♦ చండుని ధాటిని ముందు భర్తపో
యిన యరియోధు లందఱును ♦ నెట్టఁగఁ గ్రాఁగిన యిన్పగుండు మ్రిం
గిన జనునట్టు లొక్కయెడఁ ♦ గేవల మొక్కక్షణంబు నిల్వలే
క నిలుపరాని వేదనలఁ ♦ గాంచి ధరన్ బడి స్రుక్కి రయ్యెడన్. 140.

మ॥ అల చిత్తూరుపురంబువారలనుగా ♦ కామారువార్ సీమవా
రలయం దింక జసల్ మియర్ ప్రభు భట ♦ వ్రాతంబునం దొక్కఁడున్
నిలువన్ జాలక వేగ చండుని మహా ♦ నిస్త్రింశధారాహతిన్
దలలన్ గోల్పడి నుగ్గుగాఁ బడిరి యు ♦ ద్ధక్షోణియం దందఱున్. 141

మ॥ తనగర్జారవసంగతిన్ భయదకాం ♦ తారంబునెల్లన్ బ్రతి
ధ్వనులన్ గొల్పుచు నొక్కపెట్టునను గం ♦ పం బొందఁగాఁ జేయు నా
ఘనహర్యక్షముభాతిఁ జండుఁడు మహా ♦ గర్జారవస్ఫూర్తి బో
రనఁ జిత్తూరు వడంకఁ జేసెను సదు ♦ ర్గద్వారగేహంబుగన్. 142.

చ॥ మనకుఁ గథాక్రమంబునను ♦ మాటల, వర్ణనసేయ నింతసే
పని యనిపించుఁ గాని, రణ ♦ మందు జసల్ మియరీశుఁ ద్రుంచి యా

తని సుభటాళులన్ దునిమి ♦ ద్వార మశాత్రవమున్ బొనర్పు నా
పనులకు నెల్లఁ జందునకుఁ ♦ బట్టఁగ లే దయిమున్ నిమేషముల్. 143.

చ॥ మెఱుఁగులు పోఁదు చందమున ♦ మిక్కిలి వేగముతోడఁ జొచ్చి య
య్యరులను దాఁకి ఖడ్గనిచ ♦ యంబుల వ్రేసియు బిట్టునొంచి యా
ధరపయిఁ గూల్చి యాపగిది ♦ దాయల నందఱ ఱెప్పపాటులో
దురమునఁ గూల్చి రప్డు బల ♦ ధుర్యుడు చందుఁడు వానియోధులున్. 144.

శా॥ దోర్గర్వస్థిరశౌర్యవిక్రమకళా ♦ దుర్వారుఁడై తాఁకి యా
దుర్గద్వారములందు శత్రులను గొం ♦ తుల్ గోసి కల్పాంతకృ
ద్భర్గోదగ్రుఁడు చందుఁడున్ విజయమున్ ♦ బ్రాపించి చిత్తూర్పురీ
మార్గంబున్ గొని వీడు చొచ్చె ముకుళ ♦ త్పద్మభర్త వెంటన్ జనన్. 145.

ఉ॥ ద్వారములందు నల్గడలఁ ♦ దగ్గ భటాళులు కొంద ఱుండి చి
త్తూరికి నాపయిన్ మిగిలి ♦ యుండెడు వీరభటాళులెల్ల నెం
తో రయమారఁ జందుబడిఁ ♦ దోడనె పోయిరి తీవ్రఖడ్గదు
ర్వారధగద్ధగల్ తిమిర ♦ రాశిని జీల్చి పగల్ ఘటింపఁగన్. 146.

మ॥ వరచండేశ్వరసింహనాదములు, శుం ♦ భత్తీవ్రనానాయుధో
త్కరసంఘర్షణనిస్వనంబులును, యో ♦ ధశ్రేణి వీరాట్టహా
సరవంబుల్ పురినెల్ల మేల్కొలుప, నా ♦ సంరంభ మే మంచుఁ జూ
డ రయం బారఁగ వచ్చె వెల్పలికి జో ♦ డాసింగు సైన్యంబునన్. 147.

చ॥ బిరబిరఁ జందుఁడున్ భటులు ♦ వీధులవెంటఁ బురంబుఁ జేరఁగా,
నురవడి నాత్మవీరభటుఁ ♦ డొక్కరుఁ డాతని డాసి "చందుఁడున్
సరభసవృత్తి దుర్గము న ♦ శాత్రవమున్ బొనరించి వచ్చి యీ
పురమును జొచ్చినాఁ"డనఁ బ్ర ♦ భూత మహాభయ కంపితాత్ముఁడై, 148.

గీ॥ వడివడిగ మందిరమునుండి ♦ వెడలి నూటి। పిదప నిరువదిమంది యా ♦ శ్రితులు గొలువ
నుత్తరద్వారమునను జి ♦ త్తూరు విడిచి। పోయె జోడాయి మండూరు ♦ పురముఁ జేర. 149

ఆ॥ భయ మెఱుఁగనివాఁడు ♦ బలవంతుఁ డగు; భయ। మెఱుఁగు వాఁడు బలవి ♦ హీనుఁ డగును
బలమనంగ నాత్మ ♦ బలమగు; బండెడు। కండ లుండు టదియుఁ ♦ గాదు బలము. 150.

గీ॥ భయమ! నినుఁ జేర్చుకొనిన య ♦ వ్వాఁడు మొదట। విడుచు నవమానభయ; మది ♦ విడుచు
వాఁడు: పురము బంధుల మిత్రుల ♦ గురుజనముల। విడువఁగా లేడె! యిది పెద్ద ♦ వింతయగు నె!

గీ॥ ఆజ్ఞమైన రాజస్థాన ♦ మంత వడఁకు| నిట్టి జోడాయుఁ దనవారి ♦ నెల్లవిడిచి
యర్ధరాత్రము పురివీడి ♦ యడవిఁ జేరెఁ| బ్రాణ మన నెంతతీపుగ ♦ నగపడియెను. 152.

చ॥ అవిరళధాటితో వెడలి ♦ యవ్వన మంతయు నాక్రమించు నా
దవదహనంబు వోలెఁ ద్వరి ♦ తమ్ముగఁ జందుని యోధులెల్ల శౌ
ర్యవిదితవృత్తితోడఁ బుర ♦ మంత చరించుచు మారువారువా
రెవ రెవ రుండి: రొక్కయెడ ♦ కెల్లరఁ జేరిచి యుంచి రయ్యెడన్. 153.

క॥ తనవెంట భటులు గొందఱు| చను దేరఁగఁ జందుఁ డపుడు ♦ సౌధంబునకున్
జని హంస తోడఁబుట్టులు| జనకుని వెదుకంగఁ దలఁచె ♦ సమయింపంగన్. 154.

గీ॥ ప్రక్కనున్నట్టి మేడపై ♦ నొక్కగదిని| గొప్పమంచముపైఁబడి ♦ గుఱ్ఱు పెట్టి
నిదురగొనుచుండె రణమల్ల ♦ నృపతి, తనదు| దండ లలితాలతాంగి ప♦ రుండియుండ. 155

గీ॥ విషయలోలుండు భోజన ♦ ప్రియుఁడునగుటఁ| గడుపు బరువెక్క మెక్కి యం♦గనలఁగూడి
యాసవమెయి నల్లమందెంతో ♦ యారగించె;| నెట్లు మేల్కొను! రణమల్లుఁ ♦ డెట్లులేచు!

గీ॥ ఒక్కవేళను నవ్వించె; ♦ దొక్కవేళ| నేడిపించెద; వొకవేళ ♦ నెంత పూని
నను సుషుప్తిని బొందించి ♦ మనసు చెఱచె;| దెల్ల సద్గుణములు డింద ♦ నల్లమంద! 157.

చ॥ లలితయు నూరిలోఁ గలక ♦ లంబున కొక్కతె లేచె; నంతలో
పలఁ దనమేడకున్ భటులు ♦ వచ్చెడు చప్పుడు నాలకించుచున్
"గలుగఁగరాని యేచెడుగుఁ ♦ గార్యము కల్గిన! దీడనుండఁగా
వల! దిఁక బుద్ధిచెప్పఁదగుఁ ♦ బాదయుగంబున" కంచు నెంచుచున్, 158.

గీ॥ నిలిచినంతనె క్రింద వీ ♦ ధులను సుభటు| "లేఁడి! రణమల్లుఁ డెట నుండు ♦ నిపుడ"టంచు
నఱచు ధ్వని విని లలితాల ♦ తాంగి యేమి| యాత్మఁ దలపోసెనో కాని ♦ యట్టె మఱలి,

మ॥ కడకన్ బావురుపిల్లు లెన్ని శతముల్ ♦ కాట్లాడున ట్లెంతో చ
ప్పుడు మీఱంగను గుఱ్ఱు వెట్టి నిదురన్ ♦ బోవంగ నెంతేనియున్
బొడవైయుండు రుమాలు చేకొని లవం ♦ బున్ వీడిరాకుండ నా
బిడ యప్డారణమల్లు మంచమునకున్ ♦ వేగంబ కట్టెన్ దగన్. 160.

గీ॥ భటులు కొందఱు హాహార ♦ వములతోడ| మేడసోపానముల నెక్కు ♦ జాడ దెలిసి,
వెనుకవాకిటఁ క్రిందికి ♦ వెళ్లె లలిత,| యబ్జకళ మేఘపంక్తిలో ♦ నరుగునట్లు. 161.

చ॥ 'మఱచితి మేఁడి! యేడి! రణ ♦ మల్లుఁ'డటంచు భటాళి మేడలో
జొరఁబడునంతలో నిదుర ♦ సొక్కయించుక తగ్గ, నేత్రముల్

దెఱచి భటాళిఁ గన్గొనుచు ♦ దిగ్గన లేచి యతండు పైఁబడన్
దొరకొనెఁ గాని, మంచమది ♦ తోడనె లేవఁగనీక పోయినన్, 162.

గీ॥ దండఁ బరికించె; లలిత లే ♦ కుండె! నతఁడు। 'లలిత! లలితా!' యనుచుఁ బిల్చె ♦ నెలఁత మేడ
మెట్లు దిగుచుండి 'నేరాను ♦ మేలువడయు"। మని చనియె నిదియంతయు ♦ నాత్మ నరసి. 163.

ఉ॥ "ఓసి! గయ్యాళిగంప! యయ ♦ యో! లలితా! నిను నమ్మినందుకై
చేసితె ద్రోహ మీపగిదిఁ ♦ జెల్లునటంచు, నరాతివర్గముల్
డాసిన వేళ; శాత్రవులు ♦ డాసినమాత్రన నేమి! భస్మముల్
జేసెద వీరినెల్లఁ; మసి ♦ చేసెద నిన్నును గోపవహ్నిలో." 163.

మ॥ అని యష్టా లలితాలతాంగి పెనుద్రో ♦ హంబున్ మదిన్ గాంచి తో
డనె హుంకార మొనర్చి మంచ మది వెం ♦ టన్ లేవఁగా నట్టె పూ
నినవాఁడై తగ లేచి నిల్చి యచటన్ ♦ నీరంపుఁ బాత్రంబునున్
గని పాదంబున నెత్తి చేకొనిచనెన్ ♦ గర్వోద్ధతిన్ ముందుకున్. 164.

గీ॥ వీపుపైఁ జిత్రపుంబనుల్ ♦ వెలయు నొక్క। పెద్దపటము గట్టుకొనిన ♦ 'వీరముష్టి'
భంగి మంచము తనవెన్క ♦ వైపు దనర। నలరె రణమల్లుఁ డమితభ ♦ యంకరుఁడయి. 165

చ॥ కినుకను బిట్టురేఁగి యమ ♦ కింకరు లట్టి భటాళి పైనరాఁ
గని రణమల్లుఁ డాక్షణమ ♦ గట్టిగఁ బాత్రము జేతఁ బట్టి యో
ధనికరశీర్షముల్ పగులఁ ♦ దాఁకిన, నం దొక రిర్వు రట్టె భూ
మిని బడి, రాపయిన్ భటులు ♦ మేకొని దూఁకిరి గుంపుగుంపులై. 166.

మ॥ తనుడాయన్ జనుదెంచు వీరులను హ ♦ స్తంబెత్తి పాత్రంబుతో
డనె శీర్షంబులు నుగ్గునూచమగు జా ♦ డన్ మోది యాశత్రుయో
ధనికాయంబుల ఖడ్గధార లవి చెం ♦ తన్ జేరరాకుండ నె
య్యన మంచంబును ముందువాల్చి యని సే ♦ యన్ జొచ్చె నుగ్రాకృతిన్. 167.

మ॥ తలపై మంచ మదొక్కమూర పొడవై ♦ దైవారి సర్వాంగర
క్షలఁ గావించుచు ఖేటమట్లు తనరం ♦ గా యోధకౌక్షేయధా
రలు సర్వంబు నిరర్థకంబయి దన ♦ ర్పన్ నీరపాత్రంబుదె
బ్బలతోడన్ రణమల్లుఁ డట్టె యరులన్ ♦ వ్రయ్యల్ పడన్ మోదినన్, 168.

గీ॥ వానిబారిని బడుటకై ♦ భయముఁగాంచి। వాని నెట్లోర్చుటకును ను ♦ పాయ మొండు
గానకయె మతిపోయిన ♦ కరణి వెట్టి। మొగము లగుపింపఁగాఁ జింత ♦ మునిఁగి యపుడు,

చ॥ "పదిపదునాఱుమంది రణ ♦ పండితులౌ భటు లిందు వచ్చినన్
గుదురదె వీని డీల్పఱచి ♦ గొబ్బున నేఁడు జయంబు నొందఁగా;
గుదియను గొంచుఁ బైఁబడెడు ♦ ఘోరకృతాంతునిమాడ్కిఁగా భయ
ప్రదుఁడయి యుండె నెట్లు కెడ ♦ పన్దగుఁ జందుఁడు సంతసింపఁగన్! 170.

ఉ॥ భారము గల్గి దార్ఢ్యమునఁ ♦ బర్వెడు మంచము వెన్క వ్రేల నే
ధీరుఁడు లేవనేర్చుఁ! దన ♦ దిక్కొకఁడైనను జూడకుండ! దు
ర్వారత యోధులన్ దునిమె; ♦ బాపురె! దయ్యము వీని మేనిలోఁ
జేరియయుండవచ్చు; నటు ♦ చేరక యుండిన నింత సేయునే! 171.

చ॥ అకట! జసల్ మియర్ నృపతి ♦ యంతటివానిని గెల్చె నెంతయున్
సుకరముగాఁగ నుండె; రణ ♦ శూరుఁడు వీని బలోద్ధతిన్ గనన్
సకలభటుల్ భయంపడెడు ♦ జాడలు తోఁచెడి; వీని గూల్పఁగా
నిఁక వెరవొండు గల్గెడునె ♦ యెట్టులు చందుని మోము చూతుమో!" 172.

చ॥ అని వగనొందు యోధుల మ ♦ హాబలుఁడన్ భటుఁ డానిమేషమం
దున రణమల్లునిన్ దరియఁ ♦ దోడనె దూఁకి కఠోరఖడ్గధా
ర నతఁడు భూమిఁ గూలఁగ శి ♦ రంబు తెగన్ నఱకెన్ నిజాప్తులా
తని పటు సాహసంబునకుఁ ♦ దద్దయుఁ జిత్తములందు మెచ్చఁగన్. 173.

గీ॥ ఎపుడు రణమల్లుఁ డిలఁగూలె ♦ నపుడు మొగము। లింతయై యోధు లరుదెంచి ♦ యవలవీధి
భటులతో వచ్చు చందుతోఁ ♦ బలికిరి రణ। మల్లు రణవిధమును వాని ♦ మరణవిధము. 174

గీ॥ హంసఁ గొని తేర గోసుంద ♦ కనిపి భటుల,। రాజగృహమునయందుఁ బు ♦ రంబునందుఁ
జేరి వసియించు మార్వారు ♦ వారినెల్లఁ। 'జెఱను నిల్పుఁడ'టంచు శా ♦ సించె నతఁడు. 175

మ॥ 'మనకున్ దేవుఁడు సద్గురూత్తముఁడు న ♦ స్మత్స్వామి చండేశుఁ డిం
దనుకన్ వచ్చెను; మారువారుజనులన్ ♦ దండించె; సౌఖ్యంబులన్
మనకున్ గూర్చెడి; నెప్పటట్లు కొలువన్ ♦ రండోయి! రండోయి! మీ'
రని పౌరుల్ దగ నొండొరున్ గొనుచు డా ♦ యన్వచ్చి రాసక్తిమై. 176.

క॥ మనమునను మోదమందుచు। మనుజేశసుతుండు కొన్ని ♦ మాటలతోడన్
దను డాయవచ్చు జనములఁ। గని మనముల నలరఁజేసి ♦ కార్యజ్ఞుండై. 177.

క॥ "మన మొనరింపఁగవలసిన। పనులెల్లను నడిచె నింక ♦ వడి జోడాసిం
గుని జేరి రణము చేయఁగఁ। జనవలె"నని చందుఁడపుడు ♦ శాసింపంగన్, 178.

మ॥ "నిను దర్శించుట కోటిసేయు; నసువుల్ ♦ నీవేసుమీనాయకా!"
యని చిత్తూర్పురిజు నెక్కడుర్ నిలువ కే ♦ యాబాలగోపాలముర్
ధనురస్త్రంబులు ఖడ్గముల్ గొనుచుఁ జం ♦ డస్వామినిర్ గూడి తా
మని సేయంగఁ బ్రయాణమై వెడలి రా ♦ హా! వారిమేలెట్టిదో! 179.

చ॥ తలఁపును దెల్పినంతనె శ ♦ తంబులు వేలును లక్షలై తనుర్
గొలువఁగవచ్చు యోధులను ♦ గొందఱమాత్రముఁ గొంచుఁ దక్కువా
రలఁ బురి నిల్పి యేగె సమ ♦ రంబునకుర్, దినరాడ్ధ్వజాళిరో
చు లపుడు తూర్పునర్ మొలుచు ♦ సూర్య కరంబులు వియ్యమందఁగర్. 180.

గీ॥ ప్రాణములనియ్య వెనుదీని ♦ యట్టిభటులు। కొలుచుచుండఁగఁ బయనించి ♦ కొన్నిదినము
లరుగ మండూరుపురము డా ♦ యంగఁబోయి। చండుఁ డత్యుగ్రసింహాగ ♦ ర్జన మొనర్చె.

గీ॥ అవల మండూరుపురమహా ♦ ద్వారరక్షి। కులను గొందఱ ననిలోనఁ ♦ గూల్పఁగ, హత
శేషు లటు పోయి 'జోడా'కుఁ ♦ జెప్పి రచటి। వార్తలను బూసగ్రుచ్చిన ♦ భంగి దోఁప.

మ॥ "ఇదె చిత్తూరుపురంబు వీడి యిటకే ♦ నేతెంచి యేబాధ గ
ల్గదు మండూర్పురి నుండువాఁడననుచుర్ ♦ గాంక్షించినర్ వీడిపో
వదె యీ చండపిశాచ మీనగరికిన్ ♦ వచ్చెన్ గటా! కాలునిర్
గదియర్ బంపక వీడఁ డీతఁడ"నుచుర్ ♦ గాసిల్లి చిత్తంబునర్, 183

మ॥ తనవెంటర్ జనుదెంచియున్న భటసం ♦ తానంబుఁ దోడ్కొంచు నా
ఘనుఁడుర్ వేఱొక దిక్కునర్ గలుగు దు ♦ ర్గద్వారముర్ జొచ్చి "చం
డుని కంటర్ బడకుండఁ బ్రోవగదె న ♦ న్నుర్ భృత్యులర్ దైవమా!"
యని పల్మాఱును వేఁడుచుర్ వెడలె ఘో ♦ రారణ్యముర్ జేరఁగర్. 184.

ఆ॥ కాని కాలమందుఁ ♦ గలుగవు శుభములు;। ధైర్యముండదు; సిరి ♦ తలఁగిపోవు;
రాఁగలిగినశనియు ♦ రామేశ్వరమ్మునపో। యినను దప్పదందు ♦ రిది ధ్రువంబు. 185.

మ॥ పురముర్ వీడి యరాతు లుండని వనం ♦ బుర్ జేరియుర్ వాఁడు ధై
ర్యరతిర్ బూనక యెక్కచో నిలువకా ♦ హారావళీశైల కం
దరమందుర్ వసియించు మౌనిసము స ♦ త్యస్వాంతునిర్ హార్బశం
కరుఁడ న్వానినిఁ జేరి తచ్చరణముర్ ♦ గాంక్షించె దన్బ్రోవఁగర్. 186.

గీ॥ గడియలోన జోడాసింగు ♦ నడవిఁజేర। ననిపి మార్వారు రాజ్య కా ♦ ర్యములు తగిన
యటుల సవరింపఁ దనదు సై ♦ న్యాధినాథు। నంద నిలిపి చండుఁడు పురి ♦ కరుగుదెంచి,

మ॥ తనరాకన్ మదిఁ గోరి కోరి తను సం ♦ దర్శించి యాత్మీయవే
దనముల్ దెల్పుచు సైరణన్ గొనఁగఁ జి ♦ త్తంబందుఁ గాక్షించు త
జ్జననీరత్నము హంసఁ జేరఁగ నిమే ♦ షంబందునన్ బోయి స
జ్జనచూడామణి చందుఁ డంతట నమ ♦ స్కారంబు గావించినన్, 188.

మ॥ జలజాతంబులలోని చక్కఁదన మి ♦ చ్చన్ మెచ్చఁబోనట్టి యా
తళుకుల్ నిద్దపు ముద్దు కన్నులను ము ♦ త్యంబుల్ వలెన్ బాష్పపుం
జలముల్ ధారలుగార గద్గద గళ ♦ స్వానంబు వాసంత కో
కిలకాంతా కలమంజుల స్వనములన్ ♦ గేరంగ నాహంసయున్, 189.

మ॥ "కొమరా! నీవు మహామహుండవును; నీ ♦ కున్ గుచ్చితంబుల్ గువా
డము శత్రుత్వము లేదు; బోటి యొకమా ♦ టన్ దెల్ప నీబంట్ల వే
గమె యిందంపియు నీవు వచ్చియు విప ♦ క్షశ్రేణులన్ గూల్చి దై
వమవై ప్రోచితి నన్ను నాతనయు నీ ♦ స్వాంతంబు మెచ్చందగున్. 190.

గీ॥ సమయమున నీవు వేంచేసి ♦ సాయపడక। యుందువేని నేనును బుత్రుఁ ♦ డొకఁడెకాక
యెల్లరాజపుత్రస్థాన ♦ మెట్టిదశకుఁ। బాలుపడియుండునో యిప్డు ♦ పలుకవశమె! 191.

సీ॥ అకట!నావలన నీ ♦ వావంతయును మేలు పడయమి యటులుండఁ ♦ బైన నెన్ని
యిడుమలో పడితి; నా ♦ కొడుకునకై రాజ్యవిభవంబు విడిచితి; ♦ పిదప నేను
దప్పుఁదలఁచి మాతృ ♦ ధరణికి సకలబంధులకు మిత్రులకును ♦ దూరగునిగఁ
గావించితిని; కట్ట ♦ కడకు నాబుద్ధిలోపమున నే నిటఁ జేర్పఁ ♦ బట్టి నాదు

గీ॥ తండ్రి యత్యంతనిత్యస ♦ త్యవ్రతాఢ్యు। నిర్మలాత్ముని రఘుదేవు ♦ నీయనుజునిఁ
జంప నవకాశమిచ్చి నీ ♦ స్వాంతమును ద। హించి పగదాననైతిఁ జు ♦ మ్మాకుమార!192

మ॥ ననుఁ బూర్వంబున వీడిపోవునపు డ ♦ న్నా! నీవు నాతోడఁ బ
ల్కిన యాసూక్తులు నీవు దూరమయితో ♦ లేదో క్షణంబందె య
ల్లన నొక్కొక్కఁడు నాకు సత్యమయి ని ♦ ల్వన్ జొచ్చె నోపుత్ర! దే
వునిచందంబునఁ బల్కు నీదువచనం ♦ బుల్ వ్యర్థమై పోవునే! 193.

ఉ॥ సాకును సంతరించు నను ♦ స్వర్గమునందునఁ జేర్చు నంచు నేఁ
జేకొని నాదుగేహమునఁ ♦ జేర్చినఁ దండ్రి మహాపకారముల్
నాకుఁ దలంచె; మోక్షము గ ♦ నన్ మదిఁగోరుచు గంగ మున్గినన్
భీకరనక్ర మొక్కమొగి ♦ మ్రింగిన చందము రూఢిచేయుచున్. 194.

చ॥ జనకుని దుండగంబులకుఁ ♦ జాలఁగఁ జింతిలి యొక్కనాఁడు నేఁ
గని తగ మందలింప ననుఁ ♦ గాదని కాఱులు పల్కి పైన "నీ
తనయుని రాజ్యలక్ష్మి యది ♦ తప్పక చేకొని వాని ప్రాణమై
నను గొనువాఁడఁ బో"మ్మనుచు ♦ నన్ను నదల్చి విదుల్చె నక్కటా! 195.

గీ॥ జనకు దౌర్జన్య మింతని ♦ యనఁగఁజాలఁ। బావనాత్మకుఁడగు రఘు ♦ దేవుఁబట్టి
యుఱక చంపించె సంతత ♦ ముర్విజనులు। విడని శోకాబ్ధి మునిఁగి త ♦ పించుచుండ. 196

క॥ కలతెఱఁగెల్లను నీకును। దెలిపి యిటకు వేగఁ దోడి ♦ తెమ్మని హస్తం
బులు పట్టి వేఁడిపంపితి। మెలఁతుక నాచంద్రవదన ♦ మృదుగుణసదనన్. 197.

ఉ॥ నావలనన్ జనించిన ఘ ♦ నంబగు నాపదలన్ ముదంబునన్
భావమునన్ భరించి యిట ♦ వచ్చియుఁ గ్రమ్మఱ మేలు గూర్చి స
ద్భావము నిష్కళంకమృదు ♦ వర్తనమున్ మఱి త్యాగబుద్ధి నెం
తే వసుధాజనంబు విను ♦ తిన్ బొనరింప మెలంగితో సుతా! 198.

గీ॥ వనితనగుటను జాంచల్య ♦ వశత మంచి। చెడ్డ లెఱుఁగక దీర్ఘద ♦ ర్శిత్వ మింత
గనక నిను నొప్పిపెట్టినం ♦ జునకు నెట్లు। పరితపించు నామనసు దై ♦ వమ యెఱుంగు.199

గీ॥ ఎప్పటట్టులు కూర్మి వ ♦ హించి నాకు। సాయపడియున్నయట్టి నీ ♦ సరళహృదయ
మీయెడను నీవు నను క్షమి ♦ యించినాఁడ। వనుటకును సాక్షి యయ్యె; నే ♦ నడుగనేల!

క॥ మరణించిన రఘుదేవుని। మఱలన్ గొనితేర వశమె ♦ మనకుఁ! జతుస్సా
గరవృతమేదిని నెనఁగినఁ। దఱుగదు తద్దుఃఖభరము ♦ తనయా! నీకున్. 201.

క॥ అది తప్పఁగ మిగిలిన యా। పదలన్నియుఁ ద్రుటెని ♦ బంచబంగాళంబై
చెదరంగఁగలవు, నీమృదు। హృదయంబున నాదు మనవి ♦ యెక్కనయేని. 202

సీ॥ ప్రియకుమారక! నీవు ♦ వేగ హల్లూర్పురంబునకుఁ బోవఁగ బుద్ధి ♦ గొనఁగవలదు;
తాత ముత్తాతల ♦ తరములనుండి మీదైన మేవాడసిం ♦ హాసనమును
గొని నీవు నీపుత్ర ♦ కులును బారంపర్యముగ సుఖంబున రాజ్య ♦ మును సలుపుఁడు;
రాజమాతయనెడు ♦ ప్రఖ్యాతికన్న నీపినతల్లియనుటెంతో ♦ పేర్మి నాకు;

గీ॥ మాట జవదాటనట్టి స ♦ న్మానఘనివి। కాదనక గొప్పబుద్ధి వా ♦ గ్దానమొసఁగు
మానతియుఁ గోర్కె వరమిది ♦ యని తలంపు। వన్న! నాప్రార్థనంబు ద్రో ♦ యఁదగదన్న."

మ॥ అని నిష్కల్మషపూర్ణమానసముతో ♦ నాహంస ప్రార్థించినన్
విని సస్మేరముఖాంబుజంబు వినయో ♦ ద్వేలప్రభల్ గుల్క నా

యనఘగాత్రిమణి చండుఁ డిట్లనియె "స♦మ్మా! కోమలంబైన నీ
మన మత్యంతము సౌఖ్య మిచ్చి యలరిం♦పఁ జాగెఁ న న్నీవెయెడన్. 204.

మ॥ తఱితో వచ్చి భవత్పదాబ్జముల సం♦దర్శించుటన్ నీకడన్
మఱి నాతండ్రికడన్ బొనర్చిన ప్రతి♦జ్ఞన్ దీర్చి ధర్మంబు సు
స్థిరతన్ గొల్చితి; రాకయున్న లఘుధా♦త్రీ భర్తకున్ నీకు ని
ర్వ్యర పాదంబుల కేను దప్పనె! యఘం♦బుల్ రావె! మాతల్లిరో! 205.

మ॥ ముకుళుం డీవు విపత్తులన్ గనుట కె♦ట్లున్ గుందుఁ జిత్తంబు; మీ
రిఁక సౌఖ్యంబున నుండఁ జూచుటయె నా♦కిష్టంబు; రాజ్యంబు నిం
తకుఁ బాలింపఁగఁ గోర; నీమహితసం♦స్థానంబు మా కేటికిన్
సకలక్ష్మాతలరాజ్యమున్ దృణముక♦న్నన్ లొచ్చుగాఁ జూచెదన్. 206.

చ॥ అది యిది నాకుఁ గావలయు♦నంచొకయింతయుఁ గోర్కి లేదు నా
హృదయమునందు; నీయిడుమ♦లెక్కువయా తఱి నాకుఁ దెల్పి నీ
పదములు గొల్వఁగాఁగలుగు♦భాగ్యము నాకును గూర్చియుంటి; నా
కిదె పదికోట్లుసుమ్మ క్షితి♦నేలఁగఁ గోర్కులు లేవు తల్లిరో! 207.

మ॥ నను మన్నింపుము, రాజ్యమేలుమని యా♦జ్ఞాపింపఁగాఁబోకు, నా
మనసైనట్టులు పోవని, మ్మెటులనే♦మాతల్లి! హాల్లూరునం
దున రాజ్యం బొనరింతుఁగాదె! ముకుళుం♦డున్ నీవు సౌఖ్యంబునన్
మనఁగాఁజూచుటె ముఖ్య మద్ది స్థిరమై♦నన్ లోటులే దమ్మరో! 208.

గీ॥ ఏను మండూరుపురికి దం♦డెత్తిపోయి పోరొనర్చి నీయగ్రజుఁ♦బాఱఁదోలి
మూరువారు గ్రహించితి♦మాత! ముకుళు నందుఁ బట్టభద్రుని జేయ♦ననుమతింపు.209

మ॥ ఇఁక నీకూరిమి లోప మెందయిన నా♦కేపారఁగాఁబోదు; మ
చ్చిక మన్నించుచు నప్పుడప్పుడును నా♦శీర్వాదమున్ జేయుమీ!
యొక యేనూఱులుకోట్లుచేయు నది సు♦మ్మోతల్లి!" యంచాడ న
వ్వికచాంభోజదళాక్షి హంసయుఁ గడున్♦వేగంబ తానిట్లనున్. 210.

గీ॥ "ఇంతదాఁక నాయన! భవ♦త్కృతమహోప కారములు మోసియున్నవి♦భారమగుచు
నాపయిని; మత్కృతజ్ఞత♦నేపగిదిని దెలుపుకొనఁగల్గుదాన నో♦ తెలియనైతి. 211.

గీ॥ ముకుళునకు రాజ్యమిచ్చితి♦మొదట; మొన్న నిరువురకు మాకుఁ బ్రాణంబు♦లిచ్చితిపుడు
రాజ్యమును దెచ్చితివి కీర్తి♦ప్రబలఁజేయు నుంటి వేటు మోవఁగల మిన్ని♦యుపకృతులను.

గీ॥ అయ్య! మాపాలిదైవంబ ♦ వగుదు వీవు! భవదుదారవర్తనమున ♦ స్వాంత మలరె;
నింక నొకకోర్కిఁ గలదు నీ ♦ కిపుడు దానిఁ దెలుపుకొనుదాన; నది తీర్ప ♦ వలయుఁజుమ్మి!

మ॥ కడు మోదంబును బొందుదాన నటులన్ ♦ గావించినన్; నాదు పు
త్త్రుఁడు మాతామహురాజ్యలక్ష్మిఁ గొని నా ♦ థుండౌచుఁ బాలించు నే
ర్పడఁ; జిత్తూర్పురరాజ్యలక్ష్మిఁ గొనుచున్ ♦ బాలింపుమీ! నీవు; నే
నడుగన్ వచ్చును నిన్ను; నీవు నిటు చే ♦ యన్ వచ్చు నోపుత్త్రకా! 214.

మ॥ అనుజుం డేలఁగ నేనె మున్నొసఁగి యి ♦ ష్టారాజ్యమున్ గ్రమ్మఱన్
గొనఁగా నేర్తునె!' యంచు నీవు మదిఁ గొం ♦ కున్ జెందెదేనిన్, రణా
వని నార్జించితిగాదె! యామహితమా ♦ ర్వార్ రాజ్యమున్ గొమ్ము; గె
ల్చిన రాజ్యంబున కీవు రాజవయి పా ♦ లింపంగ న్యాయ్యంబగున్. 215.

ఉ॥ ధీరత మున్నొనర్చిన ప్ర ♦ తిజ్ఞకు భంగము కల్గఁబోదు మా
ర్వారు ప్రతిజ్ఞఁజేర దిత ♦ రప్రభు రాజ్యము గాన; నింక హా
ల్లూరున కేగుబుద్ధి విడు ♦ మోసుత! శౌర్యధనార్జితంబు మా
ర్వారును నీవు చేకొన భ ♦ వన్మనమందున సమ్మతింపుమా! 216.

మ॥ జనకుండో లఘుఁ డేలి నీకిడిన రా ♦ జస్థాన మిందుండ పా
వనదుర్వారపరాక్రమార్జితము మా ♦ ర్వార్ దేశముండంగ వీ
నిని బాలింపక బీదపోల్కిఁ నెటకే ♦ నిన్ బోవఁగానేల! నీ
వనుమానంబును మాని యిచ్చటనె రా ♦ జ్యం బేల యత్నింపుమా! 217

మ॥ నను బాటించుచు నిందు నిల్చినను స్వాం ♦ తంబందుఁ గోపంబు నీ
కును లేదం చనుకొందుఁ; గానియెడ నా ♦ కున్ రాజ్యమేలా! పురం
బును బోనాడుచు నేను పుత్త్రుఁడు వనం ♦ బుల్ చేరఁగాఁబోదు మెం
దున కీరాజ్యము! దేవతుల్యుఁడవు ని ♦ న్నున్ బాయునట్లుండినన్. 21

మ॥ కినుకన్ బూనకు మయ్య! నాపయి; ననున్ ♦ భేదంబునున్ బొందఁగా
నొనరింపన్ దగునయ్య! నిన్విడిచి యీ ♦ యుర్వీమహారాజ్య పా
లనముల్ శాశ్వతదుఃఖభాజనము లే ♦ లా! మాటలున్! నన్ను మ
న్ననమైఁ జూడుము నిల్వు మిందుఁ; దగద ♦ న్నా! నన్ను నొప్పింపఁగన్." 2

మ॥ అని యెంతేనియు దైన్య ముట్టిపడఁగా ♦ నాహాంస ప్రార్థించినన్
విని చండుండు విధేయతాగరిమ మెం ♦ తేఁ దోఁప "నోతల్లి! నీ

మనసున్ గారియపెట్టి నేఁ బడయు సా ♦ మ్రాజ్యంబు నేనిన్ దృణం
బని భావించెద; నిన్నుఁ గొల్చుటకుఁగా ♦ దా! నేను జీవించుటల్. 220.

మ॥ జననీ! నే నిట నున్న నీవు సుతుఁడున్ ♦ సౌఖ్యంబులన్ గాంతురం
చని నీవెంచిన నీనిమేషమున నా ♦ హల్లూరు చాలించి యీ
డనె నీపాదయుగంబు నేఁ గొలుచువాఁ ♦ డన్ నిల్చి; నాజీవముల్
తనువం దుండెడి కాలమంతయును శ్ర ♦ ద్ధాభక్తు లొప్పాఱఁగన్. 221.

చ॥ మనసున మాటలన్ గ్రియల ♦ మాతరొ! నీకు విధేయుఁడైన నీ
తనయుఁడ! నన్ను నన్యుని వి ♦ ధంబున నింతటిదూర మిట్లు ప్రా
ర్థన మొనరింప నేటికిఁక! ♦ రాజ్యముఁ గొమ్మను మాట మాను; నీ
తనయుని గొల్చి యిచ్చటనె ♦ తప్పక నిల్చెద నీయనుజ్ఞమై. 222.

గీ॥ ఇపుడుగా దెప్పుడేనియు ♦ "నీవు రాజ్య। మును గొను"మటంచు నన్ను నీ ♦ వనఁగఁబోకు
"మిచటు విడనాడి పరరాజ్య ♦ మేలఁబోవు। వాఁడ"నని యెప్పుడును నేను ♦ బలుకఁబోను.

ఉ॥ ధారణినాథు లందఱు ప ♦ దంబులు గొల్వఁగ నీకుమారు, మా
ర్వారునఁ బట్టభద్రుని ది ♦ రంబుగఁ జేసెదఁగాని దీనికిన్
వేఱుగ నానతీకుమ"ని ♦ వేఁడి మృగేక్షణ సమ్మతింపఁగా
వీరుఁడు చండుఁ డెల్లెడల ♦ వేగమ చాటఁగఁ బంచె వార్తలన్. 224.

చ॥ ఉరుముద మొప్పఁగా శుభము ♦ హూర్తమునందున మారువారులో
ధరణివరోత్తముల్ మృదుప ♦ దంబులు గొల్వఁగ సర్వభూజనో
త్కరములు చూడఁగా ముకుళుఁ ♦ డద్దయు వైభవ ముల్లసిల్ల సం
బరమున రాజుఁ జేసె గుణ ♦ వంద్యుఁడు చండుఁడు లోకమాన్యుఁడై. 225.

మ॥ తనకీర్తిస్ఫురణంబు దిక్కుల నమం ♦ దజ్యోత్స్నలన్ జిల్క భూ
జనులున్ మెచ్చుచు రామరాజ్యమని హ ♦ ర్షంబొందఁ జండేశుఁడున్
మనిపెన్ భూప్రజ; వానిపాలనమునన్ ♦ మార్వారు మేవాడ లో
య్యనఁ బూఁదోటలభంగిగా నెదిగె న ♦ త్యామోదముల్ గుప్పుచున్. 226.

సీ॥ గుమ్మడిపండట్టి ♦ కొడుకులు పెక్కురు గలిగిరి; పసుపుగం ♦ పలనుబోలు
తనయలు ప్రభవించి ♦ రనుకూలవతి భార్య యలయరుంధతియె యం ♦ చనఁగవలయు;
ముకుళుని లఘునృపా ♦ లకుడాఁగ హంసను దనకన్నతల్లిగాఁ ♦ దలఁచి మెలఁగె;
మార్వారుమేవాడ ♦ మహితసీమల రెండుకనులట్లు చూచి పా ♦ లన మొనర్చె;

గీ॥ దేశభక్తియుతుఁడు ♦ ధీరుండు చండుండు। దేవుఁడనుచుఁ బ్రజలు ♦ దినముఁ బొగడ
శుద్ధకీర్తిపరుఁడు ♦ చోండావదన్వయం। బును వెలుంగఁజేసెఁ ♦ బుడమియందు. 227

క॥ శ్రీలఁ దనరారి సూర్యకు। లాలంకారుండు చండు ♦ నాదరమున ము
త్యాలగొడుగట్లు వెలుఁగుచు। సాలుంబ్రాసీమ కీర్తి ♦ సాంద్రంబయ్యెన్. 228

సీ॥ చండేశు దొడ్డవం ♦ శంబు చోండావత్కులంబునా నెగడి య ♦ శంబుఁగాంచె;
నప్రతిహతముగా ♦ నతని వంశమువారె శాశ్వతరీతిని ♦ సచివులయిరి;
యతులయశస్సాంద్రుఁ ♦ డగు రత్నసింహుండు, శాత్రవసమవర్తి ♦ సాహిదాసుఁ,
డీరేడుజగముల ♦ నింతటివాఁడు లేఁ డెందన మెలఁగిన ♦ కృష్ణసింహ

గీ॥ మూర్తి, చోండావదన్వయాం ♦ భోధియందు। నవతరించిన కుముదబాం ♦ ధవసమానుల
ల్ల మేవాడకే గాక ♦ యాత్రిభువన। పటలమున కెత్తు రత్నదీ ♦ పత్రయంబు. 229

క॥ సమబుద్ధియు నాత్మవికా। సము త్యాగము నెఱపునట్టి ♦ చండేశు చరి
త్రము భువి నాశశితారా। ర్కము బుధజను లభినుతింప ♦ రాజిలుఁగాతన్. 230.

గద్య:—ఇది శ్రీమత్కామేశ్వరీ కరుణాకటాక్ష వీక్షా సమాసాదితరసవత్కావ్య
నిర్మాణ చాతురీధురీణ, సుగుణగణపారీణ, దుర్భాకవంశ దుగ్ధాంభోరాశి
రాకాకైరవమిత్ర, శాలంకాయనగోత్ర పవిత్ర, సుజన జనాను
గ్రహపాత్ర, వెంకటరామార్య పుత్ర, కవిసింహా వధాని
పంచాననేత్యాది బిరుదవిఖ్యాత, సుకవి రాజ
శేఖర, రాజశేఖరకవి ప్రణీతంబయిన
చండ నృపాలచరిత్రం బను
పద్యకావ్యము నం
దుఁ దృతీయా
శ్వాస
ము
సంపూర్ణము.

---

ప్రొద్దటూరు శ్రీకన్యకాపరమేశ్వరీముద్రాక్షరశాలయందు ముద్రితము.

కవిసింహ, అవధాని పంచానన, కావ్యకళానిధి

జి. రాజశేఖరశతావధానిగారి

# గ్రంథములు.



వీరమతి:—800 పద్యములుగల కావ్యము. వీరరసప్రధానము. ఒక్కదిన మొకగంటలోఁ బదునొకండుగురు దుర్మార్గుల నఱికిన వీరనారీమణి చరిత్రము. వెల రు 1—0—0

పద్మావతీవిజయము:—మహోదాత్తగుణ స్ఫురణముగల యొక వీరనారీమణిని గుఱించిన నాటకము. శృంగారహాస్యములు వెల్లివిరియుచుండును. వెల రు 1—0—0

సీతాకల్యాణము:—శ్రీరామజననము మొదలు రామపరశురామ సమాగమమువఱకుఁగల కథ రసవంతముగ వర్ణింపఁబడిన యైదంకముల నాటకము. వెల రు 0—8—0

అవధానసారము:—రాజశేఖర-వెంకటశేషకవు లాంధ్రదేశమున నొనరించిన యష్టావధాన శతావధానముల కథనము. అనేకులు కవుల కవిత్వవైఖరు లిందుఁ జదువవచ్చును. వెల రు 0—8—0

వృద్ధిమూలసంవాదము:— వడ్డి విజృంభణాదికములను దెలుపు 2 అంకముల నాటిక. అద్భుతము గొలుపుచుండును. వెల రు 0—2—0

వలయువారు:—

జనోపకారిణీస్టోర్సు, ప్రొద్దుటూరు.

అని వ్రాయవలెను.

—0—

విలయమాధుర్యము:—120 పేజీలుగల స్వప్నగ్రంథము. చంపూకావ్యము. అనేకాద్భుత కథలుగల రమణీయ గ్రంథము. గృహములు కట్టుకొనుట మంచిదా లేదా యను నంశము నిరూపించుచుఁ జదువఁ జదువ రస ముట్టిపడుచుండును. వెల రు 0—8—0

చండనృపాలచరిత్రము:—700 పద్యములుగల కావ్యము. భీష్ముని చరిత్రమునకుఁ బ్రతిరూపము. వీరముప్పొంగించును. వెల రు. 0—12—0

వలయువారు:—

జి. వేంకటశేషశాస్త్రి శతావధాని, ప్రొద్దుటూరు.

అని వ్రాయవలెను.

# రాణా ప్రతాపసింహ చరిత్రము.

—— ౦ ——

సత్యమైన చరిత్రము. అనేకగ్రంథములనుండి సేకరింపఁబడిన నిజమైన యంశములు. ప్రమాణము లందందుఁ జూపఁబడినవి. 2000 పద్యములు. చరిత్రమంతయు వీరరసస్ఫురితము. రాణాప్రతాపసింహుఁడు రాజలోకగురుఁడు. భానువంశసుధాసాగరము నుప్పొంగఁజేసిన రాకాచంద్రుఁడు. సైన్యబలము, దుర్గబలము, రాష్ట్రబలము, లేక, తినఁ దిండియుఁ గట్టఁబుట్టములులేక, భార్యతోఁ, బదునేడుగురు పిల్లలతో నరణ్యములలో వర్ణింపరాని విపత్తులఁబడియు నక్బరునంతటి విశ్వలోకసార్వభౌముని బ్రతిఘటించి తన దివ్య స్వాతంత్ర్యము నిలుపుకొని జగంబున కాదర్శప్రాయుఁడైన విశ్వవీరుఁడు. త్రికాలములలో నింతటి ధర్మనిష్ఠుఁడు నింతటి స్వాతంత్ర్యప్రియుఁ డింతటివీరుఁ డింతటి సహనపరుఁడు లేఁడని కీర్తిఁగాంచిన మహానాయకవతంసము. ఆశ్వాసమున కాశ్వాసము, పుటకుఁబుట, పద్యమునకుఁ బద్యము, చరణమునకుఁ జరణము చవులూరుచుఁ బఠితల నావేశమునఁ దేల్చును. ఈచరిత్రమును విని యింత జగద్వీరచూడామణి లేఁడని మెచ్చి తలయూఁపనివాఁ డుండఁడు. దేశభక్తి, స్వాతంత్ర్యపిపాస, త్యాగము, స్వధర్మానుష్ఠానము మూర్తీభవించి గ్రంథమునఁ దాండవమాడు చుండును.

సీ॥ పొలతిఁ బుత్రుని వీడి మూఁడేండ్లు శ్రీహరిశ్చంద్రుండు పడిన కష్టముల నెఱిఁగి,
పదునాలుగబ్దముల్ వనవాసమున రామచంద్రుఁడు పడిన కష్టముల నెఱిఁగి,
పదియుమూఁడేండ్లుగాఁ బాండవుల్ గహనాంతరములలోఁ బడిన కష్టముల నెఱిఁగి,
యిరువదిమూఁడేడులీ వీ వనులఁ గుటుంబముతోడఁ బడిన కష్టముల నెఱిఁగి,

గీ॥ తారతమ్యంబుతూఁచిన వారియిడుమ। లత్యగాధాపదావర్తమైన నీదు
చరితమున నెక్కపుట కొక్కచరణమునకు। సాటిగావని గొంతెత్తి చాటనేర్తు.

"సలుంబ్రా కృష్ణసింగు"

ఇట్టి యమూల్యగ్రంథ మాంధ్రవాఙ్మయమున నింతవఱకు లేదనుట యతిశయోక్తి కాదు.

వెల. రు 1—8—0

వలయువారు:— పి. ఆర్. సుబ్రహ్మణ్యయ్యరుగారు బి. ఏ. యల్. టి.
హెడ్‌మాష్టరు, మునిసిపల్ హైస్కూలు,
ప్రొద్దుటూరు.
అని వ్రాయవలెను.